మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

ఏప్రిల్ - జూన్ 2011

భారతదేశం

2001 - 1000 : 927

2011 - 1000 : 914

దేనికి సంకేతం ?




రంగారెడ్డి




హైదరాబాద్




విశాఖపట్టణం




హైదరాబాద్




నల్లగొండ




విజయవాడ

అంతర్జాతీయ మహిళా దినోత్సవ దశాబ్ది ఉత్సవాల ముగింపు సందర్భంగా ఐద్వా ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమాల మాలిక

# హింసకు అంతే లేదా?

## సంపాదకీయం...

రాష్ట్రంలో మహిళలపై ముఖ్యంగా మైనర్ బాలికలపై జరుగుతున్న దాడులు స్త్రీల మనుగడనే సవాలు చేస్తున్నాయి. శాస్త్ర సాంకేతిక రంగాలలో దేశం పురోగతి సాధిస్తున్నప్పటికీ మహిళల పరిస్థితులు నానాటికీ దిగజారుతున్నాయి. మహిళా సాధికారత కాగితాలకే పరిమితమైంది. స్త్రీ, పురుష సమాన స్థాయి లభించకపోగా ఇల్లు, బడి, గుడి, కళాశాల, కార్యాలయాలు, బస్సులు, రైళ్ళు చివరికి రక్షక భట నిలయాలు ఒకటేమిటి అన్ని చోట్లా మహిళలు అవమానాలకు, అఘాయిత్యాలకు గురవుతున్నారు. కట్న కానుకల పేరుతో నవ వధువులను కాల్చి చంపే విష సంస్కృతికి తెరపడలేదు. ప్రేమ పేరుతో ఉన్మాదం పడగ విప్పి బుసలు కొడుతోంది. ప్రేమను తిరస్కరించిన ఆడపిల్లల్ని మృగాళ్ళు అతి కిరాతకంగా కడతేరుస్తున్నారు. పెళ్ళికి అంగీకరించలేదనే ఆక్రోశంతో కాలేజీ ఆవరణలోనే బి.ఇడి విద్యార్థిని సారికను చంపి పాతిపెట్టిన ఘటన తెరపడకముందే కూకట్‌పల్లి పోలీస్‌స్టేషన్‌లో మహిళా పోలీసును తుపాకీతో కాల్చాడో ఉన్మాది. విశాఖ జిల్లా అరకులో అధ్యాపకురాలిని ప్రేమ తిరస్కంచిందని నిండు ప్రాణాలు బలి తీసుకున్నాడు మరో క్రూరుడు. కన్న తండ్రే కామ పిశాచిగా మారి కన్నబిడ్డలపై అఘాయిత్యాలకు పాల్పడుతున్న ఘటన సభ్య సమాజం తలదించుకోవల్సిన పరిస్థితులేర్పడుతున్నాయి. దేశ రాజధాని ఢిల్లీలో పట్టపగలు బస్టాప్‌లో నిలబడ్డ యూనివర్శిటీ విద్యార్థిని బలవంతంగా కారులో ఎక్కించుకుని అత్యాచారానికి ఒడి గట్టాడు ఒక వ్యాపారి. రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నడిబొడ్డులో ఇంటర్ విద్యార్థినిని మానభంగం చేసి ప్రాణాపాయ స్థితిలో వున్న ఆమెను నడిరోడ్డుపై వదిలేశాడు. ఈ కిరాతకాలు చాలవన్నట్లుగా కుల క్రౌర్యము పడగవిప్పి పరువు పేరిట కులాంతర వివాహాలు చేసుకున్న అమాయకులను బలి తీసుకోవటం మనం ఆటవిక సమాజంలో ఉన్నామా? అని ప్రశ్నించుకోవల్సి వస్తుంది. ఉత్తరాది రాష్ట్రాలలో జరుగుతున్న కుల దురహంకార హత్యలపై ఆధునిక సమాజంలో ఈ అనాగరిక చేష్టలేమిటని సుప్రీం కోర్టు తీవ్రంగా స్పందించింది. సంఘ సంస్కరణ ఉద్యమాలకు ఊపిరి పోసిన ఆంధ్ర ప్రదేశ్‌లో కులరక్కసితో మహబూబ్ నగర్ జిల్లాలో దళితుడిని వివాహమాడిందని కన్నతల్లి, బంధువులే యమ కింకరులై గర్భిణీతో ఉన్న మాధవిని రాళ్ళతో దాడిచేసి ఆపై పెట్రోల్ పోసి సజీవ దహనం చేశారు. దళిత యువకుడ్ని ప్రేమించానని, పెళ్ళి చేసుకుంటానని చెప్పిన కూతుర్ని దారుణంగా హత్య చేసి ఆత్మహత్యగా చిత్రీకరించే ప్రయత్నం చేశాడు శ్రీకాకుళం జిల్లాలో ఒక కుల దురహంకారి.

జాతీయ నేర పరిశోధనా లెక్కల ప్రకారం మహిళలపై జరుగుతున్న నేరాలలో మన రాష్ట్రం 13.5 శాతంతో ప్రథమ, ద్వితీయ స్థానాలలోఉంది. రాష్ట్రంలో మహిళలపై అత్యాచారాలు, వరకట్న వేధింపులు, లైంగిక వేధింపులు, ఆడపిల్లల అక్రమ అమ్మకాలు, ప్రేమ పేరుతో ఉన్మాదుల దాడులు, వరకట్న హత్యలుపెద్ద ఎత్తున జరుగుతున్నా ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లు ఉంది. రక్షించాల్సిన పోలీసులే యధేచ్ఛగా స్త్రీలపై నేరాలకు పాల్పడటం, ఫిర్యాదు చేయటానికి వెళ్ళిన బాధితురాలిని అవమానించటం, కేసుల పట్ల రాజీ వైఖరి, సాచివేత, నిర్లక్ష ధోరణి అవలంభించటం, నేరస్థులను కాపాడేందుకు రాజకీయ నాయకుల జోక్యం, నేరాల పెరుగుదలకు దోహదపడుతుంది. అత్యధిక కేసులలో బాధితులకు న్యాయం జరగకపోగా ప్రభుత్వం, పోలీసులు న్యాయ వ్యవస్థ వ్యవహరించే తీరు మరింత మానసిక క్షోభకు దారితీస్తుంది. హర్యానాలో మైనరుబాలిక రుచిక రేప్, హత్య కేసులో 18 సంవత్సరాలు కోర్టులో కేసు నడిచింది. పోలీసు ఉన్నతాధికారే (డిజిపి) నేరస్థుడు. కోర్టు 6 నెలల శిక్ష మాత్రమే విధించింది.

మహిళలపై దాడులకు అకృత్యాలకు అడ్డు అదుపు లేకుండా పోతోంది. స్త్రీల పట్ల వున్న చిన్న చూపు, చులకన భావం, నోరెత్తరనే భావన, పరువు ప్రతిష్టలకు వెరసి ఎవరికీ చెప్పుకోలేరనే ధైర్యం, తరతరాల నుండి అణువణువునా మూటగట్టుకున్న పురుషాధిక్యత మహిళల జీవితాలతో చెలగాటమాడుతోంది. ప్రపంచీకరణ విధానాల ప్రభావం సమాజంలో, కుటుంబ జీవితంలో అనివార్యంగా మార్పులు చోటుచేసుకున్నాయి. ఉమ్మడికుటుంబాలు అంతరిస్తున్నాయి. టీనేజ్ పిల్లల్లో వస్తున్న సహజసిద్ధమైన మార్పులు, వారి ఆలోచనా ధోరణులు గురించి పట్టించుకునే తీరిక తల్లిదండ్రులకు లేదు. పాకెట్‌మనీ ఇచ్చి వారి బాధ్యత తీరిందనుకుంటున్నారు. నేడు అమ్మాయిలకు బాయ్‌ఫ్రెండ్స్, అబ్బాయిలకు గర్ల్‌ఫ్రెండ్స్ వుండటం స్టేటస్ సింబల్‌గా మారింది. పార్క్‌లు, పబ్‌లు, బార్‌లు, సినిమాలతో ఎంజాయ్‌చేయటం పరిపాటైంది. ఇంటర్‌నెట్‌లు, సినిమాలు, యువతను భ్రష్టు పట్టించేవిగా వుంటున్నాయి. పూర్వం దేశం కోసం ప్రాణత్యాగం చేసిన భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు లాంటి ఎందరో మహానుభావులను రోల్‌మోడల్స్‌గా తీసుకునేవారు. నేటియువత సినిమాలలో హీరోలనే రోల్‌మోడల్‌గా భావిస్తోంది. యువతను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాల్సిన కుటుంబానికి, కార్పొరేట్ విద్యాలయాలకు, సమాజానికి తీరికలేదు.

సమాజంలో స్త్రీలపై జరుగుతున్న అన్యాయాలకు వ్యతిరేకంగా సంఘటితంగా పోరాడాలి. ప్రభుత్వం, పోలీసు యంత్రాంగం, న్యాయవ్యవస్థ మహిళల ఎడల వ్యవహరిస్తున్న ఉదాసీన వైఖరికి వ్యతిరేకంగా పోరాడాలి. పోరాడి సాధించుకున్న చట్టాలు అమలు కోసం ఉద్యమించాలి. స్త్రీల పట్ల వివక్షత, అసమానతలకు వ్యతిరేకంగా సమానత్వపు హక్కుల కొరకు, పురుషాధిక్యత భావజాలానికి వ్యతిరేకంగా గళం విప్పాలి. మీడియాలో వస్తున్న అశ్లీలత, మిడ్‌నైట్ మసాలా, నేరపూరిత కథనాలకు వ్యతిరేకంగా ఉద్యమించాలి.

చైతన్య మానవి

ఈ సంచికలో...




అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం

రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్:2,
1-8-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్
ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు
ఎస్. పుణ్యవతి

మేనేజర్
ఎం. సుధ

సంపాదక వర్గం
మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

విరాళం రూ : 10/-

ప్రజాశక్తి డైలీ ప్రింగ్‌ప్రెస్, హైదరాబాద్ - 500 020


## నిన్నుగ నీలో నన్ను చూసుకో

అమ్మా....అమ్మా
నేను నీ గర్భంలో ఉన్న శిశువును
ఇప్పుడిప్పుడే ఊపిరి పోసుకుంటున్న
నీ ప్రాణానికి ప్రాణాన్ని
నన్ను ఒక్కసారి నీ మనస్సుతో చూడవా
ఎప్పుడెప్పుడు నేను
నీలో నుండి నీ దగ్గరకు వస్తానో
అని ఎదురు చూసే నీ పాపని
నీ కనుపాపలో నన్ను దాచుకుంటావని
ఆశ పడుతున్న ఆడశిశువును
కాని.........అమ్మా!
నేను వింటున్నది నిజమేనా?
గర్భం నుండి బయట పడిన వెంటనే
బ్రతుకు ముగిసి పోతుందట ఆడపిల్లలకు
నీకెలా తెలిసింది నీవెలా వినగలవు
అనుకొంటున్నావా?
సుభద్ర గర్భంలో అభిమన్యుడు
తండ్రి అయిన అర్జునుని
మాటలు ఆలకించలేదా
పద్మవ్యూహంలోనికి
దారిని తెలుసుకోలేదా
అమ్మా! అమ్మలక్కల
మాటలు వింటుంటే
ఆశ్చర్యం, భయం వేస్తోందమ్మా
వాళ్ళ మాటలతో నువు
మాట మనుసు కలుపుతావా
నీలో ఉన్న నన్ను
నన్నుగానే అంతం చేస్తావా?
నా ప్రాణాలు నిల్పి
నిన్నుగ నీలో నన్ను చూసుకుంటావా
నన్ను నీ ఒడిలోకి రానిస్తావా అమ్మా
నాతో నీవు ఆడుకొంటావు గదూ
స్త్రీ మూర్తి లేకపోతే
భువిపై పురుషుని ఉనికి ఏదమ్మా?
తొమ్మిది నెలలు తన గర్భంలో
సురక్షితంగా నిలిపి ప్రాణం పోసి
మానవ సృష్టి యజ్ఞంలో
ప్రధాన పాత్ర పోషించే స్త్రీ జన్మ
ఎంత ప్రాధాన్యత చెందిందో గదా
స్త్రీకి స్త్రీయే శత్రువు కాకుండ
స్త్రీకి స్త్రీయే రక్షణ కవచమై నిలవాలి గదమ్మా.

- సి. హెచ్. కళావతి.

# చిన్న చూపుకి చిహ్నం 2011 జనాభా నిష్పత్తి

-పి.ఎ. దేవి

2011 జనాభా లెక్కల ప్రాథమిక వివరాలు భారత ప్రభుత్వం వెల్లడించింది. లెక్కలు వెలువడగానే రెండు అంశాలు కొట్టవచ్చినట్టుగా కన్పించాయి. ఒకటి 6 సంవత్సరాల లోపు వయస్సులోని బాల బాలికలలో ప్రతి వెయ్యిమంది బాలురకు 914 మందే అమ్మాయిలు ఉండటం.... ఇది 2001లో 933గా ఉండేది.రెండో అంశం స్త్రీ పురుష నిష్పత్తిలో స్త్రీల నిష్పత్తి పెరగటం....రెండూ ఒకదానికొకటి విరుద్ధంగా కనబడి ఆశ్చర్యం కలిగిస్తాయి. అయితే లోతుగా తరచి చూస్తే ఈ రెండు ఒకే సమస్యకు రెండు ముఖాలని అర్థం అవుతుంది.

స్త్రీ పురుష నిష్పత్తి ప్రతి వెయ్యిమంది మగవారికీ 1901లో 972 నుండి 1991లో 927కి పడిపోగా 2001 నాటికి అది 933కి 2011 నాటికి 940కి పెరిగింది. మొత్తం మీద స్త్రీల సంఖ్య పెరిగినట్టుగా కన్పించినా కాశ్మీరు, గుజరాత్, బీహార్‌లలో తగ్గింది. దీనికి ప్రధానంగా రెండు కారణాలు ఉండవచ్చు. ఒకటి వలనల వలన నమోదు సరిగాలేకపోవటం. రెండు మరణాల రేటును పరిశీలించాల్సిన అవసరం. అంటే స్త్రీల జీవన కాల ప్రమాణం పురుషుల కంటే సహజంగానే ఎక్కువ. ఎంత అననుకూల పరిస్థితుల్లో కూడా మనుగడ సాగించడం ఆడజీవికి సహజం. ఈ పెరుగుదలకు కారణం రకరకాల దుర్భర పరిస్థితుల వలన మగవారి అకాల మరణాల సంఖ్య పెరగటం కూడా కావచ్చు.

ప్రపంచ వ్యాప్తంగా చూస్తే 2011లో స్త్రీ పురుష నిష్పత్తి 984:1000గా వుంది. ఒక్క చైనా (926/1000)లో తప్ప ఈ నిష్పత్తిలో భారతదేశం అట్టడుగున ఉంది. బాగా వెనుకబడిన దేశాలయిన బంగ్లాదేశ్-978, నైజీరియా 988తో మనకంటే మెరుగయిన స్త్రీల నిష్పత్తి కలిగి వున్నాయి. చివరికి పాకిస్థాన్ కూడా 943తో



మనకంటే పైమెట్టున ఉంది. అమెరికా, రష్యా, బ్రెజిల్, జపాన్‌లలో స్త్రీల నిష్పత్తి వెయ్యికి బాగా ఎక్కువ. బాలికల సంఖ్యలోనే కాక స్త్రీల సంఖ్యలో కూడా హర్యానా (877) బాగా తక్కువ. తర్వాతి స్థానంలో పంజాబ్ (893) యు.పి (908) బీహార్ (916) గుజరాత్ (918) మహారాష్ట్ర (926) రాజస్థాన్ (926) లు ఉన్నాయి. దక్షిణాది రాష్ట్రాల పరిస్థితి ఈ విషయంలో పైవాటితో పోలిస్తే బాగుంది.

ఇక బాలికల విషయానికొస్తే ప్రతి వెయ్యిమంది మగపిల్లలకు (0-6 వయస్సులో) హర్యానాలో 830, పంజాబ్ 846, గుజరాత్ 886 కలిగి వున్నాయి. నాలుగు ప్రధాన రాష్ట్రాల్లో ఈ నిష్పత్తి బాగా పడిపోయింది. భారతదేశంలో 83 శాతం జనాభా ప్రతి వెయ్యిమంది బాలురకు కేవలం 915 మంది కంటే తక్కువ బాలికలను కలిగివుంది.

ఇది అభివృద్ధి దిశకు సంక్షేమ కార్యక్రమాలకు, విధాన నిర్ణయాలకు సామాజిక ప్రగతికి పెనుసవాలు విసిరింది. ఇవి సరైనవా/కాదా? సమీక్షించుకోవాల్సిన సమయం వచ్చింది.

అసలు బాలికల సంఖ్య ఇంత గణనీయంగా ఎందుకు తగ్గింది? అనేక జిల్లాల్లో ఈ సంఖ్య 850కి తక్కువగా ఉంది. పట్టణ ప్రాంతాలు గ్రామీణ ప్రాంతాలతో పోలిస్తే బాలికల జననాలు తక్కువగా ఉంటున్నాయి. తక్కువగా ఆడపిల్లలున్న ప్రాంతాల్లో బాగా హింస, స్త్రీల అక్రమ

రవాణా, బహుభార్యాత్వం వంటి దుర్మార్గాలు ఉన్నట్టుగా ప్రాథమిక పరిశీలనలో తేలుతున్నది.

గర్భస్థ శిశువులో లోపాలు గమనించేందుకుగాను కనిపెట్టిన అమ్నియోసింథసిస్, స్కానింగ్ వంటి వైద్యపరీక్షలు లింగ నిర్ధారణలకు వాడి అమ్మాయి అయితే పిండ దశలోనే చంపేయటం బాగా పెరిగింది. చట్ట ప్రకారం లింగనిర్ధారణ పరీక్షలు జరపడం నేరం. వైద్యుల నైతికతకు మాయని మచ్చ అయినా రోజూ అసంఖ్యాకంగా పరీక్షలు జరిపి గర్భస్రావాలు చేసి రెండు చేతులా డబ్బు గడిస్తున్న ఆసుపత్రులకు కొదవలేదు. అధికార యంత్రాంగం ప్రభుత్వం వీటిని చూసీ చూడనట్టు వదిలేస్తున్నది. మొదట పుట్టింది ఆడపిల్ల అయితే రెండోసారి, మూడోసారి పుట్టిన పిల్లల నిష్పత్తిలో అమ్మాయిల సంఖ్య 759, 719 మాత్రమే. అట్లాగే మొదటి కానుపు అబ్బాయి అయితే అటువంటి సందర్భాల్లో రెండో బిడ్డగా అమ్మాయిల నిష్పత్తి 1102, మూడోబిడ్డగా 1170 ఉంది. అంటే ఒక మగపిల్లవాడు వుంటే రెండోసారి మూడోసారి గర్భస్రావాలు చేయించుకోవటం లేదన్నమాట. అదే మొదటి ఆడపిల్ల అయితే పిండం అబ్బాయి అని తేలేదాకా గర్భస్రావాలకు పాల్పడేవారు ప్రతి వెయ్యి జననాలకు 400 మంది దాకా ఉన్నారన్నమాట.....ఎన్నిసార్లు గర్భస్రావం చేయించుకున్నాక ఈ నిష్పత్తి వచ్చిందో తేల్చడం సాధ్యం కూడా కాదు.

ఆసక్తికరం అయిన అంశం ఏమంటే తక్కువ మంది బాలికల జననాలు ఎక్కువగా బాగా ఉన్నత విద్యనభ్యసించిన, అగ్ర కులాలు, ధనిక వర్గాల కుటుంబాలలో జరగటం. స్కానింగ్ యంత్రాలు వైద్య పరీక్షల అందుబాటు ఎంత దగ్గరకు వస్తే అంత ఎక్కువగా బాలికల జననాలు తగ్గుతున్నాయి అంటే లింగ నిర్ధారణలూ, గర్భస్రావాలు, అమ్మాయిలు తక్కువమంది పుట్టడానికి ప్రధాన కారణంగా కనబడుతున్నది.

అక్షరాస్యత పెరగటం ఆర్థిక పరిస్థితులు మెరుగుపడటం భారతీయ సమాజంలో స్త్రీల స్థానాన్ని పెంచకపోగా హాని కలిగిస్తుండటం ఆందోళన రేకెత్తిస్తున్నది. దీనికి కారణం ఏమిటి లింగ నిర్ధారణ పరీక్షలు ఆపగలిగితే సరిపోతుందా! అంటే సరికాదు... అని ఖచ్చితంగా చెప్పవచ్చు.

బాలికల సంఖ్య వివరీతంగా పడిపోవటం మన సామాజిక చట్రంలో స్త్రీల స్థానాన్ని ఎత్తి చూపే లక్షణం మాత్రమే... అసలు రోగం భారతీయ సాంప్రదాయం, కుటుంబ విలువల పేరిట రుద్దుతున్న తిరోగమన ఛాందస భావజాలం... దీనికి



ఆధారమయిన పురుషాధిక్య సమాజం మగవారి పెత్తనం, పరిపాలనలో సంస్థల్లో వారి అధికారం, అవకాశాలు, స్త్రీలు లొంగి వుండాలనే భావజాలం... ప్రతీచోటా... సామాజికంగా మతపరంగా, చట్టపరంగా, రాజకీయంగా, ఆర్థికంగా అన్ని రంగాల్లో ప్రస్ఫుటంగా కనబడుతున్నది.

దీని ఫలితంగా మగపిల్లవాడు వారసుడు తప్పనిసరి అనే భావం బలంగా నాటుకుపోయింది. తెలియకుండా ఆడపిల్లలు విపరీతమయిన వివక్షకు గురవుతున్నారు. పురుషాధిక్యతకు ప్రత్యక్ష నిదర్శనాలుగా కనబడే... వరకట్నం, వధువుల హత్యలు, సతీసహగమనాన్ని కీర్తించటం, పసిపాపల్ని పురిటిలోనే చంపటం వంటివి తగ్గకపోగా పెరుగుతూ పోతున్నాయి. కాబట్టే బాలికలకు పోషకాహారం ఇవ్వకపోవటం, వారి ఆరోగ్యం పట్టించుకోకపోవటం, చదువు మాన్పించటం, ఉపాధీ అవసరంగా భావించకపోవటం వంటివి రోజువారీ జీవితంలో మామూలుగా జరిగిపోతున్నాయి.

కులం, ఆర్థిక అసమానతలు స్త్రీ స్థానాన్ని మరింత దిగజారుస్తున్నాయి. కులం పట్టును అన్ని మతాలు ఆమోదించి తిరిగి దాన్ని బలోపేతం చేస్తున్నాయి. కులాంతర మతాంతర వివాహాలపై కుల పంచాయితీల నిర్ణయాలు- గౌరవహత్యల వంటి వాటిని రాజకీయంగా బహిరంగంగా మద్దతు పలికే పద్ధతి లేదా.... ఈ ఛాందసత్వాన్ని ఖండిస్తే ఓటుబ్యాంకుకు ముప్పు రావచ్చనే అవకాశవాదపు మౌనం... దీని వలన స్త్రీల సమానత్వ చర్చ పక్కకి వైదొలిగి పోయింది. ఒక రకంగా సైద్ధాంతిక నిషేధానికి గురైంది.

అసలు సమస్య ఉదారవాద ఆర్థిక విధానాలు - ఛాందస వాద రాజకీయాలు పెనవేసుకుని కొనసాగుతున్న వైనం.... అది సాంప్రదాయం పేరిట, కుటుంబాల్ని నిలబెట్టటం పేరిట, సంస్కృతి పేరిట, మతం, కులం పేరిట... మరింత బలంగా స్త్రీల అణచివేతను రుద్దడం దాన్ని స్త్రీల రక్షణగా చిత్రించటం. జీవితంలో ఉద్యోగ, ఆర్థిక భద్రతలు లోపించడంతో ఆ అసంతృప్తిని భయాన్ని, కసిని స్త్రీలపై వెళ్ళగ్రక్కటం....స్త్రీలు చదవటం, ఉద్యోగాలు చేయటం వల్లనే పోటీ పెరిగిందనీ, కుటుంబాలు నాశనం అవుతున్నాయనీ పైకి కన్పించని ప్రతికూల ప్రచారం సాగుతున్నది. “ చదవండి కాని పిల్లలకు చదువు చెప్పటం కోసం మాత్రమే” “ ఉద్యోగం చేసి ఇంటా బయటా శ్రమ పడటం ఎందుకు” “ స్త్రీలు బయట విచ్చలవిడిగా తిరగటం రెచ్చగొట్టే దుస్తులు ధరిచడం వల్లనే హింస, అత్యాచారాలు పెరగుతున్నాయి” ‘ఆడదానికి కుటుంబం పిల్లలే ప్రాధాన్యత” “ ఆడదానికి చేతికి డబ్బు ఇస్తే పొగరెక్కి... మాటవినదు...విడాకులు కోరుతుంది’’ ఇట్లాంటి కాలం చెల్లిన అభిప్రాయాలు మళ్ళీ తిరగదోడటం పదే పదే వాటిని వల్లించటం ఇటీవల బాగా పెరిగింది. రాజకీయ భావజాలం అభివృద్ధి నిరోధకంగా తయారయినప్పుడు (...స్త్రీలు 33% రిజర్వేషన్ల చర్చ) సమాజంలో అన్ని రంగాలు

# దేశంలో ప్రాంతాల వారీ వివరాలు

| | స్త్రీ పురుష | దామాషా | బాల బాలికల | దామాషా | జన సాంద్రత | |
|---|---|---|---|---|---|---|
| ప్రాంతం | 2001 | 2011 | 2001 | 2011 | 2001 | 2011 |
| ఉత్తరాది | 873 | 894 | 868 | 865 | 223 | 267 |
| మధ్య భారత్ | 942 | 948 | 932 | 915 | 347 | 417 |
| దక్షిణాది | 985 | 998 | 953 | 940 | 353 | 397 |
| తూర్పు భారత్ | 931 | 925 | 956 | 945 | 525 | 625 |
| పశ్చిమ భారత్ | 841 | 809 | 925 | 900 | 293 | 344 |
| ఈశాన్యం | 936 | 959 | 964 | 955 | 151 | 176 |

## దేశ జనాభా తీరు తెన్నులు

| | 2001 | 2011 |
|---|---|---|
| అక్షరాస్యులు | 86.49,00,041 | 1,05,14,04,135 |
| పిల్లల సంఖ్య | 16,38,37,395 | 15,87,89,287 |
| ప్రతి వెయ్యిమంది పురుషులకు స్త్రీలు | 933 | 940 |
| ప్రతి వెయ్యిమంది బాలురకు బాలికలు | 927 | 914 |
| జన సాంద్రత ( చదరపు కి.మీ. కు) | 325 | 382 |

అదే దారిలో ఉన్నాయని అర్థం చేసుకోవాలి.

బాలికల సంఖ్య పడిపోవడానికి గర్భస్రావాలు స్కానింగ్‌లు ఒక మార్గం మాత్రమే.... వాటిని ఆపడం పూర్తి పరిష్కారం కూడాకాదు. అట్లాగే వరకట్నం, చదువు ఖర్చు, రక్షణ సమస్య అంటూ బాలికలు వద్దు అంటానికి కారణం చెప్పేవి కల్లబొల్లి కబుర్లు మాత్రమే... మౌలిక సమస్య.... నియంత్రణ... శ్రామిక వర్గాలు పెట్టుబడికీ, కింది కులాలు అగ్ర వర్గాలకూ, స్త్రీలు పురుషులకూ లోబడి ఉండాలి. వారి నియంత్రణలో ఏలుబడిలో ఉండాలి..... ఈ నియంత్రణకు లొంగి ఉంటే....ఎవరి స్థానంలో వారుంటే శాంతి ఉంటుంది. కుటుంబం ఉంటుంది. పై సూత్రాల్ని ధిక్కరిస్తే అశాంతి, అరాచకం... ఇక్కడ ప్రజాస్వామ్యం సమానత్వం వంటి పదాలకు చోటులేదు.

ఎన్ని చట్టాలున్నా అవినీతికి, దుర్మార్గాలకు పాల్పడే అధికార ప్రతినిధులు అన్నింటికీ అతీతంగా ఉండటం చూస్తే....సమానత్వం ఎంత ఎండమావో అర్థం అవుతుంది. ప్రతీ సందర్భంలో నైతికంగా రాజ్యాంగపరంగా అదుపు తప్పిన అధికారం.... దాని దుర్వినియోగం...సామాజికంగా కొట్టొచ్చినట్టు కనబడే దురాచారాలు, దురాగతాలను కనీసం ఖండించగలిగే నైతికహక్కుని కోల్పోయింది. ఏ పార్టీగాని, రాజకీయనాయకులు గాని లింగనిర్ధారణ పరీక్షలు నేరం బాలికలపై వివక్ష వద్దని బోధించసాహసిస్తే జనం నవ్వుతారు.

రోజువారీ జీవితంలో అతి మామూలుగా అసంఖ్యాకం అయిన భాష, అశ్లీల పరిహాసాలు, చొంగలు కార్చే కామ కలాపాలు, లైంగిక ధోరణులు వేధింపులు వివక్షతలూ కొనసాగిపోతూనే వున్నాయి అవి ఎవరికీ పెద్దగా అభ్యంతరకరంగా కన్పించడంలేదు.

సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా ప్రతి సందర్భంలో స్త్రీలకు సమానత్వం కల్పించడం కోసం ప్రత్యేకంగా పనిగట్టుకుని చర్యలు చేపట్టకుండా ఇది మారదు. పురుషాధిక్య సామాజిక చట్రపు మూలాల గురించి చర్చించకుండా వాటిని దెబ్బకొట్టకుండా పైపై మాటల వలన లాభం లేదు. పురుషాధిక్య చట్రాన్ని దాని నియంత్రణలో ఉండే స్త్రీ పురుష సంబంధాలని వాటి ప్రభావాన్ని "పాత"గా కొట్టి పారేస్తున్న ధోరణి హానికరం.

బాలికల నిష్పత్తి పడిపోవటం ఒక వైద్య పరమయిన సమస్య కాదు... ఒక వ్యక్తి లేదా కుటుంబ నిర్ణయాలకు పరిమితం అయిన అంశం కూడాకాదు. అట్లాగే స్త్రీల సమానత్వాన్ని మతమనీ ఆచారమనీ, సంస్కృతి అనీ చెప్పి వాటికే పరిమితం అయితే అది సరిపోదు... సరైంది కూడా కాదు. లింగ నిష్పత్తి చర్చ జరిగిన ప్రతీసారీ పురుషాధిక్యతపై సమానత్వంపై చర్చ సాగాలి. ప్రతీ సందర్భంలో ప్రతి సంఘటనలో అంతర్గతంగా పనిచేసే ఈ భావజాలపు పునాదుల్ని ఎండగట్టాలి. సమానత్వం కోసం పెద్ద ఎత్తున సామాజిక సంస్కరణ ఉద్యమాల ఆవశ్యకత ఉంది. దానికై భారీ ప్రచారం సాగాలి.

రాజ్యాంగం, చట్టం ఎన్ని హక్కులు ఇచ్చినా.... సమాజంపై పురుష్యాధిక్యత పట్టు ఉన్నంతకాలం అది అమలులోకి రావనే వాస్తవం గత 60 ఏళ్ళుగా పదే పదే నిరూపితం అయ్యింది. ప్రభుత్వాలు కపట నాటకాలు మానేసి కనీస చర్యలకు దిగేలా వత్తిడి చేయటం అవసరం. చేసిన చట్టాలను అమలు చేయటం ఆ చర్యల్లో ఒక చిన్న భాగం మాత్రమే.

లక్షల మంది బాలికలు పుట్టకుండానే నశించిపోవడం జరిగినా ప్రభుత్వానికి పురుష్యాధిక్య సంస్కృతికీ కొమ్ముకాస్తున్న వారికే కనువిప్పు కలిగించకపోతే.... సమాజంలో ఈ పరిస్థితి వలస జరగబోయే పరిణామాలు తీవ్రాతి తీవ్రంగా ఉంటాయనేది ఒక కాదనలేని భవిష్యత్ సత్యం...

# పిండ దశలోనే ఆడ శిశువుల అంతంపై

# ఐద్వా పోరు

-సుధాసుందరరామన్

దేశం శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఎంతగా అభివృద్ధి చెందుతున్నా చంద్రయాన్ పేరుతో అంతరిక్ష యాత్రలు జరుపుతున్నా సామాజిక పరిస్థితుల్లో మాత్రం మార్పు రావడంలేదు. స్త్రీ శిశు జననమే భారంగా ఇప్పటికీ పరిగణిస్తున్న సంఘటనలు మన సమాజంలో కోకొల్లలు. స్కానింగ్ ప్రక్రియ అందుబాటులోకి రావడంతో, ఆ పుట్టబోయే బిడ్డ ఆడశిశువో, మగశిశువో ముందే తెలుసుకోగలిగినంతగా మన వైద్యశాస్త్రం అభివృద్ధి చెందింది. ఆడశిశువును ఇష్టపడనివారు అత్యంత అమానుషంగా భ్రూణహత్యలకు సైతం వెనుకాడని హేయమైన పరిస్థితులు మన సమాజంలో కనిపిస్తున్నాయి. పుట్టబోయే మూడో బిడ్డ కూడా ఆడశిశువేనని స్కానింగ్‌లో వెల్లడి కావడంతో నిండు చూలాలిని కడతేర్చిన ఓ కిరాతక భర్త ఉదంతం తాజాగా... ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో చోటుచేసుకుంది. తరాలు మారినా మన సమాజం తీరు మారలేదనడానికి ఇటీవల నిర్వహించిన జనగణనే తార్కాణం. దేశంలో మగశిశువులు, ఆడ శిశువుల మధ్య నిష్పత్తి పడిపోతోందని ఈ జనగణన నిరూపించింది,

STOP FEMALE FOETICIDE

బాలికల శాతం క్రమంగా తగ్గిపోతోందని తాజాగా విడుదల చేసిన జనగణన నివేదిక స్పష్టం చేసింది. దేశంలో జన్మించే ప్రతివెయ్యిమంది బాలలకు 914 మంది మాత్రమే ఆడశిశువులు జన్మిస్తున్నారని ఆ నివేదిక పేర్కొంది.2001లో ఇది 927 ఉండేది. అంటే ఈ నిష్పత్తి దేశంలో 13 పాయింట్లు తగ్గింది. 1961 జనాభా లెక్కల సేకరణ సమయం నుండి ఈ విధంగా స్త్రీ శిశు జననాల సంఖ్య తగ్గడం ప్రారంభమైంది. పంజాబ్, హర్యానా రాష్ట్రాల్లో గత జనగణన తరువాత కొద్దిగా మెరుగుదల కనిపించింది. అయితే ఆ రెండు రాష్ట్రాల్లో ఇప్పటికీ స్త్రీ శిశు జననాల సంఖ్య దేశంలో అత్యంత తక్కువగా ఉంది. అనేక రాష్ట్రాల్లో పరిస్థితి ఇటీవల సంవత్సరాల్లో మరింత దిగజారింది. ప్రతి వెయ్యిమంది మగశిశువులకు మన దేశంలో పుడుతున్న ఆడ శిశువుల సంఖ్య 900, అంతకంటే తక్కువ ఉన్న రాష్ట్రాలు తొమ్మిది ఉన్నాయి. 950 కంటే ఎక్కువగా ఉన్న రాష్ట్రాల సంఖ్య ఇంతకుముందు 18 ఉండగా అది నేడు 9కు తగ్గిపోయింది.

ఈ పరిస్థితిని చక్కదిద్దేందుకు మన ప్రభుత్వాలు తీసుకుంటున్న చర్యలేమీ లేవు అవి తీసుకుంటున్న చర్యలు పరిస్థితిని మరింత జటిలం అయ్యేందుకే దోహదం చేస్తున్నాయి. మహిళలు, పురుషుల మధ్య నిష్పత్తి పెరుగుతున్నట్లు ప్రభుత్వం నంబరవడిపోవడానికి అనుకూలమైన పరిస్థితులేమీ లేవు. ప్రస్తుత ధోరణి ఇలాగే కొనసాగితే భవిష్యత్తులో పరిస్థితి ఎలా ఉంటుందో అగమ్యగోచరంగా ఉంది. ప్రమాద ఘంటికలు మోగుతున్న విషయాన్ని మన ప్రభుత్వాలు గమనించడంలేదు. అసలు మన ప్రభుత్వాల విధానాలపై మౌలికమైన సందేహాలు రేకెత్తుతున్నాయి. ఈ సమస్య గురించి విస్తృతంగా చర్చించి ఒక కార్యాచరణను రూపొందించేందుకు ఐద్వా, ఇండియన్ స్కూల్ ఫర్ ఉమెన్స్ స్టడీస్ అండ్ డెవలప్‌మెంట్ (ఐఎస్‌డబ్ల్యు ఎస్‌డి) సంయుక్తంగా గత నెల ఏప్రిల్ 30న న్యూఢిల్లీలో నిర్వహించాయి. ఈ సమావేశంలో అగ్నిహోత్రి, మాలినీ భట్టాచార్య, ప్రొఫెసర్ మోహన్‌రావు వంటి అనేక మంది విద్యావేత్తలు, మేధావులు, సామాయంగ్ ఉమెన్స్ క్రిస్టియన్ అసోసియేషన్, ఎస్ఎఫ్ఐ, సిఐటియు, ఆల్ ఇండియా కిసాన్ సభ మొదలైన సంస్థలకు చెందిన ప్రతినిధులు ఈ సమావేశానికి హాజరయ్యారు. ఐద్వా ఉపాధ్యక్షురాలు కీర్తిసింగ్ ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు. వివిధ రాష్ట్రాలకు చెందిన ఐద్వా నాయకులు, కార్యకర్తలు తమ తమ రాష్ట్రాల్లో నెలకొన్న పరిస్థితుల గురించి వివరించారు. పిసి పిఎన్‌డిటి చట్టాన్ని అమలు చేసేలా మహారాష్ట్ర, హర్యానా రాష్ట్రాల్లో నిర్వహించిన పోరాటాలను ఐద్వా జాతీయ కార్యదర్శి కిరణ్‌మోఘే, ఉపాధ్యక్షురాలు జగ్మతీసాంగ్వాన్ వివరించారు. ఒక ముసాయిదా తీర్మానాన్ని ఐద్వా ప్రధాన కార్యదర్శి సుధా సుందరరామన్ ప్రవేశపెట్టారు. ఈ తీర్మానంపై విస్తృతమైన, ఉపయుక్తమైన చర్చ జరిగింది. యుపిఎ-2 ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాల

కారణంగానే స్త్రీ శిశు జననాల సంఖ్య తగ్గుముఖం పట్టిందని ఈ సమావేశం అభిప్రాయపడింది. పిసి పిఎన్‌డిటి చట్టాన్ని అమలు చేయడంలో వైఫల్యాన్ని సమావేశం ఎండగట్టింది

**పడిపోయిన సంతానోత్పత్తి సామర్థ్యం- జనాభా నియంత్రణ చర్యలు**

అధికారంలోకి వచ్చిన వివిధ ప్రభుత్వాలు విచక్షణారహితంగా అమలు చేసిన జనాభా స్థిరీకరణ, కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు మగ, ఆడ శిశువుల మధ్య నిష్పత్తి తగ్గిపోవడానికి ప్రధాన కారణాలు. చిన్న కుటుంబాలను ప్రోత్సహించడం, వీటి గురించి విస్తృతంగా ప్రచారం చెయ్యడం, లైంగిక వివక్షత పాటించే సాంఘిక పరిస్థితులు ఇందుకు కారణమవుతున్నాయి. తల్లితండ్రులుకూడా నేడు చిన్న కుటుంబం వైపే మొగ్గుచూపుతున్నారు. జనాభా అభివృద్ధి రేటును తగ్గించడం అంతిమంగా స్త్రీ శిశు జననాలు తగ్గిపోవడానికి కారణమైంది. తల్లితండ్రులు కూడా ఒకరు, ఇద్దరితో సంతానాన్ని పరిమితం చేసుకుంటున్నారు. ఆ పుట్టే పిల్లలు మగ పిల్లవాడైతే మంచిదని వారు కోరుకుంటున్నారు. తొలి సంతానం మగపిల్లవాడు గల కుటుంబాలు రెండో సంతానం పట్ల ఆసక్తి చూపడం లేదని పంజాబ్‌లో క్షేత్రస్థాయిలో నిర్వహించిన సర్వేలో వెల్లడయ్యింది.

ఇద్దరికంటే ఎక్కువ సంతానం గల మహిళలు పంచాయితీ ఎన్నికల్లో పోటీ చేయకూడదనే నిబంధనలను అనేక రాష్ట్రాలు అమలు చేస్తున్నాయి. ఇద్దరు పిల్లల కంటే ఎక్కువ మంది సంతానం కలవారి నీటి శిస్తును యాభై శాతం పెంచుతూ మహారాష్ట్రలో కాంగ్రెస్/ఎన్‌పిసి సంకీర్ణ ప్రభుత్వం ఒక శాసనాన్ని తీసుకొచ్చింది. ఆధునిక భావాలు గల వారిగా చెప్పుకుంటున్న కుటుంబాలు కూడా కనీసం ఒక కుమారుడు ఉండాలని కోరుకుంటున్నారు. అదే బాలికల విషయంలో మాత్రం ఒకరి కంటే ఎక్కువ మంది ఉండకూడదని కోరుతున్నాయి. అక్షరాస్యత పెరిగినా, ఆర్థికాభివృద్ధి సాధించినా ఈ పరిస్థితిలో మార్పు రాలేదని సర్వేలు వెల్లడించాయి. లింగ నిర్ధారణ ఆధారిత గర్భస్రావాలు మెట్రోపాలిటన్ నగరాల్లో సైతం పెరిగిపోతున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లోనైతే మరింత దారుణమైన పరిస్థితి నెలకొంది. స్త్రీ శిశువును అక్కడ నిర్లక్ష్యం చేస్తారు. వారికి వైద్య సదుపాయాలు కల్పించరు. మరణించినా పోయేదేమీ లేదనే ఉద్దేశ్యంతో వ్యవహరిస్తారు.

**లింగ నిర్ధారణ ఆధారిత గర్భస్రావాలు**

లింగనిర్ధారణ పరీక్షలు నిర్వహించి వాటి ఆధారంగా జరిగే గర్భస్రావాలను పిసి పిఎన్‌డిటి చట్టం నిషేధించింది. అయితే ఈ పరీక్షలు, గర్భస్రావాలు మాత్రం పెరిగిపోతున్నాయే కానీ తగ్గడం లేదు. వైద్య వృత్తిలో ఉన్నవారు టెక్నీషియన్లు, అల్ట్రామోడరన్ యంత్రాలను ఉత్పత్తి చేస్తున్న కంపెనీల మధ్య రహస్య సంబంధాల కారణంగా ఈ జాడ్యం రోజురోజుకూ పెరిగిపోతోంది. ఈ చట్టాన్ని ఉల్లంఘించేవారిపై కఠిన చర్యలు తీసుకునేందుకు ప్రభుత్వం వెనకాడుతుండటంతో ఈ లాభదాయకమైన ప్రక్రియ కొనసాగుతోంది. చట్టం చేసి పది సంవత్సరాలు పూర్తయినప్పటికీ దానిని నోటిఫై చేయ్యలేదన్న విషయం పూనేలో నిర్వహించిన ఒక సర్వేలో వెల్లడైంది. లాభాపేక్షే ధ్యేయంగా వ్యవహరించే వారికి వైద్య వృత్తిలో అనైతిక, అవినీతి పద్ధతులకు పాల్పడేవారికి మధ్య లాలూచీ వల్ల ఈ చట్టం నిర్వీర్యమైపోతోంది. ఐద్వా పోరాటాల కారణంగా అటువంటి క్లినిక్‌లను మూసివేసారు. ఆ తరువాత కొద్ది కాలానికే అవి తిరిగి తెరుచుకున్నాయి. పర్యవేక్షణ కమిటీలపై కూడా మాఫియా శక్తులు ఆధిక్యత ప్రదర్శిస్తున్నాయి. ఇటువంటి అకృత్యాలకు పాల్పడుతున్న వారిని గుర్తించేందుకు ఉద్దేశించిన ఎఫ్ ఫారాలు కార్యాలయాల్లో దుమ్ముకొట్టుకుపోతున్నాయి. పిసిఎన్‌డిటి చట్టం అమలు తీరును పర్యవేక్షించేందుకు నియమించిన కేంద్ర పర్యవేక్షణా బోర్డు గత మూడు సంవత్సరాల్లో ఒక్కసారి కూడా సమావేశం కాలేదు. ఈ కమిటీని ఇటీవలే పునర్వ్యవస్థీకరించారు. కొత్త టెక్నాలజీలను కనుగొనడంతో వైద్య సర్వీసులు లాభాపేక్షగల కిరాణా కొట్ల మాదిరిగా మారిపోయాయి. ఆధునిక టెక్నాలజీ పేరుతో మహిళల మీద వేధింపులు పెరిగిపోయాయి. స్కానింగ్ ప్రక్రియ గర్భస్థ శిశువు, తల్లి ఆరోగ్యానికి దారితీసేదిగా ఉండాలేగానీ అది భ్రూణహత్యలకు కారణం కారాదు. గర్భస్థ మహిళలకు అల్ట్రాసౌండ్ పరికరాలను అమర్చడం వల్ల చెడు ఫలితాలు సంభవిస్తే వాటిని నిషేధించడమే మంచిది. ఇవి గర్భస్థ శిశువుకు కూడా ప్రమాదకరంగా పరిణమించవచ్చు. అన్నిటికంటే ముందుగా ఇటువంటి నేరాలను అరికట్టాలనే ధృఢసంకల్పం ప్రభుత్వాలకు ఉండాలి. చట్టాలు చేయడంతోనే ప్రభుత్వ బాధ్యత తీరిపోదు. వాటిని అమలు చేసే చిత్తశుద్ధి కూడా కావాలి. చట్టాల అమలును పర్యవేక్షించేందుకు నియమించే కమిటీల్లో నిపుణులకు స్థానం కల్పించాలి. అంతేకానీ వ్యాపారసంస్థలు, కంపెనీల ప్రతినిధులకు ప్రవేశం ఉండకూడదు.

## 'ఆమె చిరునవ్వు'

ఆమె- నీ ఇంటికి 'దీపం' అంటే
తాను కరిగిపోతున్నా
వెలుగులు పంచే 'కొవ్వొత్తి' కాదు
చమురువు నీవైతే
వెలుగులు పంచే 'వత్తి' ఆమె

అనుకూలవతి అయిన 'భార్య' అంటే
నీ సుఖం కోసం
తాను 'సమిధ' అవుతుందని కాదు
భార్య అంటే భర్త ఆగడాలను
భరించడం- అని పెడ అర్థం చెప్పకు
కన్నవారింటిని వదలినా
తోబుట్టువులను మరిచినా
తన చిరునవ్వుతోనే
నీ ఇంటికి దీపం కాగలదు!
ఆమె చిరుహాసం తోనే
నీ ఇంట్లో-
ఆనందం నింపగలదుసుమీ!

-దుర్గాప్రసన్న

## హైకూ

స్నేహము ఒక" భావము"
భావము "ఒక జీవము"
జీవం ఒక- "ప్రాణం"
ప్రాణం ఒక "రూపం"
ఆ రూపముకి ప్రతిరూపం
మన "స్నేహం"

- సుజాత

# శ్రీమతి స్వర్ణ కుమారి దేవి

- వకుళాభరణం లలిత

స్వర్ణకుమారీదేవి మహర్షి దేవేంద్రనాథ్ ఠాగూర్ కుమార్తె. రవీంద్రనాథ్ ఠాగూర్ సోదరి. ఎన్నో విశిష్ట గుణగణాలున్న వ్యక్తి. బెంగాల్ సాహిత్యంలో ఆమె చేసిన కృషి, స్త్రీ ఉద్యమంలో ఆమె నిర్వర్తించిన పాత్ర అపురూపం. శచీంద్రనాథ ముఖర్జీ (ఆమె మరణానంతరం) మాటల్లో: స్వర్ణకుమారీదేవి జోరశంకో గ్రామం నుంచీ ఠాగూర్ కుటుంబంలో పుట్టిన వ్యక్తి. ఆ ఊరి నుంచి ఎంతో మంది పండితులు, తత్వవేత్తలు, విమర్శకులు, కవులు వచ్చారు. ద్విజేంద్రనాథ్ తాత్త్వికుడు, కవి, సత్యేంద్రనాథ్ విమర్శకుడు, కవి, వాగ్గేయకారుడు. జ్యోతిరింద్రనాథ్, నాటక రచయిత, అనువాదికుడు ఇక రవీంద్రనాథ్‌కు లేని లక్షణం లేదు. వాళ్ళందరి సోదరుల మధ్య పుట్టిన సోదరి స్వర్ణకుమారి. ఆమె కూడా బెంగాలీ సాహిత్యంలో అత్యున్నతమైన స్థానాన్ని పొందిన వ్యక్తి.

స్వర్ణకుమారీదేవి 20-8-1856లో కలకత్తాలోని జోరశంకోలో జన్మించింది. 1867లో జానకీనాథ్ ఘోశాల్‌తో బాల్య వివాహం జరిగింది. ఆయన సంఘసంస్కర్త, గొప్ప నాయకుడు. ఆమెకు ఇద్దరు కూతుర్లు, ఒక కొడుకు పుట్టారు. అందరూ బెంగాల్‌లో అత్యున్నత శిఖరాలందుకున్నవారే.

స్వర్ణకుమారి చిన్నప్పుడు ఇంట్లోనే విద్యనభ్యసించింది. సమర్థురాలు. ఆమె చిన్నప్పుడే అత్యుత్తమ గుణగణాలను ప్రదర్శించింది. మత సంస్కర్త అయిన తండ్రి, విద్యావంతులు, అత్యున్నత శక్తి సంపన్నులైన సోదరులందరి ప్రభావం స్వర్ణ మీద ఉండనే ఉన్నాయి. వాటికి తోడు అభ్యుదయ భావాలు కలిగిన భర్త ప్రోత్సాహంతో మొట్టమొదటిసారిగా పర్దాను తీసివేసి, ధైర్యసాహసాలతో బయటికి వచ్చిన బెంగాలీ వనిత, మరెవ్వరో కాదు, స్వర్ణకుమారీదేవియే.

1884లో బెంగాలీ పత్రిక 'భారతి'ని నడిపింది. దాన్ని 1877లో ఆమె ఇద్దరు సోదరులు నడిపారు. ద్విజేంద్రనాథ్, జ్యోతిరింద్రనాథ్‌లు. తర్వాత మొట్టమొదటి మహిళా సంపాదకురాలిగా, వార్తాపత్రికను నడిపింది. బెంగాల్‌లో ప్రారంభమైన మొదటి పత్రిక అది. ఆమె చుట్టూ ఎంతో విద్వత్తు కలిగిన బెంగాలీ సాహిత్య ప్రియులు ఉండేవారు. ఎప్పుడూ సాహిత్య విషయాలపై చర్చలు, గోష్టులు జరుగుతుండేవి.

1895లో ఆమె ఇద్దరు కుమార్తెలు శ్రీమతి హిరణ్మయిదేవి, శ్రీమతి సరళాదేవి ఆ పత్రిక బాధ్యతను వహించినా, మళ్ళీ 1906లో భారతి పత్రిక బాధ్యత తానే తీసుకుని సమర్థవంతంగా నడిపింది. ఆ కాలంలో బెంగాలీ సాహిత్యంలో ఉండే నవలలు, కథలు, గేయాలు, నాటకాలు, తమాషాలు, విజ్ఞాన సంబంధిత విషయాలను ఎన్నింటినో రాసి, బెంగాల్ సాహిత్యానికి ఎనలేని కీర్తి ప్రతిష్టలను తెచ్చిపెట్టింది స్వర్ణకుమారీదేవి. తన నవలలెన్నో నాటక రూపాన్ని ధరించాయి. బెంగాల్ సంగీతానికి ఆమె రాసిన గేయాలు ఎంతో పుష్టినిచ్చాయి. 20ఏళ్ళ వయసులోపే . నవల రాసింది స్వర్ణకుమారీదేవి. ఆ నవలా రచయిత స్త్రీ అనగానే ఎంతోమందిని ఆశ్చర్యానికి గురిచేసింది. భారతదేశంలో ఇటువంటి ప్రయత్నం సాహిత్యంలో ఎప్పుడూ జరగలేదు. ఆమె రెండు నవలలు " ది పాటల్ గార్లండ్" " అన్ ఫినిష్డ్ సాంగ్"ఆంగ్లంలో అనువాదాలను పొంది లండన్‌లో ప్రచురింపబడ్డాయి. ఆమె రాసిన నాటకం ' కళ్యాణి' జర్మన్ భాషలోకి అనువదింపబడింది. ఆమె బెంగాలీ సాహిత్యానికి చేస్తున్న సేవలను కలకత్తాలో గుర్తించారు. కలకత్తా విశ్వవిద్యాలయం ఆమెకు " జగత్తరిణి స్వర్ణపతకాన్ని" బహూకరించింది. 1930లో 29వ బెంగాలీ సాహిత్యసమావేశం భవానీపూర్‌లో జరిగింది. ఆమె ఇచ్చిన ఉపన్యాసం ఎంతో భావోద్వేగంగా ఉండటమే కాదు, ఎంతోమందిని ఉద్రూతలూగించింది కూడా.

ఇ.యం. లాంగ్ ఆమె రాసిన అన్‌ఫినిష్డ్ సాంగ్ ఉపోద్ఘాతంలో " శ్రీమతి ఘోశాల్ భారతదేశ మహిళలను ముందుకు నడిపించగల వ్యక్తి'' అన్నారు. ఆ గ్రంథంలో ఆమె భారతదేశంలోని అమ్మాయిల పాత ఆచార వ్యవహారాలతో ముందుకు సాగుతూ, తాను స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి ముందుకడుగిడుతుంది". ఆమె తీసుకున్న అంశాలు ఎంతో ఆస్తి దాయకాలు. ఎంతో ఉదాత్తమైనవి. ప్రజాబాహుళ్యానికి అందుబాటులో ఉండేవి. దైనందిన సంఘటనలు, సాహసోపేత దృశ్యాలు కాక, ప్రజలకు అందుబాటులో ఉండే విషయాలతోనే ఆమె రాసేది. అందుకే అవి ఎంతో ఆసక్తికరంగా ఉండేవి. ఆమె రాసిన గ్రంథాన్ని వదిలిపెట్టడానికి ఎవ్వరికీ బుద్ధిపుట్టేదికాదు. ఒకసారి ప్రారంభిస్తే ప్రవాహంలా సాగిపోయేది. ఆ గ్రంథాల్లో ఎన్నో విశిష్టమైన ఆమె భావాలు వ్యక్తమయ్యేవి. ఆమె ప్రేమ, వాత్సల్యం వ్యక్తమయ్యేవి. ఒక్కసారి ఆ స్త్రీ ప్రేమలో తదాత్మ్యం చెందిన పురుషుడు, ఆ ప్రేమవాహినిలోనే జీవితం సార్థకం అయ్యేది.

ఆమె సారళ్యత, మానవత్వం ఆమె రాసిన గ్రంథాల్లో ప్రతిఫలించేది. చిన్నపనులైనా ఒక్కొక్కపుడు అద్భుతాలను కలిగించేవి. స్వర్ణకుమారిదేవి రాసిన రాతలు, ఆమెను సాహిత్యంలో అత్యున్నత దశలో నిలిపాయి. సోదరీమణులతో, విక్టోరియా కాల నవలా రచయితతో సమానంగా నిల్చుతాయి.

సాహిత్య రంగంలో ఆమె చేసిన సేవలకు తోడు, ఆమె సామాజిక కార్యక్రమాలు ఎంతో పేరుతెచ్చాయి. 1886లో ఆమె " సఖీ సమితి" అనే మహిళా సంఘాన్ని స్థాపించింది. భారతదేశంలోని మహిళల్లో అన్యోన్యతను పెంచడానికి ఇది ఎంతో దోహదం చేసింది. హైందవ స్త్రీల విద్యకోసం, ఉపాధి కోసం ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. 1890లో భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు స్త్రీలు హాజరు కావటం మొట్టమొదటసారిగా జరిగింది. అందులో ముఖ్యంగా స్వర్ణకుమారిదేవి హాజరై ప్రాతినిధ్యం వహించింది. అమియా భూషణ్ బసు మాటల్లో స్వర్ణకుమారిదేవి కలకత్తాలో బెంగాల్ మహిళల పరిస్థితులను ఎంతో బాగుచేయాలని ప్రయత్నించినప్పుడు, ఎక్కడా ఆశ అనేది కనిపించేదికాదు. మహిళలు పైకి రావడానికి ఎవ్వరూ హర్షించేవారుకాదు. ఎమర్సన్ అన్నట్లు " పురుషుల బలవంతం, ప్రతిదానిలో జోక్యం ఉండేవి".

1913లో ఘోశాల్ మృతి చెందటం, ఆమె పెద్ద కూతురు 1925లో మృతి చెందటం స్వర్ణకుమారిని కుంగదీసింది. పెద్ద కూతురు గొప్ప సంఘసేవిక, బాలిగంజ్‌లో " విధవా పారిశ్రామిక హోం'' స్థాపకురాలు. 1930 తర్వాత స్వర్ణకుమారిదేవి ఆరోగ్యం క్షీణించటం మొదలైంది. తన కాలాన్నంతటినీ సాహిత్య రంగానికే వెచ్చించింది. 3-7-1932లో పరమపదించింది. ఆమె మరణం వల్ల దేశం ఎంతో కోల్పోయింది. బెంగాల్ మహిళోద్యమానికి ఆమె మణిపూస. అంతటి ఆకర్షణీయురాలు, తెలివిగల వ్యక్తిని, అంతటి గౌరవప్రదమైన ఉన్నత స్థానంలో ఉండే మహిళను భారత సాహిత్య చరిత్రలోనే కాదు, వార్తా ప్రచురణకర్తగానే కాదు, గొప్ప నవలా రచయిత్రిగా, సాహిత్యం ద్వారా స్త్రీలకు ఆమె చేసిన సేవను ఏనాటికి మరువలేము..

అందుకే మనకు ఎల్లప్పుడూ ఆదర్శ జీవులు, మార్గదర్శకులైన స్వర్ణకుమారీదేవి లాంటి వాళ్ళు ఉంటే వాళ్ళ అడుగుజాడల్లో మనం ఎన్నో మైళ్ళు ప్రయాణం చేస్తాం. భావిభారత మహిళలను నడిపించగలం.

# మానవత్వం పరిమళించే మధురవాణి

– ఓల్గా



ఇంత గొప్పగా మధురవాణి పాత్రని గురజాడ ఎలా రూపుదిద్దారు– మన తెలుగు సాహిత్యానికి ఇంత మహాదృష్టం కల్పించాలని ఆయనకెలా తోచింది– ఆయనకు తప్ప ఎవరికి తోస్తుంది. ఆయన ప్రేమ దృష్టి ఒక్కసారి గుర్తు తెచ్చుకుంటే –గురజాడ తన పాత్రచిత్రణా పద్ధతి గురించి ఒకచోట ఇలా అంటారు.

"చిన్నతనంలో బొమ్మలాట నేర్చి ఉండటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసును కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసు లేని మనిషే ఉండడు. స్నేహము, ప్రేమా అనేవి అనాది అయిన్నీ, ఎప్పటికీ సరికొత్తగా వుంటే రెండు వెలుగులను నరుని మీద తిప్పి కాంచితే వింత వింత సొగసులు బయులుదేరుతవి. అన్యాయం అనే అంధకారంలో అంతా ఏకనలుపే".

ఏక నలుపుని తీసి స్నేహం, ప్రేమలనే రజత సువర్ణకాంతులకు మాటలాడటం నేర్పి మధురవాణిని మన తెలుగువారికి మంచి చెడ్డలు తెలియజెప్పేందుకు సృష్టించారు గురజాడ.

నాటకం చివరిలో సౌజన్యారావు పంతులు మధురవాణికి భగవద్గీతను ఇస్తాడు. శ్రీ కృష్ణుడనే స్నేహితుడు గీతలో దొరుకుతాడని చెబుతాడు. మధురవాణి కొంటెతనంగా "శ్రీ కృష్ణుడు యాంటినాచ్" కాదాండి అని అడుగుతుంది. చెడ్డలో ఉన్న మంచిని నేనని మధురవాణి చెప్పే మాటలు అర్థమయ్యాయో లేదో గాని మళ్ళీ "చెడ్డవారిని మంచివారిగా చేసే పుస్తకం" అంటాడు. మధురవాణి ఆ పుస్తకం తీసుకుంటుంది. సౌజన్యారావు పంతులుకు ఆమెను మరింత సంస్కరించాలని పించింది.

సంస్కరింపబడవలసిందెవరో ఆయన మాటలు చదివితే మనకు సందేహం కలుగుతుంది. మధురవాణిని అంతసేపు చూసి, "చెడనివారిని చెడగొడ్డ వద్దని మా అమ్మ చెప్పింది" అనే మాటలు విని కూడా, ఆమె తల్లి వల్లనే తనకు వ్రతభంగం కాలేదని, బ్రతికిపోయానని తెలిసి కూడా ఈ మాట మాట్లాడతాడు. "నువ్వు మంచిదానివి. యెవరో కాలు జారిన సత్పురుషుడి పిల్లవై వుంటావు. ఈ వృత్తి మానలేవో? స్థితిలోపమా?" కాలుజారినవాడు సత్పురుషుడు, సత్పురుషులు రూపొందించిన వ్యవస్థలో తన కులవృత్తి తను చేసుకునే మధురవాణి మంచితనం ఈ సత్పురుషుడి వల్ల రావలసిందే గాని కన్నతల్లి వల్ల గానీ, వాళ్ళవిద్య, లోకజ్ఞానం, స్వభావం వీటి పరిణామాల వల్ల గానీ రాదన్నమాట. సౌజన్యారావు పంతులు వంటి సంస్కర్తల మనస్సుల్లో ఈ భావం ఉన్నంతకాలం వెలుగు చీకటి నీడ పడుతూనే వుంటుంది. వెలుగును కప్పే చీకట్ల పట్ల ఎంతటివారైనా జాగరూకత వహించకపోతే ఒక మామూలు గాడిలో పడి ఏక నలుపుకు దగ్గరయ్యే ప్రమాదం ఉంది. ఆ ప్రమాదాన్ని గురించిన హెచ్చరిక సౌజన్యారావు పంతులు మాటల నుంచి మనం అర్థం చేసుకోకపోతే తర్వాతి కాలంలో గురజాడ రాసిన కవిత్వం "మంచియన్నది మాల అయితే మాల నేనవుదును" అర్థం చేసుకోవటం కష్టం. కన్యాశుల్కం నాటక రచనలో మానవ స్వభావాలను లోతుగా అర్థం చేసుకునే ప్రయత్నం చేసి ఆ రచన వల్ల మరింత మానవీయంగా మారి ఆ తర్వాత కవిత్వ రచనలోకి మళ్ళారు గురజాడ.

మధురవాణి తన జన్మకు కారకుడైన అనామక సత్పురుషుడి గురించి సౌజన్యారావు పంతులుతో వాదన పెట్టుకోలేదు. ఆమె ఎంత మంచి మనిషి అంటే తన ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటూనే తనకు ఈ సమాజం ఇచ్చిన వృత్తి అంత సజావైనది కాదనే విషయం కూడా సంకోచం లేకుండా చెబుతుంది.

"నా వృత్తి యొక్క హైన్యత గుర్తెరుగుదును, సత్పురుషుల దయ సంప్రాప్తమైన తరువాత దుర్వృత్తి యేల ఉంటుంది." అని తన భవిష్యత్ గురించిన ఆలోచనను సూచనప్రాయంగా తెలియజేస్తుంది.

మధురవాణి తర్వాత ఏం చేస్తుందో మనకు తెలియదు గానీ ఏం చెయ్యాలనే కోరిక ఆమె మనసులో ఉందో ఆమె స్పష్టంగా చెప్పింది.

ఆమె ఒక పతివ్రత కావాలనుకోలేదు. మాతృమూర్తి కావాలనుకోలేదు. శ్రమ పడకుండా– ఇంటి చాకిరీ కాని శ్రమ చేయకుండా బతకాలని

అనుకోలేదు. శ్రమ చేసి జీవించటం వల్లనే భద్రత దొరుకుతుందని భావించింది.

షష్ఠాంకంలో కరటకశాస్త్రి మధురవాణి తల్లిని, ఆమె పెంపకాన్ని వాటివల్ల వృద్ధి అయిన మధురవాణి విద్యా సౌందర్యాలను ప్రశంసించినపుడు మధురవాణి తన మనసు విప్పిచెప్పింది.

"కాపు మనిషినై పుట్టి, మొగుడి పొలంలో వంగమొక్కలకూ, మిరప మొక్కలకు దోహదం చేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్లన్న వారు వుందురేమో" అంటుంది.

కేవలం ఇంటికి, ఇంటి చాకిరికీ పరిమితమవడటం వల్ల స్త్రీలకు సరైన భద్రత దొరకటం లేదని ఆమెకు తన చుట్టూ వున్న స్త్రీలనూ, వారి నిస్సహాయ స్థితిని చూస్తే అర్థమై ఉండాలి. అందుకే పొలం పని చేయాలని ఆమెకు కోరిక కలిగింది. సౌందర్యాన్ని ఆధారం చేసుకుని బతికే మధురవాణి శ్రమ జీవనంలోని సౌందర్యాన్ని భద్రతనూ కూడా గుర్తించింది. అందుకే ఆమె చూపు తీక్షణమైనది, లోతైనది అనిపిస్తుంది. అది తర్వాత జన్మ సంగతి. ఈ జన్మలో ఆమె ఎన్నో మంచి పనులు చేస్తుందనే గట్టి నమ్మకం 'కన్యాశుల్కం' నాటకం మనకు కల్పిస్తుంది. బెంగుళూరు నాగరత్నమ్మ, ముత్తులక్ష్మిరెడ్డి వంటివారు మధురవాణికి భిన్నరీతులలో వారసులుగా నిలిచారు.

మధురవాణి భగవద్గీతను హృదయానికి ఆనించుకుని సౌజన్యారావు పంతులుకు నమస్కరించి శలవు తీసుకుంటుంది. సౌజన్యారావు పంతులు మధురవాణికి భగద్గీత ఇవ్వటంలోని ఆలోచన ఏమైవుంటుంది? కేవలం ఆధ్యాత్మిక ప్రవృత్తి కలిగించటానికేనా? దానికి ఇంకే పుస్తకమైనా ఇవ్వొచ్చుకదా. ఆధ్యాత్మ రామాయణం ఇవ్వొచ్చు, సావిత్రీ సత్యవంతుల కథ ఇవ్వొచ్చు. యుద్ధ వాతావరణంలో మానవజాతి ధర్మాన్ని గురించి ప్రవచించిన పుస్తకాన్ని మధురవాణికి సౌజన్యారావు పంతులు- లేదా ఆయన ద్వారా గురజాడ ఎందుకిచ్చాడు. భగవద్గీత అనేక సందర్భాలలో అనేక సంకేతాలను, సందేశాలనూ ఇస్తుంది. గురజాడ మధురవాణికి ఏ సందేశాన్ని ఇవ్వాలని ఉద్దేశించి ఉంటాడు?

యుద్ధరంగంలో, ఎదుట మోహరించి ఉన్న బలగాలను చూసి అర్జునుడు అక్కడున్న వారంతా తన తండ్రులు, తాతలు, అన్నలు, తమ్ములు, గురువులు, బంధువులు, వారిపై యుద్ధం చేసి సాధించేదేమిటని ధనుర్బాణాలు కిందపడవేసిన సందర్భంలో కృష్ణుడు గీతోపదేశం చేస్తాడు. దానికెన్ని వ్యాఖ్యానాలుండనీ, లోతులుండనీ సందర్భం అది. సూటియైన సందేశం-అధర్మం చేస్తున్నది స్వజనమైనా అధర్మనిధనం చేయటం మానవ కర్తవ్యమనేదే. అర్జునుడ్ని కార్యాచరణలోకి దింపడమే శ్రీకృష్ణుని ముఖ్యోద్దేశం. మధురవాణిని అలాంటి కార్యాచరణ చేయమని పరోక్షంగా చెబుతున్నాడా? ఆమె అప్పటికి సుబ్బి పెళ్ళిని ఆపి, మీనాక్షిని ఆదుకుని, లుబ్ధావధాన్లను రక్షించి రకరకాల కార్యాచరణలు చేస్తున్నది.

అలాంటి పనులు రాబోయే కాలంలో స్త్రీలందరూ చేస్తే తప్ప గురజాడ చెప్పిన మాట "ఆధునిక స్త్రీ చరిత్రను పునర్లిఖించట"మనే పని జరగదు. ఐతే స్త్రీలు కార్యాచరణలోకి దిగితే ముందుగా యుద్ధం చేయవలసింది తమ వారితోనే- తమ తండ్రులు, తల్లులు,అన్నలు, తమ్ములు, భర్తలు వీరివల్ల అణిచివేత జరుగుతున్నపుడు, తమ పట్ల వారు అధర్మంగా, అన్యాయంగా ప్రవర్తిస్తున్నపుడు స్త్రీలు వాళ్ళతో ఏదో ఒక స్థాయిలో యుద్ధం చేయక తప్పదు. తమ వాళ్ళమీద ఆ యుద్ధం చేయలేక తాము హతమైపోయే స్త్రీలున్నపుడు వారికి భగవద్గీత కంటే మంచి నేస్తం, ధైర్యాన్నిచ్చి వెన్నుతట్టే నేస్తం ఎక్కడ దొరుకుతుంది?

గురజాడ మధురవాణి ద్వారా స్త్రీలోకానికి భగవద్గీతలోని ఈ సందేశాన్ని ఇచ్చాడని అనుకుంటే ఆయన క్రాంత దర్శిత్వం, మార్గదర్శకత్వం, ఎంత అమూల్యమైనవో అనిపిస్తుంది."అడుగుజాడ గురజాడది-అది భావికి బాట- మనలో వెధవాయిత్వం -మరిపించే పాట" అన్న శ్రీశ్రీ మాటలు మరింత బాగా అర్థమవుతాయి.

గురజాడ ఎంతో స్నేహంతో ప్రేమతో కన్యాశుల్కంలో మధురవాణి స్థానను మలిచారు. మధురవాణే కాదు కన్యాశుల్కంలో మిగిలిన స్త్రీ పాత్రలు కూడా మంచివే. అబలలు, అమాయకులేమో గాని వాళ్లు చెడ్డవాళ్ళుకాదు. స్త్రీ పాత్రలన్నీ పితృస్వామ్య సమాజపు అణచివేతకు గురైనవే, పురుషాహంకారం కింద నలిగిపోతున్నవే. వారంతా ఈ వ్యవస్థపై తమ అసంతృప్తినీ, ఛీత్కారాన్నీ, ధిక్కారాన్నీ ఏదో ఒక స్థాయిలో వినిపించినవారే. కన్యాశుల్కం పేరిట ఆడపిల్లలకు జరుగుతున్న అన్యాయాన్ని ఎలాగైనా ఆపాలని తపించిన స్త్రీలు వాళ్ళు. అగ్నిహోత్రావధాన్లు భార్య వెంకమ్మ తన రెండో కూతురు సుబ్బి పెళ్ళి ఆపాలని తీవ్రంగా ప్రయత్నిస్తుంది. పెద్ద కూతురు బుచ్చెమ్మకు జరిగిన అన్యాయం సుబ్బికి జరగకూడదని ఆరాటపడుతుంది. ఈ విషయంలో సహాయపడకపోతే ఏ నుయ్యో, గొయ్యో చూసుకుంటానని అన్న కరటకశాస్త్రిని ప్రాధేయపడుతుంది. ఊరికే మాట అనటమే కాదు ఆ పెళ్ళి జరగటానికి వీల్లేదని భర్తతో పోట్లాడి నిజంగానే నూతిలో దూకింది. తన ప్రాణత్యాగంతోనైనా కూతురు పెళ్ళి తప్పితే అంతే చాలంది. ఎవరికీ ఎదురు చెప్పని బుచ్చెమ్మ కూడా చెల్లి పెళ్ళిని వ్యతిరేకించి తండ్రితో చివాట్లు తిన్నది. చివరకు గత్యంతరం లేని పరిస్థితిలో తను గిరీశంతో లేచిపోతేనన్నా తన చెల్లి పెళ్ళి తప్పిపోతుందని ఆలోచించి ఆ సాహసం చేసింది. మీనాక్షి కూడా శిష్యుడి రహస్యాన్ని బైటపడనీయకుండా దాచింది. ఈ సమాజం మీద బదులు తీర్చుకోవటానికి ఒక అవకాశం దొరికితే స్త్రీలందరూ ఏకమవుతారనిపిస్తుంది. "కన్యాశుల్కం"చదివితే.

వాళ్ళు మామూలు స్త్రీలే కావచ్చు. బలహీనతలతో, అవలక్షణాలతో ఉన్నవాళ్ళే కావొచ్చు. కానీ తమ బతుకుల్ని బాగు చేసుకోవాలని ఆరాటపడే అమాయకులు వాళ్ళు. మొత్తానికి కన్యాశుల్కంలోని స్త్రీలందరి సమిష్టి కృషి వల్లనే సుబ్బి పెళ్ళి ఆగింది. బుచ్చెమ్మకు చదువుకుని వ్యక్తిత్వం సంపాదించుకునే అవకాశం కలిగింది.

సమాజంలో పెద్ద మనుషులుగా, తీర్పరులుగా, ధనవంతులుగా, సంస్కర్తలుగా న్యాయవాదులుగా పేరు తెచ్చుకున్న పురుషుల క్రౌర్యాన్నీ, లోభాన్నీ, కపటత్వాన్ని ,పరిమిత జ్ఞానాన్ని చిత్రించిన గురజాడ, లోకం చేత మోసగత్తెలుగా, తెలివిహీనులుగా, బలహీనులుగా, చపలురుగా, లోభులుగా పరిగణించబడే స్త్రీలలో ఈ లోకం చూడలేని సుగుణాలను ఆవిష్కరించటంలో మానవులను అర్థం చేసుకునేందుకు ఒక కొత్త దృష్టిని ఇచ్చాడు. దానితో మన చూపే మారిపోతుంది. ప్రపంచాన్ని స్త్రీల దృష్టి నుంచి కూడా చూడాలనే ఆలోచన కలుగుతుంది.

వృత్తిరీత్యా సమాజంలో అందరికీ చులకనై అందరిచేతా అసహ్యించుకోబడే వేశ్యను పాత్రగా తీసుకుని మధురవాణిగా మలచి అద్భుతంగా, మానవత్వానికే మహా ప్రతీకగా ప్రతిష్ఠించారు. నాటకంలో అతి మంచి పాత్ర సౌజన్యారావు పంతులికి కూడా మధురవాణి మంచితనం ముందూ, ఆమె మాటల్లోని చమత్కార మాధుర్యం ముందూ, వ్యంగ్య వైభవం ముందు తలవంచక తప్పలేదు. సమాజంలోని ఒక వికృత ఆచారం కన్యాశుల్కం. మరొక వికృతం వ్యభిచారం. ఒకటి వివాహ వ్యవస్థ లోపలిది. మరొకటి వెలుపలిది. రెండూ నాణేనికున్న రెండు వైపులు. రెండింటిలోనూ హింసకూ, అణచివేతకూ, దోపిడీకి గురయ్యేది స్త్రీలే. ఆ స్త్రీలు ఆ హింస నుంచి బైటపడాలంటే ఒకరికొకరు సహకరించుకోవాలి. పురుషుల మధ్య సహకారం సోదరత్వ భావనలను గ్లోరిఫై చేసే సమాజంం స్త్రీల మధ్య సహకారాన్ని సోదరీ భావననూ ప్రచారం చేయదు. వారిని విభజించి పాలిస్తుంది. ఈ విభజనలలో ఒకటి వివాహ సంబంధం లోపలున్న స్త్రీలకూ, బైటవున్న స్త్రీలకూ మధ్య జరుగుతుంది. పతివ్రతలూ, గృహిణులు ఒకవైపు, వేశ్యలూ, వ్యభిచారులు ఒకవైపు ఉంటారు. "మంచికీ చెడుకీ నడుమ కంచు గోడలు" యేర్పడిపోతాయి. ఆ కంచుగోడలను పగులగొట్టుకుని ఒక స్నేహ వారధిని నిర్మించుకోవాల్సిన అవసరాన్ని సూచిస్తూ మధురవాణిని మన ముందు నిలిబెట్టారు గురజాడ. కుటుంబంలో స్త్రీలు అనుభవించే హింసనూ, అణచివేతనీ, వేశ్యావృత్తిలో స్త్రీలకుండే కొద్దిపాటి స్వేచ్ఛనూ, వారికబ్బే తెలివితేటలను, సృజనాత్మకతను చిత్రించి సమాజంలో స్త్రీల గురించి సామాన్యంగా వుండే అభిప్రాయాలను తల్లకిందులు చేశారు. సవాలు చేశారు. ఆ సవాలు చేయటంతో ఎంత సౌందర్యం, ఎంత ప్రేమ, ఎంత స్నేహం!

కన్యాశుల్కం ఆచారానికి బలైపోయిన బుచ్చెమ్మనూ బలికాబోతున్న సుబ్బినీ, వేశ్యయైన మధురవాణి రక్షించటమే కన్యాశుల్క నాటక సారాంశం. అణచివేతకు గురైన స్త్రీలు ఒకరికొకరు తోడైతే ఆ అణచివేత నుండి బైటపడగలరనేఆశను కల్పించింది మధురవాణి. తనకు పేర్లుకూడా తెలియని, ఎన్నడూ చూడని సుబ్బికి, వెంకమ్మకి, బుచ్చెమ్మకి-సహాయం చెయ్యాలనే ఆలోచన ఆమెలోని మానవత్వానికి అనివార్యంగా అవ్యాజంగా కలిగిన ఆలోచనే. మధురవాణి నీతి గలిగిన మనిషి. చాలా దయ గలిగిన మనిషి, ఆమె దయకు పాత్రం కాని మనిషి కన్యాశుల్కంలో ఎవరున్నారు? రావప్పంతుల్ని తప్ప అందరినీ ఆమె క్షమించిందేగాని శిక్షించలేదు. వారి బలహీనతలకు నవ్వుకుందేగాని చీదరించుకోలేదు. "ఏక నలుపుని" చూడటం చేతకాని అచ్చమైన మానవురాలు మధురవాణి.

**(ఓల్గా గారు రచించిన 'సహిత' సాహిత్య వ్యాసాలు అనే పుస్తకం నుండి పాఠకులకు 3 భాగాలుగా అందించడం జరిగింది. 3వ భాగంతో ఈ వ్యాసం ముగిసింది)**

## కావడి భారం...

కష్టసుఖాలు కావడి కుండలైతే....
భారాన్ని కల్గించడం అలవాటుగా మారితే!
కడవంటి గర్భంతో కాళ్లీడ్చుకుంటూ
కాలాన్ని బుతుధర్మాన్ని పంటిబిగువున భరిస్తూ
అరిగిన అడుగుల సవ్వడి గతుకుల రాదారిని పూదారిలా భావిస్తూ
పురడోసుకున్న శైశవాన్ని చంకన జోదలాడిస్తూ
జీవన సమరానికై ఆడదాన్నని, చూలాలినని మరిచి
అంగలేస్తూ.... అంగడి సరుకుని ముంగిలికి చేరుస్తూ
పాతబట్టలకూ మెరిసే పాత్రలను నజరానిగా ఇస్తూ
ఇల్లాలి మోమున వెలుగులు నింపుతూ
పీచ చేరాన్ని పీచమణచలేక
బేలతనాన్ని భోళాతనపు ముసుగులో నిభాయించుకుంటూ
పొందికగా పైసలు కమాయించి సందెవేళ
గూటికి చేరితే.....
గుండెల్లో చేర్చుకోవాల్సిన మగడు
గుట్టు చప్పుడు కాకుండా పైసల్ని కొల్లగొట్టి
గొలుసు దుకాణంవైపు పరుగులెదుతుంటె...
ఆమె భుజాలపై కష్టమూ.....కావడి
కరాళనృత్యం చేస్తూనే వుంటాయిమరి!

- ఇల్ల ప్రసన్నలక్ష్మి

## మిత్రమా!
## స్త్రీల ప్రతినిధిగా చెప్తున్నా

నిరాశలోంచి-
నిస్పృహలోంచి-
మూఢనమ్మకాల ఊబిలోంచి-
ఇప్పుడిప్పుడే బయటికొస్తున్నా
పద్మంలా వికసిస్తున్నా-
కొంచెం నీ చేయి అందివ్వు

నేనూ ఒక మనిషిగా ఎదగాలని
నన్ను నేను నిరూపించుకోవాలని
నా భుజం నేను తట్టుకంటూ
ముందుకొస్తున్నా
కొంచెం ప్రోత్సాహమివ్వు

ఈ విశాల ప్రపంచ యంత్రంలో
ఒక చిన్న మరమేకునవ్వాలని
నా ఉనికిని ప్రకటించుకోవాలని
ఆశపడుతున్నా
కనీసం అడ్డు తగలకు

- వై.వి. ఎస్. కామేశ్వరి

# లైంగిక వేధింపులు ఇక బంద్

## బిల్లుకు త్వరలో మోక్షం

### ఉద్యోగినులకో శుభవార్త!

చాలా కాలంగా పెండింగ్‌లో వున్న లైంగిక వేధింపుల బిల్లుకు త్వరలో మోక్షం లభించనుంది. పనిప్రదేశాల్లో మహిళలకు రక్షణ కల్పించేందుకు, లైంగిక వేధింపుల నిరోధక బిల్లు శీతాకాల సమావేశాల్లో పార్లమెంటు ముందుకు రాబోతుంది. విశాఖ, వర్సెస్ రాజస్థాన్ ప్రభుత్వం (1977 సం॥) కేసులో సుప్రీమ్‌కోర్టు తెలిపిన నిర్వచనాన్ని బిల్లు ప్రతిపాదించింది. శారీరక సంబంధం, లైంగిక చర్యల కోసం ఒత్తిడి, అసభ్య, ద్వందార్థాల వ్యాఖ్యానాలు, అశ్లీల చిత్రాలు చూపించడం వంటివన్నీ లైంగిక వేధింపుల కిందికే వస్తాయి. ఉద్యోగం పోతుందని భయపెట్టటంతోపాటు ఇతర బెదిరింపులు లైంగిక వేధింపుల చట్టం పరిధిలోకే వస్తాయి.

నేడు అన్ని రంగాల్లో మహిళలు పురుషులకు ధీటుగా తమ శక్తి సామర్థ్యాలను నిరూపించుకుంటూ, తాము ఎందులోనూ తక్కువ కాదని చాటుతున్నారు. అయినా మహిళలు ఇల్లు దాటి బయటకు అడుగు పెట్టింది మొదలు అనేక ఆటుపోటులను, అవరోధాలను, సవాళ్ళను ఎదుర్కొంటూ ముందుకు పోవాల్సి వస్తుంది. ఉద్యోగాలు, వృత్తులు చేసుకోకపోతే కుటుంబాలు సాఫీగా నడవని నేటి పరిస్థితుల్లో మహిళలకు పనిప్రదేశాల్లో వివక్షత, వేధింపులు అడ్డుగోడలుగా నిలుస్తున్నాయి. పనిప్రదేశాల్లో లైంగికవేధింపుల నిరోదానికై ఐద్వా స్వతంత్రంగానూ, ఇతర మహిళా సంఘాలను కలుపుకుని చేసిన ఐక్య ఉద్యమాల కృషి ఫలితమే నేటి లైంగిక వేధింపుల నిరోధక బిల్లు 2010.

బిల్లులో శ్రామిక మహిళలకు అనేక అనుకూల అంశాలు ఉండటంతోపాటు సరిచేయాల్సిన రెండు ప్రధానమైన లోపాలుకూడా ఉన్నాయి. అసంఖ్యాకమైన ఇంటిపనివాళ్ళని బిల్లు పరిధిలోకి తీసుకురాకపోటంతోపాటు ఫిర్యాదుదారు నేరం నిరూపించలేకపోతే శిక్షార్హమని పేర్కొనటం సరియైనది కాదు. మొదటగా బిల్లులో పేర్కొన్న అంశాలను పరిశీలిద్దాం.

### బిల్లులోని ముఖ్యాంశాలు:

★ సుప్రీంకోర్టు మార్గనిర్దేశాల ఆధారంగా "లైంగిక వేధింపులు" అనే పదానికి నిర్వచనాన్ని ఇందులో పొందుపరిచారు.

★ ఉద్యోగినులకే కాకుండా కార్యాలయంలోకి వచ్చేవారు, కస్టమర్లు, క్లయింట్లు, రోజువారీ ఉద్యోగులు, శిక్షణ కోసం వచ్చినవారు, తదితరులందరికీ ఈ బిల్లు రక్షణ కల్పిస్తుంది.

★ బిల్లు ప్రకారం ప్రతి సంస్థ మహిళా ప్రిసైడింగ్ అధికారి నేతృత్వంలో మొత్తం సభ్యుల్లో సగం మంది స్త్రీలతో ఒక అంతర్గత ఫిర్యాదుల కమిటీని ఏర్పాటు చేయాలి.

★ పదిమంది కన్నా తక్కువ మంది ఉద్యోగులున్న సంస్థలు ఈ కమిటీలను ఏర్పాటు చేయటం అసాధ్యం కనుక జిల్లా స్థాయిలో స్థానిక ఫిర్యాదుల కమిటీని సంబంధిత జిల్లా అధికారి ఏర్పాటు చేస్తారు.

★ మహిళల కోసం పనిచేస్తున్న ప్రభుత్వేతర సంస్థల నుండి కమిటీకి ఛైర్‌పర్సన్, ఇద్దరు సభ్యులను నియమించాలి.

★ ఫిర్యాదుల కమిటీ బాధితురాలికి అన్ని విధాలుగా సహకరించి పూర్తి అండదండలివ్వాలి.

★ కమిటీ 90 రోజుల్లోగా విచారణ పూర్తి చేయాలి. కమిటీ చేసిన సిఫారసుల అమలుకోసం యజమాని లేదా జిల్లా అధికారికి 60 రోజుల సమయం ఇవ్వాలి.

★ విచారణ జరుగుతున్న సమయంలో ఫిర్యాదుదారుని బెదిరించే, ప్రలోభపెట్టే అవకాశాలు వున్నాయి కనుక ఆమె స్వచ్ఛందంగా ట్రాన్స్‌ఫర్ లేదా సెలవు కోరవచ్చు. ఫిర్యాదు ఎవరిపై అయితే చేసారో వారి ట్రాన్స్‌ఫర్ కూడా కోరవచ్చు.

★ యాజమాన్యం ఫిర్యాదుల కమిటీని వేయటంలో విఫలం అయితే యాజమాన్యంపై ప్రభుత్వం చర్యలు తీసుకోవచ్చు. 50,000 రూ॥ల వరకూ జరిమానా కూడా విధించవచ్చును.

★ జిల్లా అధికారికి గానీ యాజమాన్యానికి గానీ ఫిర్యాదుల కమిటీ వార్షిక నివేదిక అందించాలి.

### యాజమాన్య విధులు:

★ మహిళలు సురక్షితమైన వాతావరణంలో పనిచేసే అవకాశం కల్పించాలి.

★ అంతర్గత ఫిర్యాదుల కమిటీకి సంబంధించిన నోటీసు బోర్డును అందరికీ కనిపించే ప్రదేశంలో పెట్టాలి.

★ ఉద్యోగులకు చట్టం గురించి అవగాహన కలిగించే ట్రయినింగ్ కార్యక్రమాలు పెట్టాలి.

★ ఫిర్యాదుల కమిటీకి సదుపాయాలు కల్పించాలి.

★ ఫిర్యాదులలో సాక్షుల హాజరుకు సహాయపడాలి.

★ బాధిత మహిళ ఐపిసి కింద కేసు పెట్టదలచుకుంటే సాయపడాలి.

**బిల్లులో సవరించాల్సిన అంశాలు:**

- ★ దేశవ్యాప్తంగా లక్షల సంఖ్యలో ఇళ్ళల్లో పనిచేసే మహిళలు ఉన్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో అన్ని పట్టణాలు, నగరాలలో ఇళ్ళల్లో పనిచేసే వారి సంఖ్య పెరుగుతూవుంది. ఇళ్ళల్లో పనిచేసే బాలికలు, మహిళలు యజమానుల చేతిలో అవమానాలు, వేధింపులు, అత్యాచారాలు, హత్యలకు గురికాబడుతున్నారు. ఇంటిపనివారిని కూడా బిల్లు పరిధిలోకి తీసుకురావాలి.
- ★ ఒక మహిళ తాను లైంగిక వేధింపులకు గురయ్యాను అని ఫిర్యాదు చేస్తే అది నిరూపించబడాలని, అందుకు అవసరమయ్యే సాక్షాలను చూపించే బాధ్యత బాధిత మహిళదే అని లేనిచో ఆ మహిళ శిక్షార్హమవుతుందని బిల్లులో వుంది. ప్రస్తుత పరిస్థితుల్లో బాధిత మహిళ తనపై వేధింపులు జరిగాయని చెప్పటానికే ముందుకు రాని స్థితి. ఆరోపణ నిరూపణ అనేక అంశాలపై ఆధారపడి వుంటుంది. అనేక అవరోధాలను దాటితేనే ఆరోపణ నిరూపణకు నోచుకుంటుంది. ఇలాంటి పరిస్థితుల్లో నిరూపణ కానంత మాత్రాన బాధితురాలిని శిక్షిస్తామనే నిబంధన న్యాయసమ్మతం కాదు. దానిని తొలగించాలి.

భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 21 ప్రకారం వేధింపులు లేని సురక్షిత వాతావరణంలో గౌరవప్రదమైన జీవితాన్ని కొనసాగిస్తూ ఏ వృత్తినైనా, ఉద్యోగమైనా, వ్యాపారమైనా చేసుకునే అవకాశం కల్పించబడాలి. సమాజంలో సగభాగమైన మహిళలు సామాజిక ఉత్పత్తిలో పాల్గొనకపోతే సమాజం ముందుకు పోజాలదు. మహిళలు గౌరవప్రదంగా సామాజిక ఉత్పత్తిలో పాల్గొనే విధంగా బిల్లులోని లోపాలను తొలగించి పార్లమెంటులో చట్టం చేయాలి.

- ఐద్వా

# మీతో మాట్లాడుతామనుకోలేదు

## ఫిట్‌నెస్ కోసం మొదలై ఫీట్లు సాధించే వరకు

**ఆరోగ్యాన్ని కాపాడుకునేందుకు చిన్నగా మొదలెట్టిన పరుగు...ఆరేళ్ళు తిరిగేసరికి వారిని దేశంలోనే అరుదైన జంటగా నిలబెట్టింది. ఉత్తరధ్రువంపై జాతీయ జెండాను ఎగురవేయాలన్న లక్ష్యం నెరవేరడమే కాదు... మనదేశం తరపున ఏడు ఖండాలు. ఉత్తరధ్రువంపై మారథాన్ పూర్తిచేసిన ఉమ, కృష్ణప్రసాద్ దంపతులు, వృత్తిరీత్యా వ్యాపారస్థులైన వీరి యాత్ర వెనుక దాగిన సాహసాలు, మిగిల్చిన అనుభూతులను తెలుసుకుందాం.**

**వ్యాపారస్థులకు** ప్రతి నిమిషం విలువయినదే. తీరిక లేనంత సమయంలోనూ ఉమ (49) కృష్ణప్రసాద్ (54) ఆరోగ్యాన్ని ఏమాత్రం నిర్లక్ష్యం చేసేవారు కాదు. 28 ఏళ్ళ క్రితం పెళ్ళి చేసుకున్న ఈ జంట... నిత్యం నడకతో పూర్తి ఫిట్‌గా ఉండేందుకు ప్రయత్నించేది. అలా మొదలైన పరుగు....ఆరేళ్ళ క్రితం కేబీఆర్ పార్కులో సరదాగా నాలుగు కిలోమీటర్లకు పెరిగింది. ఇది వారి శరీరంలో కొత్త శక్తిని ఇచ్చినట్లు అనిపించింది. అదే ఊపుతో హైద్రాబాద్‌లో ఏటా నిర్వహించే 10కె మారథాన్ కూడా ఆటల్లాంటివే అని భావించే ఈ దంపతులు... విదేశాల్లో ఇంకా బాగా నిర్వహిస్తారు కాబట్టి వాటిలోనూ పాల్గొనేవారు. అప్పుడే తెలిసింది వీరికి " గ్రాండ్ స్లామ్ మారథాన్ " గురించి. చాలా దేశస్థులు పాల్గొంటున్నారు గాని....భారతీయుల ప్రాతినిధ్యం మాత్రం కనిపించకపోవటం లోటు అనిపించింది వీరికి. అందుకే ఎలాగైనా ఈ సాహస యాత్రకు సిద్ధమయ్యారు.

**ఏడాదిపాటు....** సహజంగా ధృవాలపై ప్రయాణానికి ఉష్ణప్రాంతాల నుంచి వెళ్ళేవారు అరుదు. 35 డిగ్రీల ఉష్ణోగ్రత నుంచి ఒక్కసారిగా మైనస్ డిగ్రీల ఉష్ణొగ్రత ఉండే చోటుకి వెళ్ళడమంటే ప్రాణాలతో సాహసమే! ఏడు ఖండాల్లో ఆరింటిలో మారథాన్ పూర్తిచేసిన ఉమ, కృష్ణప్రసాద్ దంపతులు...చివరిఖండం అంటార్కిటికాలో క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొన్నారు. అత్యంత చలిగా ఉండే ఈ ప్రాంతంలో వారు ధరించిన దుస్తులు చలిబారి నుంచి కాపాడలేకపోయాయి. శరీర భాగాలు ఉన్నాయో, లేవో అన్నంతగా గడ్డకట్టుకుపోయాయట. ఓ దశలో ఇక ప్రాణాలతో బయటపడతామనే ఆశను సైతం వదిలేసుకున్నారు. అయినా లక్ష్యం కోసం స్థైర్యాన్ని కూడగట్టుకుని విజయవంతంగా ఉత్తరధృవంపై పరుగెత్తేందుకు అర్హత సాధించారు.

**లక్ష్యం కోసం పరుగులు...** అత్యంత చల్లగా ఉండే మంచు ప్రదేశం ఉత్తరధృవంపై మైనస్ డిగ్రీలు, ఎముకలు కొరికే చలి అంటే అదే. మంచు బిలాల కింద నోళ్ళు తెరుచుకుని ఉంటాయి. నీటిపై 6 అడుగుల మందం ఉండే మంచు. అప్పుడప్పుడు సెకనుకు రెండు నుంచి 8 మీటర్ల వేగంతో వేర్వేరు దిశల్లో తిరుగుతుంటుంది. ఒక వ్యక్తి కదలకుండ ఓచోట నిల్చుంటే గంట తర్వాత చూస్తే కిలోమీటరు దూరాన ఉంటాడు. నిరంతరం భ్రమిస్తుంటుంది కాబట్టి ఖచ్చితంగా ఒక స్పాట్ అంటూ ఉండదు. జీపీఎస్ ద్వారా.... చేరుకోవాల్సిన ప్రాంతాన్ని గుర్తించి పరుగును ప్రారంభిస్తారు. కొన్నిచోట్ల మోకాల్లోతు మంచులో కాలు దిగబడి ప్రాణాలకు ముప్పు వాటిల్లే ప్రమాదం ఉంటుంది. ఇలాంటి పరిస్థితిలో అక్కడికి వెళితే ఇక తిరిగి వస్తామన్న భరోసా ఉండదు. అలాంటి చోట ఉమ, కృష్ణప్రసాద్‌ల జంట పరుగెత్తి ఘనకీర్తిని సాధించారు.

**మరువలేని జాతీయ గీతం....** మనిషి అన్నాక ఖాళీగా ఉండకుండా ఏదో ఒకటి సాధించేందుకు కృషి చేస్తూనే ఉండాలన్నది ఈ దంపతుల ఫిలాసఫీ. ప్రస్తుతానికి అనుకున్న లక్ష్యం నెరవేరిందని సంతృప్తి వ్యక్తం చేసారు కృష్ణప్రసాద్. ఉత్తరధ్రువంపై జెండా పాతి జాతీయ గీతాన్ని పాడటం తన జీవితంలో మర్చిపోలేని అనుభూతి అన్నారు ఉమ. తమ గొంతు, ముఖంపై చలిపులి చేసినవి గాయాలు కావని, యాత్ర తాలూకా మధురానుభూతులు అన్నారీ దంపతులు.

(ఈనాడు సౌజన్యంతో)

# షెల్టర్

- గోపాలుని విజయలక్ష్మి...

పిల్లల్ని, భర్తని పంపించేశాక తీరిగ్గా టీ కప్పు పట్టుకుని కారిడార్‌లో కూర్చుని పేపర్ తిరగేస్తూ టీ తాగటం సురేఖ దినచర్యలో అతి ప్రధానమైన అంశం. తెల్లవారు ఝామున ఐదు గంటలకి లేచినా తొమ్మిందింటిదాకా ఒక్క క్షణం ఖాళీ లేకుండా ఉరుకులు, పరుగులు పెట్టే సురేఖకి ఈ క్షణాలు ఎంతో అమూల్యమైనవిగా అనిపిస్తాయి. రోజూలాగే ఈరోజు కూడా టీ కప్పుతో కారిడార్‌లోకి వచ్చిన సురేఖ దృష్టి యథాలాపంగా ఎదురుగా ఉన్న రేకులషెడ్డుమీదికి మళ్ళింది. గత నాలుగు నెలల నుంచి ఆమె దినచర్యలో ఇదీ ఒక భాగమే అయింది. రోజూ ఈపాటికి ఆ రేకులషెడ్డులో ఉండే ముసలామె కూడా గ్లాసుతో టీనో, కాఫీనో, లేకుంటే మరింకేదో పట్టుకుని నీరెండలో కూర్చుని తాగుతూ ఉంటుంది. సురేఖకి ఆమెతో ఇంతవరకు పరిచయమైతే లేదుగానీ, ఆమె దినచర్యలన్నింటినీ ఇక్కడే కూర్చుని గమనిస్తూ ఉంటుంది.

ఆ ముసలామె ఆ షెడ్డులోకి వచ్చి నాలుగు నెలలైంది. సురేఖ వాళ్లు కూడా ఆ ఇల్లు కట్టుకుని ఐదారేళ్ళయింది. వాళ్ళు ఈ ఇంట్లోకి వచ్చేసరికే ఎదురుగా ఉన్న రేకులషెడ్డు తాళం పెట్టి ఉండేది. షుమారు రెండు వందల గజాల స్థలంలో ఉంది ఆ పాత రేకులషెడ్డు. చుట్టూ మోకాలులోతు పెరిగిన పిచ్చి మొక్కలు, గడ్డి ఉండేవి. అసలు ఆ షెడ్డు ఎవరిదో, ఎందుకలా పాడుపెట్టినట్టు వదిలేశారో సురేఖకి తెలీదు. అసలు తెలుసుకోవాలనే ఆసక్తి కూడా ఆమెకి లేదు. కానీ ఈమధ్యే ఆ ముసలామె ఎక్కడ్నుంచి వచ్చిందోమరి, ఆ షెడ్డులో నివాసం ఏర్పరచుకుంది. మొదట ఆమెని చూసినప్పుడు సురేఖకి చాలా ఆశ్చర్యం వేసింది. ఆరోజు కూడా అంతే. ఇలాగే టీ తాగుతూ, పేపర్ తిరగేస్తున్న సురేఖ కాకతాళీయంగా ఎదురింటివైపు చూసింది. అక్కడ ముసలామె చాలా ఓపిగ్గా కూర్చుని షెడ్డు చుట్టూ ఉన్న పిచ్చిమొక్కల్ని, గడ్డిని పీకుతోంది. అప్పుడు సురేఖ ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. కానీ వారం తర్వాత చూస్తే ఆ ఖాళీ ప్రదేశమంతా ఎంతో శుభ్రంగా, అందంగా కనిపించింది. వాకిలి కూడా ముగ్గుతో కళకళలాడుతోంది. అంత వయసులో కూడా ఆమె ఎంత ఓపిగ్గా ఆ ప్రదేశాన్ని బాగుచేసుకుంది. అనుకుంది సురేఖ. ' నిజానికి అలా చేయాలంటే కావలసింది ఓపిక కాదు. ఓర్పు' అనుకుంది మళ్ళీ.

అలా మొదలైన సురేఖ ' ఆషెడ్డు మీద దృష్టి సారించటం' అనే అంశం నాలుగు నెలల్లో ఒక దినచర్యగా మారిపోయింది.

ఆ ముసలామె ఎదురింట్లోకి వచ్చి నాలుగు నెల్లయినా ఆమె చుట్టుప్రక్కల ఎవరితోనూ ఎలాంటి పరిచయాలు పెంచుకోలేదు. చుట్టుప్రక్కల వారికి కూడా ఆమె గురించిన విషయాలేమీ పెద్దగా తెలీదు. నిజం చెప్పాలంటే సిటీ కల్చర్‌లో ఇది కూడా ఒక భాగం. కనీసం ఇరుగు పొరుగు గురించి ఒకరికొకరు తెలీకపోవటం అనేది చాలా సహజమైపోయింది.

కానీ సురేఖ మాత్రం ఎందుకో ఆవిడమీద అప్పుడప్పుడు దృష్టి పెడుతూ ఉండేది. అలా దృష్టి పెట్టిన సురేఖకి ఆమె గురించి కొన్ని విషయాలు అర్థం అయాయి. ఆమె వయసు సుమారు డెబ్భైకి పైనే ఉంటుంది. ఆమె నడిచేప్పుడు ఎందుకో బాగా కుంటుతూ నడుస్తోంది. ఆ కుంటితనం వయస్సుతో వచ్చిందో, చిన్నతనం నుండి ఉన్న వైకల్యమో లేదా ఏదన్నా ప్రమాదం వల్ల ఏర్పండిదో తెలీదు. అంత పెద్ద వయసులోనూ ఆమె ఇంటి పని, వంట పని,



బజారు పన్లు అన్నీ తానే చేసుకోవటం సురేఖకి చాలా ఆశ్చర్యం అనిపిస్తుంది. ఇంకా నలభై కూడా రాకుండానే పనిపిల్ల వుండి అన్ని పన్లు చేస్తుంటే పిల్లలకి, మొగుడికి వండి పెట్టటం, ఏవో పైపై నర్దుళ్ళు చూసుకోవటానికే తాను నానా హైరానా పడుతుంది. అలాంటిది అంత పెద్ద వయసులో శారీరకమైన వైకల్యం ఉండి కూడా ఆమె పనులన్నీ ఒక్కతే చేసుకోవటం చూస్తుంటే సరేఖకి నిజంగానే అబ్బురమనిపిస్తుంది. సాయంత్రం అయిదయేసరికి ఒంటరిగా ఇంటి ముందున్న ఖాళీ స్థలంలో ఒక పాత పడక్కుర్చీలో కూర్చుని ఆకాశం వంక చూస్తూ వుండే ఆమెని చూస్తే సురేఖకి ఎంతో జాలి కల్గుతుంది. వెళ్ళి పరిచయం చేసుకుని మాట్లాడాలని చాలా సార్లే అనుకుంది. కానీ అలా చేయలేదు. 'ఎందుకు చేయలేదు' అన్నదానికి మాత్రం సురేఖ దగ్గర కూడా సమాధానం ఉండదు. అది అంతే.

సురేఖ టీ త్రాగటం పూర్తయింది. ఆమె ఆరోజు పేపర్ చదవలేదు. టీ తాగుతున్నంతసేపు ఆమె ఆలోచనలు ఎదురింట్లో ఉండే ముసలామె మీదే ఉన్నాయి. 'ఒకవేళ ఎదన్నా ఊరు వెళ్ళిందా? లేదా వచ్చిన చోటికే తిరిగి వెళ్ళిపోయిందా? అనుకుంది. ఆ ఆలోచన రాగానే వెంటనే ఇంటి తలుపువైపు చూసింది. దానికి గడియగానీ, తాళం గానీ లేదు. అంటే ముసలామె ఇంట్లోనే ఉందన్నమాట. ఒకవేళ ఏదో పన్లో ఉండటమో, లేకపోతే బద్ధకంగా ఉండి లేవలేకపోవటమో అయిఉంటుంది' అనుకుంది. అలా అనుకోగానే మనసు కొంచెం తేలికపడింది.

వీకెండ్స్ కావటంతో సురేఖ ఈరెండు రోజులూ చాలా బిజీగా ఉంది. పిల్లలు, భర్త ఇంట్లో ఉంటే ఆమెకి ఒక్క నిముషం తీరిక దొరికినట్టు అనిపించదు. సిటీలో ఉండే వాళ్ళు వీకెండ్స్‌ని చాలా అపురూపంగా భావిస్తారు. ఈ వీక్‌డేస్‌లో పెండింగ్‌లో ఉన్న ఇంటిపన్లు బయటి పన్లు అన్నీ ఆ రెండు రోజుల్లోనే పూర్తి చేసుకోవాలి. ఒక్కొక్కసారి బంధువులు, స్నేహితులు విజిట్స్ కూడా అప్పుడే ఉంటాయి. సురేఖ కూడా ఈరెండు రోజులు కార్యక్రమాల్లో బిజీ అయిపోయింది.

సోమవారం ఉదయం పిల్లలు, భర్త వెళ్ళిపోగానే కొంచెం తీరిక దొరికినట్టుంది సురేఖకి. యథాప్రకారం టీ కప్పుతో కారిడార్‌లోకి వచ్చి కూర్చుంది. అప్పుడుగానీ గుర్తురాలేదు, ఈరోజు కూడా సురేఖ కళ్ళు ముసలామె కోసం వెతికాయి. కానీ ఆమె కనిపించలేదు. సురేఖకి ఎందుకో కొంచెం భయం వేసింది. "ఒకవేళ ముసలామె షెడ్డులో..........." అంతకన్నా ఆలోచించటానికి ఆమె మనసు అంగీకరించలేదు. ఇంక మనసాగక గబగబా టీ తాగి, కప్పు లోపల పెట్టి టేబుల్ మీద ఉన్న తాళం కప్పు తీసుకుని బయటికి వచ్చింది. ఇంటికి తాళం వేసి, నైట్ డ్రస్‌లో ఉన్నాననే విషయం కూడా మర్చిపోయి ఎదురింటివైపు గబగబా అడుగులు వేసింది.

చుట్టూ కాంపౌండ్ వాలు ఉంది. చాలా ఏళ్ళ క్రితం కట్టేసి వదిలేయటం వల్ల గేటు మాత్రం తుప్పుపట్టి వుంది. చిన్నగా గేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టింది. మనసులో కొంచెం జంకుగా ఉంది. ఆ జంకు కొత్త ఇంటికి అలా చొరవచేసి వస్తున్నందుకో, లేదా లోపల ముసలమ్మని ఏ స్థితిలో చూడాల్సొస్తుందో అన్న ఆలోచనల్లో ఆమెకే స్పష్టంగా తెలీటం లేదు. "ఒక్క అరగంట క్రితం ఈ ఆలోచన వచ్చి ఉంటే ఇలా ఒక్కతినే రాకుండా రాములమ్మని కూడా వెంటబెట్టుకు వచ్చేదాన్ని కదా! అనుకుంది.

గేటు దాటి లోపలికి వచ్చి ఇంటి వాకిటి ముందు ఒక్క క్షణం తటపటాయిస్తూ నించుంది. తర్వాత తలుపు మీద టకటకా శబ్దం చేసింది, కానీ లోపల్నుంచి ఎటువంటి సమాధానం రాలేదు. ఈసారి నిజంగానే సురేఖ గుండె దడదడలాడింది. తానేమన్నా తొందరపడుతున్నానా? అని మళ్ళీ ఆలోచించింది. మొదట్నుంచి తానేదన్నా చెయ్యాలి అనుకుంటే చేసేయటమే అలవాటు ఆమెకి. అందుకే చిన్నగా తలుపు తోసి రెండడుగులు లోపలికి వేసి, లోపల పరీక్షగా చూసింది.

అక్కడ వున్నది ఒక్కటే విశాలమైన గది. గదిలో ఒకపక్క మంచం మీద ముసలామె ముడుచుకుని పడుకునుంది. ఆ దృశ్యం చూడగానే సురేఖకి చాలా బాధ కలిగింది. గబగబా దగ్గరికి వెళ్ళి ఆమె భుజం మీద చేయివేసి చిన్నగా కుదుపుతూ "మామ్మగారూ, మామ్మగారూ" అంది. అతి కష్టంమీద కళ్ళు తెరిచింది ముసలామె. ఎదురుగా ఉన్న సురేఖ వంక ఆశ్చర్యంగా, ప్రశ్నార్థకంగా చూసింది. అది అర్థం అయిన సురేఖ మంచం దగ్గరే క్రింద కూర్చుంటూ 'నేను మీ ఎదురింట్లో ఉంటానండి. నా పేరు సురేఖ. ఏం మామ్మగారూ ఒంట్లో బాగాలేదా? అని అడిగింది. సురేఖ అలా అడుగుతుంటే మామ్మగారి కళ్ళల్లోంచి కన్నీళ్ళు జలజలా రాలాయి. ఆమె తన భుజం మీద ఉన్న సురేఖ చేతిని అతికష్టం మీద తన చేతుల్లోకి తీసుకుని గట్టిగా పట్టుకుని విలవిలా ఏడ్చేసింది. సురేఖకి ఆమెస్పర్శలోనే ఆమె బాధ ఏంటో అర్థం అయింది. సరేఖకి ఇప్పుడు ఆమెకి ఏం కావాలో స్పష్టంగానే తెలిసింది. ఆమె ఒంటిమీద చేయివేసి చూసింది. ఒళ్ళు కాలిపోతోంది. 'ఎన్ని రోజుల్నుంచి ఉంది జ్వరం" అని అడిగింది. ఆప్యాయతగా.

మూడు వేళ్ళు చూపించింది ఆమె.

"మరి మందేమన్నా వేసుకున్నారా? అడిగింది సురేఖ.

లేదన్నట్టు తల అడ్డంగా తిప్పింది ఆమె.

ఆహారం గురించి అడగబోయి ఆగిపోయింది. ఆ సమయంలో ఆ ప్రశ్న చాలా అసహజంగా ఉంటుందనిపించింది. ఐదు నిముషాల్లో తన కర్తవ్యాన్ని నిర్ణయించుకుంది. " ఉండండి మామ్మగారూ, ఇప్పుడే పది నిమిషాల్లో వస్తాను' అని చెప్పి, ఆమె చేతిలోని తన చేతిని అతి కష్టం మీద విడిపించుకుని గబగబా ఇంటివైపు నడిచింది.

★ ★ ★ ★

పావుగంటలో రెడీ అయి పర్స్ తీసుకుని చేతిలో పాల గ్లాసుతో మామ్మగారి దగ్గరికి వచ్చింది సురేఖ. బలవంతంగా ఆమె చేత పాలు తాగించింది, ఆమెని తీసుకుని ఆటోలో దగ్గర్లో ఉన్న డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళింది.

★ ★ ★ ★

నాలుగు రోజుల తర్వాత మామ్మగారికి జ్వరం తగ్గిందిగానీ ఆమె మామూలు మనిషి మాత్రం కాలేకపోయింది. చాలా నీరసంగా ఉంటోంది. ఆమె తిరిగి మామూలు మనిషి కావాలంటే దాదాపు పదిరోజులు పడుతుందని డాక్టర్స్ చెప్పారు. టైంకి మందులు, ఆహారం ఇవ్వటం చాలా అవసరమన్నారు. ఈ నాలుగు రోజులు సురేఖ మామ్మగారి పట్ల చూపిన బాధ్యత, ప్రేమ చూసేవాళ్ళందరికి ఆశ్చర్యం అనిపించింది. ఏ సంబంధం లేని ఒక మనిషి కోసం సురేఖ అంత తాపత్రాయపడ్డాన్ని చూసి 'యత్‌భావం తత్

భవతి' రీతిలో మాట్లాడారు. చుట్టుపక్కల జనం. వాళ్ళకి ప్రక్కవాళ్ళని ఎప్పుడు పట్టించుకోవాలో, ఎప్పుడు పట్టించుకోకూడదో బాగా తెలుసు. సురేఖ గురించి బాగా తెలుసు కాబట్టి ఆమె భర్త అనిల్, ఆమె పిల్లలు సురేఖకి పూర్తి సహకారం అందించారు.

ఇంకా పదిరోజుల దాకా మామ్మగారు కోలుకోలేరని డాక్టర్లు చెప్పాక సురేఖ ఆలోచనలో పడింది." వయసుని బట్టి చూస్తే ఆమె చాలా పెద్దది. ఒకవేళ ఆమె చివరిదశలో ఉందేమో ఎవరికి తెలుసు? అలాంటప్పుడు వాళ్ళవాళ్ళకి అప్పచెప్పటం ధర్మం. తీరా అంతా అయిపోయాక అప్పుడు ఆలోచిస్తే వాళ్ళ ఆచూకీ కూడా తమకు తెలియక పోవచ్చు". అనుకుంది సురేఖ. తన ఆలోచనలో తప్పేమీ లేదని, తను కరెక్టుగానే థింక్ చేస్తున్నానని అనిపించింది సురేఖకి. అందుకే మర్నాడు మామగారి దగ్గర కూర్చుని చిన్నగా అడిగింది. ' మామ్మగారూ! మీకు సర్వీసు చేయటం నాకేమంత కష్టంకాదు మీరు ఇంకా పూర్తిగా కోలుకోవటానికి దాదాపు పదిరోజులు పడుతుందని డాక్టర్లు చెప్పారు. అలాంటప్పుడు మీవాళ్ళు మీ దగ్గరుంటే వాళ్ళకూ తృప్తిగా ఉంటుంది. నేనిలా అన్నాని మీరు వేరే విధంగా అనుకోకండి. ఇది నా బాధ్యత అనిపించి చెబుతున్నాను. మీ వాళ్ళ వివరాలు చెప్తే వాళ్ళని పిలిపిస్తాము. మీకూ తృప్తిగా ఉంటుంది, వాళ్ళని పిలిపిస్తాము' అంది. ఈ మాటలు చెప్పేటపుడు ఆమె నొచ్చుకోకుండా ఎంతో మృదువుగా చెప్పింది సరేఖ.

ఆ మాటలు వినంగానే ముసలామె ముఖం కళావిహీనం అయింది. భారంగా కళ్ళు మూసుకుంది. మళ్ళీ కన్నీళ్ళు, అది చూసి ఖంగారు పడింది సురేఖ. వెంటనే ఆమె చేతుల్ని ఆప్యాయంగా తన చేతుల్లోకి తీసుకుని ' మామ్మగారూ! మీరలా కళ్ళనీళ్ళు పెట్టుకుంటే నాకు చాలా బాధగా ఉంటుంది. మిమ్మల్ని బాధపెట్టాలని కానీ, లేదా మీకు చేయటం నాకు కష్టం అనికానీ నేనలా అనలేదు. మీ అనారోగ్యం సంగతి మీవాళ్ళకి తెలియజేయకపోతే వాళ్ళు బాధపడతారేమో అని అడిగానంతే'' అంది సురేఖ. తన చీరకొంగుతో ఆమె కన్నీళ్ళు తుడిచింది.

రోజులు గడుస్తున్నాయి. ముసలామెకి ఇంకా పూర్తి ఆరోగ్యం చేకూరలేదు. జ్వరమైతే రావటం లేదు గానీ చాలా నీరసంగా పడుకుని ఉంటోంది. సురేఖ ' ఇంక ఆమె బాధ్యత పూర్తిగా తనదే' అన్న నిర్ణయానికొచ్చేసింది. ఆమెకి సమయానికి మందులు, ఆహారం ఇస్తోంది. ఎంత బ్రతిమలాడినా ముసలామె సురేఖా వాళ్ళింటికి వెళ్ళటానికి ఒప్పుకోలేదు. తను ఆ షెడ్డులోనే ఉంటానంది. రాత్రిళ్ళు మాత్రం రాములమ్మని తోడుగా పడుకోపెట్టేది సురేఖ.

ముసలామె అప్పుడప్పుడు ఓపిక తెచ్చుకుని సురేఖతో రెండు మూడు మాటలు మాట్లాడేది. ఆ మాటల్లో ఆమె పట్ల కృతజ్ఞతలే ఎక్కువగా ఉండేది. నిజం చెప్పాలంటే ఆమె మాటల్లో కన్నా ఆమె కళ్ళల్లోనే కృతజ్ఞతాభావం ఎక్కువగా కనిపించేది సురేఖకి. అలాగే మరో వారం రోజులు గడిచిపోయాయి. ముసలామె కనీసం ఎప్పటికైనా వాళ్ళ వాళ్ళ వివరాలు చెప్తుందేమో అని సురేఖ ఎదురు చూస్తూనే ఉండేది. కానీ ఆమె మాత్రం అసలా ప్రస్తావనే తెచ్చేది కాదు. సురేఖకి అదొక పెద్ద మిస్టరీగానే ఉంది.

ఒకరోజు తెల్లవారుఝామున నాలుగు గంటలకి కాలింగ్ బెల్ మోగింది. సురేఖకి, వాళ్ళాయన అనిల్‌కి మెలుకువ వచ్చి ' ఈ సమయంలో ఎవరై ఉంటారా! అనుకుంటూ హాల్లోకి వచ్చి డోర్ తీశారు. ఎదురుగా ఖంగారు పడుతూ రాములమ్మ. చూడగానే వాళ్ళిద్దరికి విషయం అర్థం అయిపోయింది. డోర్‌లాక్ చేసి రాములమ్మ వెంట ముసలామె దగ్గరికి వెళ్ళారు.

ఆమె ఎంతో ప్రశాంతంగా పడుకుని వుంది. ఈ నాలుగైదు నెలల్లో సురేఖ ఎప్పుడూ ఆమెనంత ప్రశాంతంగా చూసి ఉండదు. అలా చలనం లేకుండా పడుకుని ఉన్న మామ్మగార్ని చూడగానే సురేఖకి చెప్పరానంత దుఃఖం వచ్చింది. మామ్మగారి మంచం దగ్గర కూలబడి ఆమెని రెండు చేతులలో గట్టిగా పట్టుకుని గుండెలమీద తలపెట్టి వెక్కివెక్కి ఏడ్వటం మొదలుపెట్టింది.

"ఎంతసేపయింది? రాములమ్మని అడిగాడు అనిల్.

"రెండు గంటలకాడ్నించి బాగా ఆయాసపడిపోయారు బాబూ? మిమ్మల్ని పిలుచుకొస్తానంటే వద్దని వారించారు. పావుగంట క్రితమే పానం ఆగిపోయింది" కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది రాములమ్మ.

పది నిముషాల తరువాత సురేఖ దుః ఖంలో తీవ్రత తగ్గింది. అనిల్ ఆమె భుజం మీద చేయివేసి " కొంచెం కంట్రోల్ చేసుకో రేఖా. చివరి రోజుల్లో నువ్వు ఆమెకి ఎంతో సర్వీసు చేసావు. ఆమె అదృష్టవంతురాలు కాబట్టి ఇంకా బాధ పడకుండా వెళ్ళిపోయింది". అన్నాడు ఓదారుస్తూ

"ఏం అదృష్టం లెండి. అయిన వాళ్ళంటూ ఎవరూ లేకుండా దిక్కులేని దానిలాగా ఈ షెడ్డులో ఇలా ఒంటరిగా వెళ్ళిపోయింది'. అంది సురేఖ బాధగా.

"ఏమో రేఖా! ఆమెకి ఇలా ఒంటరిగా బ్రతకటంలోనూ, ఒంటరిగా వెళ్ళిపోవటంలోనే తృప్తి ఉందేమో మనకేం తెలుసు?" అన్నాడు అనిల్.

మొదట్నుంచి కర్మకాండల వంటి తతంగాలమీద నమ్మకం లేదు కాబట్టి సురేఖ, అనిల్ మామ్మగారి అంతిమ యాత్రని తమకు తోచిన విధంగా పూర్తిచేసారు. ఆ కార్యక్రమానికి మాత్రం చుట్టుప్రక్కల వాళ్ళంతా హాజరయి సంతాపాన్ని, సానుభూతిని తమ శక్త్యానుసారం ప్రకటించారు.

ముసలామె మరణం సురేఖని మానసికంగా చాలానే ప్రభావితం చేసింది. ఆమె వారం రోజుల దాకా కోలుకోలేకపోయింది. ప్రతిక్షణం మామ్మగారి కళ్ళలోని కృతజ్ఞతా భావమే ఆమెని వెంటాడుతోంది.

వారం రోజుల తర్వాత రాములమ్మతో అంది. 'రాములమ్మా! మామ్మగారు చనిపోయాక మళ్ళీ మనం ఆ ఇంటికి వెళ్ళలేదు. సాయంత్రం ఇద్దరం వెళ్ళి ఆమె వస్తువులన్నీ చూసొద్దాం. అసలు ఆ ఇల్లు ఎవరికి హ్యాండ్ ఓవర్ చేయాలో అన్నా తెలుస్తుంది. అంది సురేఖ.

సాయంత్రం ఇద్దరూ వెళ్ళి మామ్మగారి సామానంతా పరిశీలించారు. ఆ ఇంట్లోకి అడుగు పెట్టగానే సురేఖకి మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది. ఆ ఇంట్లో అంతా కలిపితే ఏవో కొద్దిపాటి వంట పాత్రలు, డబ్బాలు, రెండు పెద్దవి పూర్వకాలపు ట్రంకు పెట్టెలు, మామ్మగారు పడుకునే మంచం, పరుపు, రెండు దిండ్లు తప్ప ఏమీ లేవు, మొదట ఇద్దరూ ట్రంకు పెట్టె ఓపెన్ చేసి చూసారు. ఒక పెట్టెలో పెద్ద పాతగుడ్డల మూట, ఆమె కట్టుకునే చీరలు ఉన్నాయి. అవి తీసి పక్కన పెట్టి రెండో పెట్టె తెరిచారు. అందులో ఏవో దేముడి స్తోత్రాల పుస్తకాలు, రుద్రాక్షలు, కొన్ని కాగితాలు, ఒక ఆల్బమ్ ఉన్నాయి.

సురేఖ చాలా ఆత్రంగా ఆల్బమ్ తీసి చూడటం మొదలు పెట్టింది. మొదట ఒక

దంపతుల ఫోటో ఉంది. అది మామ్మగారు యుక్త వయసులో ఉన్నప్పటి ఫోటో అని పరీక్షగా చూస్తే అర్థం అయింది సురేఖకి. ప్రక్కన ఉంది ఆమె భర్త అయివుండచ్చు. వయసు దగ్గర దగ్గర ముప్పై ఉంటాయి. మామ్మగారు పెద్ద బొట్టు, తలనిండా పువ్వులు, ఒంటి నిండా నగలు, పట్టుచీరతో కళకళ లాడుతూ ఎంతో అందంగా ఉన్నారు. ఆల్బం మొత్తం తిరగేసిన సురేఖకి మామ్మగారు వాళ్ళ ఆయనతో దిగిన ఫోటోలు కొన్ని, ఆమె చిన్ననాటివి అయి ఉండొచ్చు, ఆ ఫోటోలు కొన్ని ఉన్నాయి. దాంతో సురేఖకి ఆ ఆల్బమ్ వల్ల ఎటువంటి ఉపయోగం లేకపోయింది. అందులో ఉన్న కాగితాలన్నీ పరిశీలిస్తేనన్నా వాళ్ళ బంధువుల వివరాలుగానీ, ఫోన్ నెంబర్లు గానీ దొరుకుతాయోమో అన్న ఆశ కలిగింది సురేఖకి. కానీ అవన్నీ మామ్మగారివి టెన్త్ నుంచి డిగ్రీదాకా వున్న సర్టిఫికెట్స్. ఇన్నేళ్ళ తర్వాత వాటి ద్వారా మామగారి వివరాలు తెలుసుకోగలగటం హైలీ ఇంపాజిబుల్ అనుకుంది సురేఖ. కానీ మామ్మగారు ఆ రోజుల్లోనే గ్రాడ్యుయేషన్ చేసారంటే చాలా ఆశ్చర్యమనిపించింది.

చివరి ప్రయత్నంగా ఆమె మంచం దగ్గరికి వెళ్ళి పరుపు క్రింద వెతకటం మొదలు పెట్టింది. అక్కడ ఆమెకి ఒక కవర్ కనిపించింది. ఆత్రంగా కవర్ ఓపెన్ చేసింది. లోపల ఏవో కాగితాలు ఉన్నాయి. అది తీసి చదవటం మొదలుపెట్టిన సురేఖ ఒక్క నిముషం ఆశ్చర్యపోయింది. అవి మామ్మగారు సురేఖకి రాసిన ఉత్తరం. ఆమె తనకి అంత పెద్ద లెటర్ ఎప్పుడు రాశారో అర్థం కాలేదు సురేఖకి.

తన ప్రమేయం లేకుండానే మంచం మీద కూలబడి లెటర్ చదవటం మొదలు పెట్టింది.

" దేవత వంటి సురేఖకి,

సహజంగా చిన్నవాళ్ళని పెద్దవాళ్ళు దీవిస్తూ లెటర్ మొదలు పెడతారు. కానీ నేను మాత్రం నీకు రెండు చేతులు జోడించి కృతజ్ఞతలు తెలుపుకుంటూ లెటర్‌ని మొదలు పెడుతున్నాను.

బహుశా ఈపాటికి నా వివరాల కోసం చాలా ప్రయత్నించి ఉంటావు. కానీ నా గతజీవితపు గుర్తులేవీ నేను మిగల్చుదల్చుకోలేదు. అన్ని బంధాలకీ, జ్ఞాపకాలకీ దూరంగా బ్రతకాలనే నేను ఇక్కడికి వచ్చాను. కన్న తల్లి కన్నా, బిడ్డకన్నా మిన్నగా నన్ను చివరి దశలో ఆదుకున్నావు. అందుకే నా గురించి కొన్ని ముఖ్యవిషయాలు నీకు చెప్పటం నా ధర్మం అనిపించింది.

నా పదవ ఏట అమ్మా, నాన్నా యాక్సిడెంట్‌లో చనిపోయారు. నన్నూ, అక్కని మా మేనమామ వాళ్ళింటికి తీసుకువెళ్ళి వాళ్ళ పిల్లలతో సమానంగా ఏ లోటూ రాకుండా పెంచారు. తల్లీ తండ్రీ లేని మాకు చదువుండటం ఎంతో అవసరమనుకుని మమ్మల్ని డిగ్రీ చదివించాక అందం, చదువు, ఆస్థి ఉన్న నాకు దేముడి కల్పించిన ఒకే ఒక్క లోపం చిన్నతనంలోనే పోలియో వచ్చి ఒక కాలు చచ్చుబడిపోవటం. వెనకాల తల్లి తండ్రులు లేక, అవిటితనం కూడా ఉండటంతో నన్ను పెళ్ళి చేసుకోవటానికి చాలా మంది వెనకాడేవారు. కానీ మా మేనమామ దూరపు బంధువు ఒకాయన నన్ను చేసుకోవటానికి ఇష్టపడ్డారు. కానీ ఆయన నాకన్నా పదేళ్ళ పెద్దవాడు. మొదటి భార్య టి.బితో చనిపోయింది. ఆ రెండు విషయాల్ని పక్కన పెడితే చాలా మంచి సంబంధం. పెళ్ళయ్యాక ఆయన నన్ను ఎంతో బాగా చూసుకునేవారు. ఏ విషయంలోను నాకు లోటు రానిచ్చేవారు కాదు. మాకు పెళ్ళయిన రెండేళ్ళకి బాబు పుట్టాడు. అంతా ఆనందంగా సాగిపోతున్న సమయంలో మా వారు తీవ్ర అస్వస్థతతో చనిపోయారు. అప్పటికి మా పెళ్ళయి పదేళ్ళయింది. నా జీవితంలో అది మరో పెద్ద దెబ్బ అయింది.

అప్పటికి మా అబ్బాయికి ఎనిమిదేళ్ళు. అప్పుడే నా జీవితంలో ఒక భయంకరమైన సంఘటన జరిగింది. అప్పటికి మావారు చనిపోయి సంవత్సరం అయింది. ఆయనకి ఒక స్నేహితుడు ఉండేవాడు. తరచూ మావారి కోసం ఇంటికి వస్తూవుండేవాడు. ఎప్పుడూ ఎంతో మంచిగా, మర్యాదగా ఉండే ఆ వ్యక్తి మావారు చనిపోయాక ఒకరోజు మా ఇంటికి వచ్చి, నాతో చాలా అసభ్యంగా ప్రవర్తించాడు. నాకేం చేయాలో అర్థం కాలేదు. చాలా భయం వేసింది. అది గమనించిన అతడు ఇంకా రెచ్చిపోయి తన కోర్కె తీర్చమని బలవంతం చేశాడు. ఆ క్షణంలో అతన్ని ప్రతిఘటించటానికి నా అంగవైకల్యం నన్ను నిస్సహాయురాల్ని చేసింది. తర్వాత గుండె బ్రద్దలయ్యేలా రోధించాను. కనీసం ఒకరితో చెప్పుకునేందుకు కూడా లేదు. ఆ క్షణం నేననుభవించిన మానసిక క్షోభ అంతా ఇంతా కాదు. చచ్చిపోవాలనిపించింది. కానీ ఒకే ఒక్క ఆలోచన నన్ను ఆపింది. అది నా కొడుకు భవిష్యత్తు. చిన్నతనంలోతల్లి తండ్రుల్ని కోల్పోయిన పిల్లలు మానసికంగా ఎంత బాధ అనుభవిస్తారో నాకు, మా అక్కకి అనుభవమైంది. అలాంటి బాధ నా బిడ్డకి కలగకూడదనుకున్నాను. ఆనాడు మమ్మల్ని కళ్ళల్లో పెట్టుకుని చూసేందుకు మా మేనమామ ఉన్నాడు. కానీ నా కొడుక్కి ఆ ఆసరా కూడా లేదు. పైగా చాలా ఆస్థి కూడా వుంది. దానికి ఆశపడి వాడిని ఏమైనా చేస్తారేమో అన్న భయం కూడా కలిగింది. ఆ ఒక్క ఆలోచన నన్ను చావునుంచి రక్షించింది.

అంత ఘోరమైన సంఘటన జరిగాక ఇంక ఆ ఊళ్ళో ఉండలేకపోయాను. ఇల్లు, వాకిలి, అమ్మేసి పొలాలు, చూడమని మా మరుదులకు అప్పచెప్పి, పిల్లవాడిని మంచి స్కూల్లో చదివించాలనే వంకతో ఆ ఊరు వదిలేసి వెళ్ళాను. ఊరునైతే వదలగలిగాను గానీ గుండెకైన గాయాన్ని మాత్రం మాన్పుకోలేకపోయాను. ఎవరికీ చెప్పుకోలేక, మరిచిపోలేక నేననుభవించిన నరకం అంతా ఇంతా కాదు. తర్వాత నేను ఆ ఊరు వెళ్ళిన సందర్భాలు చాలా తక్కువే.

మొదట్నుంచి భగవంతుడు ఆర్థికంగా నాకు ఏలోటూ చేయలేదు. అందుకే నా కొడుకుని నేను కోరుకున్నట్టే పెద్ద పెద్ద చదువులు చదివించి, ఉన్నత స్థితిలో నిలబెట్ట గలిగాను. ఆ తర్వాత వాడికి పెళ్ళి చేయటం, కోడలు రావటం, మనుమడు, మనుమరాలు పుట్టటం అంతా చాలా సజావుగానే సాగిపోయాయి. వాళ్ళందరి మధ్య నేనెంతో సంతోషంగానే ఉన్నాను.

భగవంతుడు నా జీవితంలో ఎప్పటికప్పుడు గీతలు గీస్తూనే ఉన్నాడు. ఆడుతూ పాడుతూ తిరగవలసిన చిన్నతనంలో 'వైకల్యం' అనే గీత గీసాడు. పదేళ్ళ వయసులో తల్లి తండ్రుల్ని దూరం చేసి నా వైకల్యం పక్కన ' అనాథ' అనే పెద్ద గీత గీశాడు. పెళ్ళయి, గుండెల్లో పెట్టుకునే భర్త దొరికాడని ఆనందించే సమయంలో ఆయన్ని తీసుకువెళ్ళిపోయి 'ఒంటరితనం' అనే ఇంకా పెద్ద గీత గీశాడు. అంతటితో ఆగితే బావుండేది. ఒంటరినైనా ఎంతో మనోనిబ్బరంతో ముందుకెళ్ళాలి అనుకునే సమయంలో 'బలాత్కారం' అనే అతి పెద్ద గీత గీశాడు. ఇంకా ఆయన గీయటానికి అంతకన్నా పెద్ద గీతలేమున్నాయిలే! అనుకున్నాను.

కానీ ఇప్పుడు నా కొడుకు గీసిన గీత ముందు ఆ భగవంతుడు గీసిన గీతలన్నీ చాలా చిన్నవయిపోయాయి.

ఒకరోజు నా కొడుకు స్నేహితుడు పెళ్ళికని మా ఊరు వెళ్ళాడు. పెళ్ళి నుంచి తిరిగి వచ్చాక వాడి ప్రవర్తన చాలా చిత్రంగా ఉంది. ఎప్పుడూ అమ్మా! అమ్మా! అంటూ నా చుట్టూ తిరిగేవాడు, నన్ను పురుగుని చూసినట్టు చూడటం, చీదరించుకున్నట్టు మాట్లాడటం చూసి నా గుండె బద్దలవుతున్నట్టు అనిపించింది. నిన్నటిదాకా అందరూ ఉన్న నేను ఆరోజు నుంచి ఎవరూ లేని దానిలా ఫీల్ అయ్యాను. నా జీవితంలో అంత భయంకరమైన ఒంటిరితనాన్ని ఎప్పుడూ అనుభవించలేదు. వాడెందుకిలా ప్రవర్తిస్తున్నాడా? అని ఎన్నో రకాలుగా ఆలోచించాను. కానీ నాకు సమాధానం దొరకలేదు. పోనీ వాడినే అడుగుదామనుకుంటే వాడు నాకు ఆ అవకాశమే ఇవ్వలేదు.

ఒకరోజు వాడు వాళ్ళావిడతో చెప్తున్న మాటలు నా చెవిన పడ్డాయి.

వాడు వాళ్ళావిడని కావలించుకుని భోరుమంటున్నాడు. విషయమేంటో చెప్పమని హరిప్రియ బ్రతిమిలాడుతోంది. రెండు నిమిషాల తర్వాత వాడు నోరు విప్పాడు.

" మొన్న పెళ్ళికి మా ఊరు వెళ్ళాను కదా! అక్కడ నా చిన్ననాటి స్నేహితుడు కలిశాడు. అతడు మా అమ్మ గురించి ఒక భయంకరమైన నిజాన్ని చెప్పాడు. అది వినగానే నా తల తిరిగిపోయింది.

" ఏం చెప్పాడు"? ఆసారి ఆమె గొంతులో ఆతృత.

" మా అమ్మకి, వాళ్ళ నాన్న రఘుపతికి నాన్న చనిపోయాక అక్రమ సంబంధం ఉండేదట".

కోడలు షాకయినట్టుంది. " అది అతనికెలా తెలుసు" అడిగింది.

" వాళ్ళ నాన్న ఒకరోజు బాగా తాగిన మైకంలో వాడితో చెప్పాడట".

" ఛా! ఊరుకోండి, వాళ్ళ నాన్న ఏదో తాగి వాగితే అది వాడు మీ దగ్గర చెప్పటమే పెద్ద తప్పు. వాడలా అన్నప్పుడు వాడి రెండు చెంపలు పగలగొట్టి పాతరేయకుండా వాడి మాటలు నమ్మి దేవతలాంటి తల్లిని అనుమానించటం అంతకన్నా పెద్ద పాపం. మన పెళ్ళయిన ఈ పదేళ్ళలోనే ఆవిడ ఎంత ఉత్తమురాలో నాకే ఇంత బాగా అర్థం అయింది, అలాంటిది మిమ్మల్ని కని, గుండెలమీద పెట్టుకుని పెంచిన తల్లి గురించి మీకర్థం కాలేదంటే మీరెంత వెధవో నాకర్థమవుతోంది". ఈసడించుకుంది వాడి భార్య.

" లేదు హరీ! వాడు చెప్పినప్పుడు నాకూ నమ్మబుద్ధి కాలేదు. అందుకే వాళ్ళింటికి వెళ్ళి వాళ్ళ నాన్ననే నిలేసి అడిగాను. ఆయన నాతోకూడా అదే చెప్పాడు". ఆసారి వాడి గొంతులో కొంచెం ఉక్రోషం వినిపించింది.

"ఇప్పుడు వాళ్ళ నాన్న ఎక్కడ ఉంటున్నాడు?" అడిగింది హరిప్రియ.

"కొడుకుతో పాటు వాళ్ళింట్లోనే ఉంటున్నాడు". ఇదేం అర్థం లేని ప్రశ్న అన్నట్టు ఉంది అతని గొంతు.

" ఛీ! నీకన్నా నీ స్నేహితుడే వెయ్యిరెట్లు నయం. తండ్రి తన అక్రమ సంబంధం గురించి చెప్పగానే అది నిజమో కాదో నిర్ధారించుకోవటానికి నీ దగ్గరికి పరుగెత్తుకు రాలేదు. ఆయన్ని ఇంట్లోనే ఉంచుకుని మహారాజులా చూసుకుంటున్నాడు. బహుశా అతనికి తండ్రి మీద నమ్మకం లేకపోయినా కృతజ్ఞతన్నా ఉండి ఉంటుంది. కానీ మీరు? అసలు వాళ్ళ నాన్న చెప్పిన మాటల్లో నిజం ఉందో లేదో అన్న ఆలోచన కూడా లేకుండా, తల్లీ తండ్రీ అన్నీ తానే అయిపెంచిన కన్నతల్లి పట్ల ఎంత అనుచితంగా ప్రవర్తిస్తున్నారు. ఛీ ఛీ మిమ్మల్ని చూస్తుంటే అసహ్యమేస్తోంది..........."

ఆ తర్వాత ఆమె మాటలు నాకు వినిపించటం లేదు నెత్తిన పిడుగుపడ్డట్లు అయింది. నా కొడుకు ఊరు నుంచి వచ్చాక నా దగ్గర కూర్చుని ' అసలు ఏమైందమ్మా' అని ఒక్కమాట అడిగిఉంటే ఇన్నేళ్ళూ నా గుండెల్లో దాచుకున్న బాధనంతా వాడిముందు దించేసుకుని ఎంతో రిలీఫ్ ఫీలయి ఉండేదాన్ని.

ఆ రాత్రంతా బాగా ఆలోచించాను. ఈసారి నిజంగానే చావాలనిపించింది. ఒకప్పుడు నా కొడుకు అనాథ అవుతాడే అన్న భయంతో బద్దలవుతున్న అగ్ని పర్వతాన్ని గుండెల్లో దాచుకుని వాడి కోసం బ్రతికాను. కానీ ఈరోజు ఆ కొడుకే గుండెల మీద కొట్టాడు. కానీ వెంటనే మళ్ళీ ఆలోచన కలిగింది. " అసలు నేనెందుకు చావాలి! నా పవిత్రతని చాటుకోవటం కోసమా? లేకపోతే వాడి మూర్ఖత్వాన్ని భరించలేకా?' కానీ వాడిది మూర్ఖత్వం కాదు స్వార్థం అని నా మనసు చెపుతోంది. ఇప్పుడు వాడికి నా అవసరం తీరిపోయింది కాబట్టి నా గురించి ఆలోచించే పరిస్థితిలో లేడు. ఇంక వాడికి ఏం చెప్పినా వృథానే.

అందుకే బాగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాను. తెల్లారే సరికల్లా ఇల్లు వదిలేసి వచ్చేశాను. కానీ సినిమాల్లో లాగా, టి.వి సీరియల్స్‌లో లాగా పిచ్చి పిచ్చి త్యాగాలకి పోకుండా నా డబ్బు, నా నగలు మొత్తం తీసుకు వచ్చేశాను. ఆ తర్వాత ఈ ఇల్లు కొనుక్కుని ఇందులోనే ఉంటున్నాను. నేనెంతో పవిత్రురాల్ని కాబట్టే భగవంతుడు చివరి రోజుల్లో నిన్ను నాకు తోడుగా పంపాడు.

అమ్మా సురేఖా! ఈ లెటర్‌తో కవర్‌లో మరో కాయితం కూడా ఉంది. అది ఈ స్థలం, ఇల్లు, నీపేర రాసిన కాగితాలు అవి. ట్రంకు పెట్టెలో ఉన్న పాతగుడ్డల మూటలో నా నగలు, డబ్బు ఉన్నాయి. అవి కూడా ఈరోజు నుంచీ నీవే. నేనెవరో కూడా తెలీకుండా ఎంతో ప్రేమగా నాకు సర్వీసు చేశావు. ఇవన్నీ నీకు ఇవ్వటమే న్యాయమనిపించింది నాకు. భగవంతుడు నిన్నెప్పుడూ చల్లగా చూడాలని కోరుకుంటూ శెలవు తీసుకుంటున్నాను.

ప్రేమతో

**మీ మామ్మగారు.**

ఉత్తరంలో కూడా ఎక్కడా ఆమె పేరు రాయలేదు. ఈ లెటర్ చదువుతున్నంతసేపూ సురేఖ కళ్ళు వర్షిస్తూనే ఉన్నాయి.

★ ★ ★ ★ ★

**రెండేళ్ళు గడిచిపోయాయి.**

సురేఖ యథాప్రకారం టీ కప్పుతో వచ్చి కారిడార్‌లో కూర్చుని ఎదురింటి వైపు చూసింది. ఇప్పుడక్కడ షెడ్డు లేదు. ఒక అందమైన చిన్న డాబా ఉంది. దాని చుట్టూ రంగు రంగుల పూల మొక్కలతో చక్కని గార్డెన్ ఉంది. గార్డెన్‌లో పడుతున్న నీరెండలో కూర్చుని కొంతమంది వృద్ధులు ఏవో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. వాళ్ళకిప్పుడు ఒంటరి వాళ్ళమనే భావమే లేదు. వృద్ధాప్యం అంటే భయమూ లేదు. అందుకే ఎంతో హాయిగా, ఆనందంగా ఉన్నారు.

వాళ్ళని అలా చూస్తున్న సురేఖ ' మామ్మగారు ఎక్కడికీ వెళ్ళలేదు. ఇక్కడే ఉన్నారు". అనుకుంది మనసులో ఆనందంగా.

★

# ఎండమావి వంటి నగదు బదలాయింపులు

- జయతిఘోష్...

అంతర్జాతీయ అభివృద్ధి కార్యక్రమాల్లోనూ, పేదరికం తగ్గింపు వ్యూహంలోను ఇటీవల కాలంలో నగదు బదలాయింపులు వేలం వెర్రిగా మారాయి. ప్రస్తుతం భారతదేశంలోని విధాన నిర్ణేతలు దీన్ని అనుకరించడంలో తలమునకలుగా ఉన్నారు. ప్రభుత్వ ఆర్థిక సర్వే 2010-11లో దీని గురించిన మీమాంస ఉన్నది. కాగా వస్తువులపై ఇచ్చే కొన్ని సబ్సిడీల స్థానంలో నగదు బదలాయింపులను చేర్చాలంటూ తన బడ్జెట్ ప్రసంగంలో ఆర్థిక మంత్రి స్పష్టంగా చెప్పారు. అసలు ఈ వ్యూహం ఏమిటి? ఇటీవల అంతర్జాతీయ అనుభవాన్ని బట్టి నగదు బదలాయింపు షరతులతో కూడినది (నిర్ధిష్టమైన డిమాండ్లను నెరవేర్చుకునేందుకై కుటుంబాలకు ఇచ్చేది) లేదా షరతులు లేనిది. ఎంపిక చేసిన వారికి ( నిర్ధిష్టమైన ప్రమాణాలను కలిగిన కుటుంబాలకు లేదా వ్యక్తులకు) లేదా సార్వత్రికంగా వర్తించేది. వస్తువులను, సేవలను అందచేయటానికి బదులు ప్రజలకు ప్రభుత్వం నగదును బదలాయింపు చేస్తుంది.




నగదు బదలాయింపన్న భావన చాలా సులభంగా కన్పిస్తుంది. పసిపిల్లలకు సైతం అర్థం కాగలదన్నట్లుగా ఉంటుంది. అసలు ప్రజలు పేదలుగా ఎందుకు ఉంటారు? ఎందుకంటే వారి దగ్గర డబ్బులేదు. కనుక వారికి డబ్బు ఇద్దాము, అలా చేస్తే, వారు ఇంకెంతమాత్రం పేదలుగా ఉండరు! నగదు బదలాయింపు ప్రతిపాదకులు ఇదేదో విప్లవాత్మకమైన సరికొత్త భావనగా భావిస్తున్నారు. నిజానికి దీనికి సుదీర్ఘమైన చరిత్రే వున్నది. పేదలకు చెల్లింపులు చేసేందుకు వీలుగా ధనికుల నుంచి వసూళ్ళు చేయాలని కౌటిల్యుని అర్థశాస్త్రం చెపుతున్నది. ఆపత్కాలంలో ధన సహాయాన్ని చేయటమే కాక, తనను తాను పోషించుకోలేని అభాగ్యతులకు చెల్లింపులు చేయాలని కౌటిల్యుడు చెప్తాడు. మధ్య యుగాల్లో ముస్లిం పాలకులు జకత్ పద్ధతిని ప్రవేశపెట్టారు. పేదలకు, వృద్ధులకు, అనాధలకూ, వితంతువులకూ, వికలాంగులకూ రాజ్యకోశం నుంచి ద్రవ్య సహాయం లభించేది. ఇంకా ఇటువంటివే చారిత్రకాధారాలు కావలసినన్ని ఉన్నాయి.

నగదు బదలాయింపు పథకాల ఉద్దేశమేమంటే, పేదలకు డబ్బును ఇచ్చి దానితో ఏమైనా చేసుకునే స్వేచ్ఛను కల్పించటం, ఇకపోతే ఈ నగదు బదలాయింపు ఎవరికి చెందుతుంది? ఎంత మొత్తాన్ని పొందుతారు? ఒకవేళ అందరికీ ఈ బదలాయింపు వర్తిస్తుందంటే, అప్పుడు పరిసరాల్లో డబ్బు పుష్కలంగా ఉంటుంది. అలాకాక, ఎంపిక చేసినవారికే ఇచ్చేటట్లయితే ఎప్పుడూ ఉండే సమస్యలు తలయెత్తుతాయి. అంటే, అర్హులైన వారిని అన్యాయంగా తొలగించటం, అనర్హులకు ఇవ్వటం, పెద్దఎత్తున జరిగే పాలనావ్యయం వగైరాలు ఉంటాయి. ఈ బదలాయింపులను సమర్థంగా నిర్వహించినట్లయితే, కచ్చితమైన హామీ ఉన్నట్లయితే వీటిని బదలాయించటం సాపేక్షకంగా తేలికగా ఉంటుంది. అంతేకాక, కుటుంబ ఆదాయాలను ప్రభావితం చేస్తాయి. దీనితో, ప్రజావ్యయం పెరుగుతుంది. ఇది ఏరకమైన వ్యయమనేది ఇక్కడ ఎదురయ్యే ప్రశ్న.

మనకు బాగా తెలిసిన పలు విజయగాథలు ఎంపిక చేసిన వారికి వర్తించేవి, షరతులతో కూడినవి. బ్రెజిల్‌లో బోల్సా ఫామిలియా పథకం అమలులో

ఉన్నది. ఇక్కడి ప్రభుత్వం ఇచ్చే నగదు నెల ఆదాయం కన్నా తక్కువగా ఉంటుంది. ప్రభుత్వ ఆరోగ్య కేంద్రాలలో వీరు హాజరవుతూ ఉండాలి. అలానే పాఠశాల హాజరు 85 శాతంగా ఉండాలి. మెక్సికోలో ఒపోర్చునిడాడిస్ అనే నగదు బదలాయింపు పథకం అమలులో ఉన్నది. ఇది చాలా షరతులతో కూడుకున్న క్లిష్టమైన పథకం. వయసు, లింగము, కుటుంబంలోని ప్రతి సభ్యుని విద్యాస్థాయి, విద్యుత్, కొళాయి సౌకర్యాలు, కుటుంబ ఆస్తులు వగైరాలు చూస్తారు. కుటుంబ సభ్యులు ముఖ్యంగా తల్లులు సమావేశాలకు హాజరవుతూ, 'స్వచ్ఛంద' సామాజిక శ్రమలో పాల్గొన్నాలి.

పురోభివృద్ధి స్వభావం కలిగిన పునఃపంపిణీ బదలాయింపులు వాంఛనీయమనటంలో సందేహం లేదు. నిజానికి పునఃపంపిణీ అనేది ఏ ఆర్థిక వ్యవస్థలోనూ విస్మృతమైనదీ, సంక్లిష్టమైనదీ అని చెప్పవచ్చు. అభాగ్యతులకు కనీస ఆదాయాన్ని ఒనగూర్చే పథకాలు, వయోవృద్ధులకు పింఛన్లు, బాలబాలికలకు ప్రయోజనాన్ని చేకూర్చే కార్యక్రమాలు, నిరుద్యోగ భృతి ఇతర సామాజిక భద్రతా పథకాలు వంటివి ఏ నాగరిక సమాజంలోనైనా కోరుకోదగినవే. పేద దేశాలు కూడా అనుసరించదగినవే. స్వల్పకాలంలో ఇవి సానుకూల ఫలితాలను ఇస్తాయి. దీర్ఘకాలంలో ఆరోగ్యకరమైన, విద్యాధిక, సురక్షిత జనాభా తయారవుతుంది.

కనుక ఇక్కడ ఎదురయ్యే ప్రశ్న ఏమంటే మొత్తంమీద నగదు బదలాయింపు పథకాన్ని వ్యతిరేకించటమా లేదా అన్నది కాదు. మొత్తం అభివృద్ధి వ్యూహంలో, పేదరికం తగ్గింపులో వాటికున్న నిర్దిష్ట ప్రాధాన్యత ఏమిటన్నదే. నగదు బదలాయింపులనేవి నిత్యావసర సరుకుల, సేవల స్థానాన్ని భర్తీ చేయలేవు. కాకుంటే వాటికి సహాయకారిగా ఉంటాయి. కాని ఈ బదలాయింపులనేవి ప్రభుత్వం అందించవలసిన సేవలను తగ్గిస్తాయని, డబ్బును బదలాయించటం ప్రభుత్వానికి సులభమని చెప్పుకొస్తున్నారు.

పేదలకు ప్రభుత్వం నగదు బదలాయింపు చేసినట్లయితే, ప్రభుత్వం ఇచ్చేవాటి కోసం చూడకుండా ప్రైవేటు మార్కెట్ల ఉత్పత్తుల్లో తాము కోరుకున్న వస్తువులు, సేవలు వారికి అందుబాటులోకి వస్తాయన్న వాదన పలుదేశాలలో వినపడుతున్నది. ఈ తరహా వాదనలో ఒక అంశం మరుగున పడుతున్నది. ఉదాహరణకు బ్రెజిల్‌లో అమలవుతున్న బోల్సా ఫామిలియా పథకం పాఠశాల కనీస హాజరుపై ఆధారపడి ఉన్నది. దీనికి కారణం పేద కుటుంబాల పిల్లలు హాజరు కావటానికి వీలైన నాణ్యత కలిగిన ప్రభుత్వ పాఠశాలలు ఇక్కడ చాలినన్ని సంఖ్యలో ఉండటమే. అంటే నాణ్యమైన పాఠశాలలపైనా, ఉపాధ్యాయ విద్యపైనా ప్రభుత్వ పెట్టుబడులు కొనసాగుతున్నా యన్నమాట. ప్రజలకు అందచేసే కొద్దిపాటి మొత్తాలు స్థానికంగా ఉండే సాధారణ వైద్యులను సంప్రతించటానికి పనికి వస్తాయేగాని అన్ని సౌకర్యాలున్న ప్రైవేటు ఆసుపత్రులకు వెళ్ళేందుకు ఉపయోగపడవు. నిత్యావసర సరుకుల ధరలు పెరుగుతున్న సమయంలో నగదు బదలాయింపువల్ల పెద్దగా ఫలితం ఉండదు.

పలు వర్ధమాన దేశాలలో కేవలం నాణ్యమైన విద్యను అందించే పాఠశాలలనేకాక ఇంకా అనేకమైన వాటికి ప్రాధాన్యత ఇస్తున్నారు. రహదారులు, ఆరోగ్య కేంద్రాలు, విద్యుత్ లేదా కొళాయి నీరు, పాఠశాలలు ఒక విమానాశ్రయం పలు రైల్వే స్టేషన్లు వగైరాలు కోరుతున్నారు. ఆహారంతోసహా వివిధ రకాల వాటిని పంపిణీ చేయటానికి బదులు నగదు బదలాయింపు పథకాన్ని తీసుకురావాలన్నదే యుపిఏ ప్రభుత్వ అజెండా అన్నది స్పష్టమవుతున్నది. కిరోసిన్, ఎరువులకు సబ్సిడీలను ఎత్తివేసి వాటి స్థానంలో ఎంపిక చేసిన లబ్దిదారులకు నేరుగా నగదు బదలాయించే పద్ధతిని ప్రవేశపెట్టాలని ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ ప్రతిపాదించాడు. ఆయన తన ప్రసంగంలో ఈవిధంగా చెప్పాడు. " మరీ ముఖ్యంగా ఇంధనం, ఆహార ధాన్యాలపై ప్రభుత్వం సబ్సిడీలను అందచేస్తున్నది. ముఖ్యమైన ఈ అవసరాలు సాధారణ ప్రజలకు అందుబాటు ధరలలో లభించేలా చేయటమే ప్రభుత్వ ఉద్దేశం. అయితే ఇంధనంపై ఇచ్చే సబ్సిడీలో అధిక భాగం ఉద్దేశిత లబ్దిదారులకు అందటం లేదు. సబ్సిడీపై కిరోసిన్ లో అత్యధిక భాగం దారిమళ్ళుతున్నది..... కిరోసిన్, ఎరువుల సబ్సిడీలు సమర్ధవంతంగా వినియోగపడేందుకుగాను దారిద్ర్య రేఖకు దిగువున నివసిస్తున్న వారికి దశల వారీగా నగదు బదలాయింపు పథకాన్ని వర్తింప చేస్తాము" అని ఆయన చెప్పారు.

ఈ వైఖరిలో తక్షణమే ఎదురయ్యే రెండు సమస్యలు ఉన్నాయి. ఒకటి కొత్తగా నియంత్రణలు ఎత్తివేయనున్న నిత్యావసర వస్తువుల మార్కెట్లలో పెరిగే ధరలకు అనుగుణంగా ఈ నగదు పంపిణీ పంపకం ఉంటుందా? రెండవదేమంటే, కిరోసిన్, ఎరువులను సబ్సిడీపై పొందే లబ్దిదారులకే నగదు అందుతుందని ప్రభుత్వం ఎలా చెప్పగలదు? ఈ రెండవ సమస్య భారతదేశంలో అందరికీ తెలిసిందే. ప్రజాపంపిణీ వ్యవస్థ విధానంలో దారి మళ్ళడం సాధారణంగా జరుగుతున్నది. వస్తువులను దారి మళ్ళించి వాటిని నిల్వచేయటం లేదా అమ్మటం కన్నా నగదును దారి మళ్ళించటం ఎంత సులభం?

సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుంటే నగదు పంపిణీలో తలయెత్తే సమస్యలను తొలగించవచ్చునని ప్రభుత్వం భావిస్తున్నది. అయితే పేదలెవరు? నగదు అందుకోవలసిన రైతులెవరు? అన్న విషయాలను సాంకేతిక విజ్ఞానంతోకాక సామాజిక రాజకీయ అంశాలతో నిర్ణయించవలసి ఉంటుంది. మార్కెట్లపై నియంత్రణలను ఎత్తివేస్తే అవి అందుబాటులో ఉంటాయన్న నమ్మకం లేదు. నిత్యావసర సరుకుల పంపిణీ కన్నా నగదు బదలాయింపు పథకం ఏమాత్రం మెరుగయినది కాదు.



# పిల్లలకూ హక్కులున్నాయ్

ప్రపంచ జనాభాలో మూడో వంతు పిల్లలే. వారికీ కొన్ని హక్కులున్నాయి. అయితే వారిని మానవులుగా కానీ, వారికి హక్కులున్నట్లుగా కాని ఎక్కడా చూడరు. ఎక్కడా గుర్తింపునివ్వరు. పిల్లల హక్కుల ఉల్లంఘన జరిగినట్లుగా మరి ఏ ఇతర వర్గం హక్కులూ ఉల్లంఘనకు గురి కావడం లేదు. అందువల్ల పిల్లల హక్కుల్ని గుర్తించాల్సిన తరుణం ఆసన్నమైంది. ఎందుకంటే -ఏ సమాజం అభివృద్ధీ, సంక్షేమమైనా పిల్లల అభివృద్ధి సంక్షేమం పైనే ఆధారపడి వుంటాయి అన్నది విస్మరించరాని అంశం. వారి అవసరాలేమిటో గుర్తించాలి. వారి అభిప్రాయాల్ని గౌరవించాలి. వారి ఉనికిని ఎప్పుడూ మరిచిపోకూడదు. కుటుంబ స్థాయిలో ముందు వారి అవసరాలను తీర్చి,తర్వాత పెద్దవారి గురించి ఎలా పట్టించుకుంటావో, దేశస్థాయిలో ఆరోగ్యం, విద్య, సంక్షేమం.... అలా అన్నిటిలో వారికి ప్రాముఖ్యం ఇవ్వాలి.

**ప్రతిపాదనలు, హక్కులు**

పద్దెనిమిది సంవత్సరాల వయస్సు కన్నా తక్కువ వయస్సున్న వాళ్ళందరూ పిల్లలే. వారికి ఐక్యరాజ్యసమితి కన్వెన్షన్ రూపొందించిన అన్ని హక్కులూ వర్తిస్తాయి. అన్ని విధాలా వివక్షల నుంచి వారికి రక్షణ కల్పించాలి.

-పుట్టిన ప్రతి శిశువుకీ జీవించే హక్కు వుంది. అందువల్ల ఆ శిశువు మనుగడ, అభివృద్ధి రాజ్యం ప్రధాన బాధ్యత.

-శిశు, పిల్లల మరణాల రేటును తగ్గించడానికి రాజ్యం తగిన చర్యలు చేపట్టాలి.

-అత్యున్నత ఆరోగ్య ప్రమాణాలు, ఆరోగ్య వైద్య సేవలు పొందటానికి పిల్లలకు హక్కుంది.

-. పిల్లల శారీరక, మానసిక, నైతిక, సామాజిక, ఆధ్యాత్మిక, అభివృద్ధికి తగిన పోషకాహారం, దుస్తులు, గృహ వసతి కల్పించాలి.

-రోగాలు రాకుండా పోషకాహార లేమి కలగకుండా పిల్లలకు తగిన పోషకాహారం, పరిశుభ్రమైన నీరు అందుబాటులో వుంచాలి.

-పిల్లలకు వారి తల్లి తండ్రులకు పిల్లల ఆరోగ్య సూత్రాలను, పరిశుభ్రతను, పోషకాహారం, పరిసరాల గురించి తెలియజేయాలి.

-ఆర్థిక దోపిడీ నుంచి పిల్లల ఆరోగ్యానికి, చదువుకీ, అభివృద్ధికి హాని కలిగించే వాటి నుంచి పిల్లలను రక్షించాలి. ఈ పరిరక్షణ హక్కు వారికుంది.

-పిల్లలను లైంగిక దోపిడీ నుంచి రక్షించాలి. వారిని నిరాదరణకు, అవినీతికి బలి చేయకూడదు. వాటి నుంచి రక్షించాలి.

- పిల్లలకు చదువుకునే హక్కుంది. ప్రాథమిక విద్య ఉచితంగా తప్పనిసరిగా అందివ్వాలి.

-చదువు పిల్లల వ్యక్తిత్వాన్ని వారిలోని ప్రతిభనీ, మానసిక, శారీరక సామర్థ్యాన్నీ పెంచేదిగా వుండాలి.



-విద్య అందరికీ సమానంగా అందుబాటులో వుండాలి. సెకండరీ విద్యను పొందేందుకు అందరికీ అవకాశముండాలి.

- సెకండరీ స్థాయిలో బాలబాలికలన్న తేడా లేకుండా అందరికీ ఒకేషనల్ విద్య అందించాలి.

-పిల్లలందరూ క్రమం తప్పక పాఠశాలలకు హాజరయ్యేలా మధ్యలో మానివేసేవారి శాతం బాగా తగ్గేలా తగిన చర్యలు తీసుకోవాలి.

- అవగాహన, సహనంతో పిల్లలు బాల బాలికలన్న తేడా లేక కలిసి మెలసి స్వేచ్ఛగా అన్ని అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొనే సహజసిద్ధమైన వాతావరణం వుండాలి.

-పిల్లలకు ఆడుకోవడానికి, విశ్రాంతికి, సాంస్కృతిక కళారంగాల్లో పాల్గొనేందుకు సంపూర్ణ హక్కులున్నాయి.

-వారికి సంబంధించిన వ్యవహారాల్లో అభిప్రాయాలు వ్యక్తం చేసేందుకు పిల్లలకు హక్కుంది.

-పిల్లల్ని అపహరించేందుకు జరిగే అన్ని ప్రయత్నాలను రాజ్యం నిరోధించాలి.

-అన్ని రకాల మత్తు పదార్థాల అమ్మకం, కొనుగోలు, వాడకం నుండి వారిని రక్షించాలి.

-పిల్లలను హింసించడం, వారిని అకారణంగా దండించడం, శిక్షించడం, చట్టానికి వ్యతిరేకంగా అరెస్టు చేయడం, వారి స్వేచ్ఛకు భంగం కలిగించడం వంటివి చేయకూడదు. పిల్లలకు మరణదండన, జీవితఖైదు విధించకూడదు.

-పిల్లలకు తమ అభిప్రాయాలను వ్యక్తం చేసే హక్కుంది. ఏవిధమైన సమాచారాన్నైనా వారు పొందవచ్చు.

-అంతర్జాతీయ ప్రచార మాధ్యమాల నుంచి సమాచారం పొందే హక్కు పిల్లలకుంది.

ఈ హక్కులన్నిటినీ అమలు చేయడానికి తగిన చట్టపరమైన, పరిపాలనా సంబంధమైన సామాజిక విద్యా సంబంధమైన చర్యలు తీసుకోవాలి.

**అంగీకారం**

ఐక్యరాజ్యసమితి పిల్లల సంక్షేమం కోసం అనేక నిబంధనలను, సూచనలను, తీసుకోవలసిన చర్యలను ప్రతిపాదించింది. ఇవన్నీ చూస్తుంటే మనకు ఒకటి విదితమవుతోంది. అదేమిటంటే ఐక్యరాజ్యసమితి పిల్లలకున్న హక్కుల్ని గుర్తించడమే కాక వాటి పరిరక్షణ కోసం తాపత్రయపడుతోందని. ఐక్యరాజ్యసమితి ప్రతిపాదనలను భారతదేశం అంగీకరించి, 159 దేశాలలో ఒకటిగా ఆమోదిస్తూ సంతకం చేసింది. 1992 డిసెంబరు 11న భారతదేశం సంతకం చేసింది. అంటే ఆరోగ్యం, పోషకాహారం, తాగునీరు, పరిశుభ్రత, చదువు తదితరాలన్నీ పిల్లలకు కల్పిస్తానని అంతర్జాతీయంగా అన్ని దేశాల ముందు అంగీకరించింది.ఇరవై ఏళ్ళు గడుస్తున్నా ఈ కర్తవ్యం అమలు పూర్తిగా నెరవేరలేదు. జాతీయస్థాయిలో ఏర్పాటై "జాతీయ పిల్లల కమిషన్"8 ఆ మార్గాన పయనించాలని ఆశిద్దాం.

- సేకరణ మానవి డెస్క్

# వెట్టి చాకిరీలో పచ్చాకు కార్మికులు

-ఎస్.వి. బ్రహ్మం

**తెల్లవారు ఝామున లేస్తే రాత్రి పొద్దుపోయాకే నిద్ర.**

**కాంట్రాక్టు పద్ధతి కూలితో శ్రమ దోపిడీ రోజుకు 18 గంటల పనికి దక్కే ఫలితం రెండు వందలే.**

**జర్వమొచ్చినా పనిలోకి వెళ్ళక తప్పదంటున్న మహిళలు.**

**పిల్లలు చదువులు... ఆరోగ్యాలు ప్రశ్నార్థకమే.**

పచ్చాకు కూలోళ్ళు.... ఈ సీజనులో గ్రామాల్లో గుంపులు గుంపులుగా కనిపిస్తుంటారు. నల్లని పొగాకు మడ్డితో వున్నదున్నట్లు వేసుకుని మొఖాలన్నీ పీక్కుపోయి వుంటారు. నిద్రాహారాలు సమయానికి అందవు. తెల్లవారు ఝామున నిద్రలేస్తే బ్యారన్‌లోని క్యూరింగు ఆకుని దించడం....దానిని పందిళ్ళకు ఎత్తడం... ఆరిన కర్రలను మండెలకు చేర్చడం.. వంటి పనులన్నీ చేసేసరికి పదకొండు గంటల సమయం పడుతుంది. ఈలోపు కొందరు మహిళలు బ్యారన్‌లకు సమీపంలో ఉండే పందిళ్ళలో వంట చేస్తారు. హడావిడిగా అందరూ తిని మళ్ళీ మధ్యాహ్నం ఎండలోనే ఆకు కొట్టడానికి వెళతారు. దానిని ట్రాక్టరుకు ఎత్తుతారు. మళ్ళీ దానిని అల్లి బ్యారన్‌లోకి పెట్టాలి. ఈ పని పూర్తయ్యే సరికి రాత్రి పదో పన్నెండో అవుతుంది. తిండి ఎపుడు తింటారంటే ఒకరి తర్వాత ఒకరు వీలు చూసుకుని తిని వస్తారు. ఇలా రోజుకు 18 గంటలకు పైగా పనిచేస్తే వీరికి దక్కే కూలి రోజుకు రెండు వందలే....! కాంట్రాక్టు పద్ధతిపై పనిచేసే వీరి వేతనాన్ని ముందే నిర్ణయిస్తారు. తిండికి సరిపోనూ మిగిలేదీ ఏమీ లేదని కూలీలు వాపోతున్నారు. మద్దిపాడు మండలంలోని కొత్తపల్లి-గురవారెడ్డిపాలెం గ్రామాల మధ్యలో ఓ బ్యారన్ వద్ద ఓ పచ్చాకు ముఠా కూలీల జీవితాలపై పరిశీలన చేయగా.... అందరూ శ్రమదోపిడీకి గురవుతున్నట్లు తేలింది. కాంట్రాక్టు పద్ధతిపై ఏళ్ళ తరబడి సాగుతోన్న వీరి పనిలోనే కనిపించని శ్రమదోపిడీ వుంది.

డాక్టరు అవసరానికి ఎపుడూ ఉండడు. ప్రతీ చిన్నదానికి పట్నం వచ్చే తీరిక, ఓపిక గ్రామాల వారికి ఉండదు. వెంటనే తాయెత్తు కట్టించాలని, మంత్రం వేయించాలని అణగారిపోతున్నది. వాటిలో పెనుమార్పులు తీసుకువచ్చి స్త్రీ పురోభివృద్ధికి తోడ్పడాలి. కనీస వేతనాలు కూడా అందడంలేదు. ఆరోగ్యాలు అంతరించిపోతున్నాయి. మూడు నెలల పాటు ఇళ్ళూ వాకిళ్ళూ వదిలి పిల్లలతో ఎక్కడ పని దొరికితే అక్కడకు పోతారు. దీంతో పిల్లల చదువులు పోతున్నాయి.

**ఒకే పందిరిలో ఐదు కాపురాలు**

గురవారెడ్డిపాలెం ఊరు శివారులో ఒక బ్యారెన్ చెంతనే తాటాకులతో వేసిన పందిరి. ఇందులో ఐదు కుటుంబాలకు చెందిన 15 మంది కాపురం వుంటున్నారు. వీరంతా మద్దిపాడు మండలం నందిపాడు, ముండ్లమూరు మండలం ఉల్లగల్లు, మద్దిపాడుకు చెందినవారు. పెద్దలు, పిల్లలూ అందరూ అక్కడే నివాసం. రాత్రిపూట పాముల మధ్యనే గడుపుతున్నామని మహిళా కూలీలు భాగ్యం, వెంకాయమ్మ, భూలక్ష్మి తెలిపారు. ఒకటి రెండు మంచాలే వున్నాయి. మిగతా వారందరూ కిందనే పడుకుంటారు. అసలు పడుకోవడానికి సమయం వుంటే కదా అయ్యా అంటూ వారు తమ కష్టాలను చెప్పుకున్నారు. మంచాల్లో పిల్లలను పడుకోపెట్టి తాము ఎప్పుడో పొద్దుపోయాక వస్తామని చెబుతున్నారు. కొందరు చలికి తట్టుకోలేక బ్యారన్ పొయ్యిల వద్దే ఆ కాసేపు ఉంటారని అంటున్నారు.



**తిండికి పడే తిప్పలు చెప్పలేనివి...**

ముందుగానే రైతులు కొంత అడ్వాన్సు ఇచ్చి తీసుకువస్తారు. ఆ డబ్బు ఛార్జీలకు సరిపోతుంది. ఇక్కడ దుకాణాల్లో సరుకులు చెబుతారు. కూరగాయలు ఉండవు. పచ్చళ్ళతోనే తింటారు. ఇంకా చెప్పాలంటే పచ్చి మిరపకాయలు మాడ్చి చేసే కారాలే ఎక్కువ రోజులు తింటారు. మజ్జిగ మరచిపోవాల్సిందే. పిల్లల కోసం కొద్దిగా పాలు కొనే వారుంటారు. ఆ ఊళ్ళో వారందరూ కిలోమీటరు నడిచి వెళ్ళి నీళ్ళు తెచ్చుకోవాలి. దీంతో కూలీలకు సమయం చాలక రెండ్రోజులకోసారి బావికి పోయి నీళ్ళు తెచ్చుకుంటున్నామని తెలిపారు.

**నిద్రలు లేనందున జ్వరాలు బారిన ఎందరో....**

నిద్రలేకుండా మూడు నెలల పని చేయడం వల్ల తలనొప్పి సమస్య ఎక్కువ మందిలో ఉంటుంది. జ్వరాలు వచ్చినా పనులకు పోవాల్సిందే. ఎందుకంటే ఒక ముఠా నాలుగైదు బ్యారన్ల పని ఒప్పుకుంటుంది. ఒక్కరోజు కూడా ఆగే పరిస్థితి ఉండదు. మిషను మీద పనిచేసినట్లే. వంతులవారీగా పనివుంటుంది. అంటే ఈ మూడు నెలలు క్షణం తీరికలేకుండా గడపాల్సిందే. ఏ జబ్బు చేసినా గ్రామంలో దొరికే బిళ్ళలు వేసుకుని పనులకు వెళతామని చెబుతున్నారు. రోజు పది ఎకరాల పొలంలో ప్రతి సాలుకు తిరగడం వల్ల పది కిలోమీటర్లు నడిచినట్లేనని చెబుతున్నారు. కాళ్ళనొప్పులు ఎక్కువ మహిళల్లో ఉన్నాయని చెప్పారు. తల సమస్యలు ఎక్కువగానే ఉన్నాయి. వీటికి వైద్యం కూడా సకాలంలో అందదు.

**పిల్లల చదువులు ప్రశ్నార్థకం....**

పచ్చాకు కూలీల పిల్లలకు చదువులు



లేవు. ఎందుకంటే తల్లితండ్రులతో పాటే వీరూ గ్రామాలు విడిచి వస్తారు. పొల్లాల్లోనే ఉంటారు. కూలీలతోపాటే వీరూ తిరుగుతూ ఉంటారు. దీంతో చదువులు పోయాయి. రాజేష్ అనే పిల్లాడు కనిపించాడు. ఈ పిల్లాడు మూడో తరగతి చదువుతున్నాడు. తల్లిని చూడకుండా ఉండలేక బడి మానేసి వచ్చాడని తోటి కార్మికులు చెప్పాడు, ఇలా అందరి పరిస్థితి ఉంది. ఇలా ఈ ఊళ్ళోనే 30 ముఠాలకు చెందిన 600ల మంది కార్మికులు పనిచేస్తున్నారు. పిల్లల చదువులు బుగ్గయ్యాయి.

**చెరువుగట్లపైనే మహిళల స్నానాలు**

స్నానాలకు ఎటువంటి సౌకర్యాలు లేవు. చీకటి పడ్డాక చెరువు గట్లపైనే మహిళలు, పిల్లలు స్నానాలు చేస్తారు. కొత్తపల్లి చెరువుగట్టుపై చీకటి పడ్డాక పెద్ద సంఖ్యలో మహిళలు ఒంటిపై దుస్తులతోనే స్నానాలు చేస్తుంటారు. అక్కడే దుస్తులు ఉతుక్కుని ఆరేసుకుంటారు. కొందరు తడిదుస్తులతోనే పందిళ్ళలోకి వెళ్ళి పొడిదుస్తులు వేసుకుంటారు. ఇలాంటి జీవితాలు గడుపుతున్నారు.

**కూలి డబ్బులు ఎగ్గొట్టే ప్రబుద్ధులు ఎందరో....**

పనికి తగిన వేతనం రాకపోగా ఇవ్వాల్సిన డబ్బులనూ కూలీలకు ఎగ్గొట్టే ప్రబుద్ధులు కూడా ఉన్నారు. గతంలో కందుకూరు డివిజనులో ఎన్నో సంఘటనలు జరిగాయి. కలక్టరేట్ వద్దకు వచ్చి వారాల తరబడి ఇక్కడే ఉండి ఆందోళనలు చేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. అధికారులు జోక్యం చేసుకున్నాక డబ్బులు ఇచ్చారు. తరచూ జరుగుతుంటాయి. ఇలా కూడా కూలీలు నిలువు దోపిడికి గురవుతుంటారు.

**వీరి జీవితాల్లో వెలుగులు ఎప్పుడో....**

కష్టానికి తగ్గ ఫలితం దక్కినపుడే వీరికి న్యాయం జరుగుతుంది. పని గంటల్లోనూ మార్పులు రావాల్సి ఉంది. అధికారులు ఉన్న చట్టాలను అమలు చేసేవిధంగా చర్యలు లేవు. లక్షలాది మంది పనిచేసే వీరి గురించి పొగాకు బోర్డు కనీసం ఆలోచించకపోవడం ఆందోళనకరం. వెట్టిచాకిరి చేస్తున్నారు. సాధారణంగానే వీరి పనిని పరిగణిస్తుంటారు. ఎప్పుడు ఉండే పనేకదా అనే ఉదాసీనత ఎక్కువ మందిలో ఉంది. వారి దోపిడీపై ఎవరూ దృష్టి పెట్టడం లేదు. వెట్టి చాకిరిలో ఉన్న వీరి జీవితాల్లో వెలుగులు ఎప్పటికో....



# అక్షర దీపాలు

—డా॥ డి.ఎల్. విద్య

" ఉహుం, ఉహుం" అని నేనంటున్నా, బడికే నన్ను
పంపించేసారు.
' ఊం' ' ఊం" రాగం తీస్తున్నా, కనికరమన్నది
కలగేలేదు
అమ్మని ఒదలలేనన్నా, ఆటలు ఉంటాయన్నారు
టీచరు దగ్గర కొచ్చింది అమ్మలాగా లేనేలేదు
పాఠం మొదలు పెట్టింది
'అ' అంటే " అమ్మ" అంది అందంగా నవ్వింది
అమ్మలాగే నవ్వింది
'ఆః' 'ఆ' అని నే నోరు తెరిచేసా
ఆ' అంటే 'ఆట' అంది
'ఇ' అంటే 'ఇల్లు' అంది.
ఇల్లే గుర్తుకు వచ్చింది. మా ఇల్లే గుర్తుకు వచ్చింది.
ఎంతో ఏడుపు వచ్చింది.
'ఈ' అంటే 'ఈల' అంది.
'ఈల కూడా వేసేసింది.
'కిల కిల మని నే నవ్వేసా
'ఆ' దగ్గర వేలే చూపి, ' ఇది ఆట' కాదా!' అని
నవ్వించింది.
'అ' అన్నది చూవగానే, ' అమ్మ' లాగే
అనిపించింది.
మా టీచరు అమ్మలాగే అనిపించింది.
'ఉ' అంటే ' ఉగ్గు' అని, చెల్లికి పట్టే ఉగ్గు అని,
నేనే చక చక చెప్పేసాను
'ఊ' అంటే 'ఊయల'ని, చెల్లిని ఊపే ఊయలని,
అపుడే తెలిసిపోయింది.
పక్కన ఉన్న పాపని నన్ను,
'ఎ' 'ఏ' ' ఐ' అని ఎక్కువెక్కువగ వెక్కిరించింది
తక్కువ నేనేం తినలేదే!
ఎత్తిన చేతులు నెత్తిన పెట్టి, వేళ్ళను రెండేసి
చూపిస్తూ,
'ఒ' 'ఓ' ' ఔ' అని ఓడించా దాన్ని.
'అం' 'అం' అని టీచరు మమ్మల్నదిలించింది.
అం" అః' అని నోళ్ళని మేమూ మూసేసాం
'ఉ' 'ఊ'; ఉ,ఊ అనుకుంటూ,
'క' 'ఖ'; 'గ' ' ఘ' చదివేస్తూ,
ఇంటికి నేనూ వస్తుంటే,
'కుహు' 'కుహూ మని కోయిల కూస్తూ,
'క' ' ఖ' 'గ''ఘ' బదులిచ్చేను.
చక్కని చల్లని వెన్నెలలోన,
ఆరుబయట నేనమ్మ పక్కలో,
ఆకాశంలో అక్కడక్కడా చుక్కలు చూసి,
'నక్షత్రాలు' అని నేనంటే,
అమ్మ వాటిని ' అక్షరదీపాలు' అన్నాది
'హోరు హోరున గోలచేయు నడి సంద్రంలో,
నావను నడిపే నావికుడు,
చుక్కను చూసే ' దిక్కు' పట్టునని,
జీవన యాత్రలో, మానవుడు,
అక్షర మందే సత్యం కనునని,
తిమిరం అపుడే మాయం అగునని,
నక్షత్రాల వంటిదే ' అక్షరమాల' ని అన్నాది"
పెద్దలు మీకెట్లుందో గాని, పాపను, నాకేం అర్థం
కాలేదు.
చిట్టి పాపను నేనని మురిసి, అమ్మ నన్నూ,
చుక్కలన్నింటిని లెక్క పెట్టమంది.
ఆరుబయట నేనమ్మ పక్కలో
ఆకాశంలో అక్కడక్కడా చుక్కలు చూసి,
'అశ్వని' ' భరణి' లెక్కించా
'భలే, భలే' మా పాపాయంటూ,
ముద్దు ముద్దుగా బుజ్జగించుకుంటూ,
"బడికి పోదువా తల్లీ!" అంటే,
'ఊ" కొడుతూ నే నిద్దురపోయా.

# రూపాయను

వేములపల్లి సత్యవతి




నేను రూపాయను. నా పేరుకూడా రూపాయే. నేనంటే మనుషులందరకు ఇష్టమే. నాయందు ఎంతో ప్రేమ చూపిస్తారు. అలా ఇష్టపడటం, ప్రేమ చూపటం సహజమే అనిపిస్తుంది నాకు. ఎందుకంటారా? నేను లేకుండా మనుషుల మనుగడ సాగదు. తెల్లవారి లేచిన దగ్గరనుంచి ప్రజలకు నిత్యజీవితావసరాలు తీర్చుకోవటానికి నేను కావాలి. అంతవరకు వారికి ఉపయోగపడటం నాకూ సంతోషమే. మాయలపకీరులాగ మాయలు చేసే శక్తి వుందినాకు. అల్లావుద్దీన్ అద్భుత దీపంలాగ అద్భుతాలు సృష్టించగలను. అయితే అవన్ని ప్రజలందరకు పనికి వచ్చేవిగా వుండాలన్నదే నాకోరిక. కాని దురదృష్టవశాత్తు కొంత మందికి నాయందు వల్లమాలిన ప్రేమ. దానితో మనిషి స్వార్థపరునిగా, సంఘవిద్రోహిగా తయారయ్యాడు. నన్ను సంపాదించటానికి తొక్కరాని అడ్డదారులు తొక్కుతున్నాడు. నానా గడ్డీ కరుస్తున్నాడు. ఎన్నెన్నో దుర్మార్గాలు చేస్తున్నాడు. చేయిస్తున్నాడు. కుట్రలు, కుతంత్రాలు, దోపిడీలు, హత్యలు ఎన్నని చెప్పను? నోటిచ్చి ఓటుకొనుక్కొని కోట్లకు పడగలెత్తుతున్నారు. అలా సంపాదించిన నన్ను ఎక్కడదాస్తున్నారో తెలుసుకుంటే ముక్కుమీద వేలేసుకొని, నోరెళ్ల బెడతారు. సప్త సముద్రాలు దాటించి ఎవరికి తెలియనిచోట, తెలియనీయని దేశాల బ్యాంకుల్లో భద్రపరచుకున్నారు. అదంతా ప్రజలనుంచి నన్ను దోచుకున్నసొమ్మే సుమా! వీణాదేవిని తలచుకొని లోగడ చదువుకునే బాలబాలికలు, యువతీ-యువకులు "అమ్మా! నిన్ను తలంచి పుస్తకము చేతంబూనితి" యని ప్రార్థించేవారు. ఇప్పుడు ప్రార్థిస్తుంటే నిర్వాహకులకు శుల్కాలు చెల్లించలేక కళ్ళలోంచి నీరు బదులుగా నెత్తురుకారుతున్నది. పూర్వకాలంలో విద్య, వైద్యం రెండూ ఉచితమే. ఇప్పుడవి అందని పుల్లద్రాక్ష పండ్లే. వైద్యాలయాలకు రోగాలతో రోష్టులతో పేదప్రజలు వెళితే వారిని చూచే వైద్యులుండరు. వుంటారు. పట్టించుకోరు. ఒకవేళ పట్టించుకున్న మందులులేవని కొని తెచ్చుకొమ్మని చిట్టీలు రాసిస్తారు. వారి దగ్గర నేనులేకనే కదా వారు సర్కారు వారి ధర్మాసుపత్రులను ఆశ్రయించేది. నన్నిచ్చినవారిని ఎంతో సాదరంగ ఆహ్వానించి వైద్యం చేసి పంపిస్తారు. నిండు చూలాలులు రోడ్లమీద, ఆసుపత్రుల ఆవరణలో బిడ్డలకు జన్మనిచ్చే పాపిష్టిరోజులు ప్రాప్తించినవి. ఇవన్ని చూస్తుంటే నాకడుపు తరుక్కుపోతున్నది. కళ్లెంట కడవలకొద్ది నీళ్లు కారుతున్నవి. కాని నేను ఏమి చేయలేకపోతున్నాను. కొంతమంది చేతిలో బందీనయ్యాను. ప్రజలదగ్గరకు నన్ను చేరకుండ చెరపట్టేసారు. పేద ప్రజలపేరుతో పథకాలు, స్కీములు తయారు చేశారు. ఆవేవీ వారికందకుండా దొంగలు-దొంగలు ఊళ్లు పంచుకున్నట్లు పాలకులు, అధికారులు తలాయింత గుట్కాయ స్వాహాచేసారు. ఇప్పుడేమో ఏది చేయాలన్న నేను చాలినంతలేనని నెపమంతా నామీద నెట్టేస్తున్నారు. గుడిని, గుడిలోలింగాన్ని మింగేసిన తర్వాత యింకనేనెక్కడ అందరకు అందుబాటులో వుంటానో ఆలోచించండి.

దేశరక్షణ కొరకు ఉపయోగపడే ఆయుధాల "బోఫోర్స్ కుంభకోణందగ్గర నుంచి, గొడ్ల మేసేగడ్డిదాకా అన్నీ కుంభకోణాలే", హర్షద్‌మోహతా, తెల్గీని గురించినవి నా పాత కథలు. సత్యంరామరాజు, రాజావి కూడా నావింతకథలే! ఈ మధ్యన వింతల్లో వింతయినది హసన్‌అలీది. ఇదీ నన్ను గురించిన చిత్రాతి చిత్రమైన కథ. ఇవన్ని రోజూ వార్తాపత్రికల్లో పతాక శీర్షికలతో వెలువడుతుంటే సిగ్గుతో చితికి పోతున్నానంటే నమ్మండి. ప్రపంచ ప్రజల ముందు నన్ను అవినీతి చక్రవర్తిగా నిలబెట్టి పరువు-ప్రతిష్టలు మంటగలిపారు. మనసుంటే మార్గమున్నదన్నారు. పాలకుల మదిలో ప్రజలకు మంచి పనులు చేయాలన్న ఆలోచన వుంటే సాధ్యంగానిది ఏదీలేదు. ఎంతో చిన్నదేశమైన స్పెయిన్ అక్కడ ఏర్పడిన కరెంట్ కోతను అధిగమించటానికి పవనవిద్యుత్తును, సౌరవిద్యుత్తును వుత్పత్తి చేసి ప్రజల అవసరాలకు యిబ్బంది లేకుండా చేసింది. మరిమనపాలకులో? మోతాదుకు మించిన వర్షాలు కురిసినవి. వేసవి మొదలవకముందే కరెంటు కోతలు మొదలయినవి. వ్యవసాయానికి సరిపడ కరెంట్ సరఫరా లేనందున ఆరుగాలము కష్టించి పండించిన పంటలు ఎండి పోతూఉంటే రైతన్నలు గుండెలు పగిలి చస్తున్నారు. పూర్వంనుంచి నేటివరకు రైతన్నల, నేతన్నల ఆత్మహత్యలు ఆగలేదు. సృష్టిలోని అన్ని ప్రాణులు అవసరంలేకుండా మనుగడ సాగించుకుంటున్నవి. ఒక్కమానవమాత్రుడు తప్ప మానవుడు కూడ ఆటవిక జీవనం సాగించినపుడు మిగతా జంతుజాలాలవలె వేటాడి ఆకలి తీర్చుకున్నపుడు నా అవసరం లేకుండానే బ్రతికాడు. బుద్ధి, ఆలోచనాశక్తులవలన ఉన్నతుడుగా ఎదిగి మిగతాప్రాణికోటిమీద ఆధిపత్యం సంపాదించాడు. నాగరికుడయ్యాడు. నాగరికత పెరిగింది. విజ్ఞానవంతుడయ్యాడు. మిగతావాటిలాగ ప్రకృతి నన్ను సృష్టించలేదు. మానవుడే నన్ను, నా ఉపయోగాన్ని కనిపెట్టాడు. నాగరికత, విజ్ఞానమువెర్రి తలలు వేసింది. మోతాదుకుమించిపోయింది. స్వార్థం బలిసిపోయింది. సమాజకళ్యాణం, దేశ శ్రేయస్సు అప్రధానమయ్యాయి. అందుకని ఆదుండగులు దేనిని వదిలిపెట్టటంలేదు. అడవులను సమూలంగా నరికివేస్తున్నారు. ఎర్రచందనంను ఎగుమతిచేస్తున్నారు. అడవులనిర్మూలన వలన అందులో నివసించే సాధు జంతువులు, క్రూరమృగాలు జనారణ్యాలకు చేరుతున్నవి. తరతరాలునుంచి అడవితల్లి ఒడిలో బతికిన గిరిజనులు, కోయలు, చెంచులు, గొండులు మొదలైనవారు నిరాశ్రయులయ్యారు. నిలవనీడలేక తల్లడిల్లుతున్నారు. తినతిండిలేక మలమల మాడుతున్నారు. ఇవి చాలవన్నట్లు పాపం! వారిని రోగాలు, రోష్టులు విషజ్వరాలు వెంటాడుచున్నవి. వైద్యసదుపాయంలేక వందలకొలది మరణిస్తున్నారు. ఇంతఘోరం జరుగుతున్న నన్ను దాచుకున్నవారు వారికి సాయపడటానికి ముందుకు రావటంలేదు. నన్ను ప్రజోపయోగం కొరకు ఉపయోగించాలని కొందరు పోరాడుతున్నారు. ఎన్నాళ్లనుండో ఉద్యమాలు చేపట్టారు. నిరంతరము చట్టసభల్లో నాచర్చ జరుగుతూనే ఉన్నది. వారిపోరాటాలు ఫలించి ప్రజలకు ఉపయోగపడాలన్నదే నా చిరకాలవాంఛ. ప్రజలు చైతన్యవంతులై ఓటునమ్ముకోకుండా ఓటు తమజీవితాలకు గీటు రాయని భావించాలి. రాజకీయ పార్టీలు ప్రజలను ఆవిధంగా చైతన్యపరచాలి. అప్పుడే నాకు నిజమైన ఆనందం కల్గుతుంది. రూపాయన్న నాపేరుకు సార్ధకత చేకూరుతుంది.

# నవ నిర్వచనం

- కాళీపట్నం సీతావసంతలక్ష్మి

నవరాత్రులు, అమ్మవారి గుడి భక్తులతో కళకళలాడుతోంది. చాలామంది లైన్లలో నిలబడినా, ఎవరూ తోపుళ్లూ, తొక్కిసలాటలూ చేయటం లేదు. ఆ గుడి మహిమే అదేమో. పెద్ద ఊరూ కాదు. ఓ మాత్రం జనాభా. వారందరినీ గుళ్ళో చూసి, పూజారి పెద్ద శాస్త్రిగారికి చాలా సంతోషంగా, సంతృప్తిగా అనిపించింది. వచ్చిన ప్రతి భక్తుల కానుకలూ శ్రద్ధగా అమ్మవారికి అర్పించటం, వాళ్ళు తెచ్చిన పండ్లూ, పూలూ, పసుపు కుంకుమలలో సగానికి పైగా వారికే ప్రసాదంగా తిరిగి ఇచ్చేయటం, పెద్ద శాస్త్రిగారు తనకు తానే విధించుకున్న నియమం. వాళ్ళు హారతిపళ్ళెంలో వేసే రూపాయో, రెండో మాత్రమే ఆయనకు అందే కానుక. అంతకంటే ఆయనకి ఆశలేదు. ఆలయపు యాజమాన్యం ఇచ్చే జీతంతో ఉన్న ఒక్క కొడుకునూ ఇంటర్ దాకా చదివించాడు. ముద్దుగా అందరూ వాణ్ణి చిన్న శాస్త్రీ అంటూంటే ఆయనకు ఎంతో గర్వంగా ఉంటుంది. ఎప్పుడైతే వాడు కాలేజ్‌లో చదవననీ, వేద శాస్త్రాలూ, పూజావిధానాలు నేర్చుకుంటాననీ అన్నాడో, ఆయన ఛాతీ గర్వంతోబాటు ఆనందం కూడా తోడై ఉప్పొంగింది. రోజూ విధిగా వాడూ గుడికి రెండు పూటలా వస్తాడు. కాదన్న విషయం ఏదైనా ఉంటే అర్థగుండూ, పిలకా మాత్రమే వద్దనటం. కానీ చక్కగా పంచా, లాల్చీ, కండువాతో నుదుటన చందన తిలకంతో వాడిని చూసుకుని మురిసిపోతుంటారు పెద్ద శాస్త్రిగారు.

ఆరోజు ఒక పద్దెనిమిది ఏళ్ళ అమ్మాయి, తన తల్లి తండ్రులూ, అమ్మో, లేక అమ్మమ్మో తెలీదు ఒక పెద్దామెతోనూ కలిసి అమ్మవారి దర్శనానికి వచ్చింది. ఆరోజెందుకో జనం ఎక్కువ వున్నారు.

"ఓం కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా" అంటూ పెద్ద శాస్త్రిగారు కుంకుమార్చన ప్రారంభించారు. అర్చన పూర్తయింది. కొబ్బరికాయ కొడుతుండగా వాళ్ళ మాటలు వినిపించాయి.

" అంతా అమ్మవారి దయే, లేకపోతే ఎలాంటి కోరికలూ కోరకుండా కేవలం మన అమ్మాయిని చూసి అంత పెద్ద సంబంధం వాళ్ళే కోరి రావటం.... తల్లీ అంతా నీదయేనమ్మా' బామ్మగారు అన్నది.

"మామ్మా, ఇక్కడంతా వింటున్నారు" సిగ్గు సిగ్గుగా ఆ అమ్మాయి అంటోంది.

" మా అమ్మాయి పెళ్ళి కుదిరిందండీ అబ్బాయికి బ్యాంక్‌లో ఉద్యోగం" తండ్రి సంజాయిషీ ఇస్తున్నట్టుగా పెద్దశాస్త్రిగారితో అన్నాడు.

"శుభం. ఈ అమ్మవారి దయే అది, ప్రాశస్త్యమే అది" పెద్దశాస్త్రి నవ్వుతూ అన్నాడు. శఠగోపం పెడుతూ.

దీవెనలూ, పసుపుకుంకుమలూ, పూలూ, కొబ్బరి చిప్పలూ, పండ్లూ అందరికీ పంచటం, ఆఖరున పరదా లాగి, అమ్మవారి గుడి తలుపులు తాళాలు పెట్టి ఇంటికెళ్ళిపోవటం ఎప్పటిలాగే అయ్యాయి.

* * * *

'చిన్నా, బొంబాయిలో ఎవరిదో నామకరణంట నువ్వెళ్ళిరారా, బొంబాయి చూసినట్టూ ఉంటుంది నీకు, ఎలాగూ నాకు వెళ్ళే ఓపిక లేదు"

'నిజమే ననుకోండి, కానీ నేనూ ఎపుడూ బొంబాయి వెళ్ళలేదు. ఊరూ అదీ కొత్తగా ఉంటుంది" నసిగాడు.

" ఫరవాలేదు వారి కుటుంబం ఇక్కడినుండే వెళుతున్నారుట. నీకూ వాళ్ళతోపాటే టిక్కెట్టూ అదీపెట్టి తీసుకెళతార్ట. వెళ్ళిరా ఇక్కడ నేను చూసుకుంటాగా".

అలా జరిగింది చిన్న శాస్త్రి మొదటి బయటి ప్రయాణం. సవ్యంగా, హాయిగా సాగింది. దాదర్‌లో మూడే నిముషాలు రైలాగుతుందిట. హడావుడిగా దిగటం, ఆ తర్వాత మరొక లోకల్ ట్రెయిన్‌లో ములుండికి బయల్దేరటం అంతా కొత్తగా అనిపించింది. అప్పుడే జరిగిందో వింత. వీళ్ళు నలుగురూ అంటే శాస్త్రి, పెద్దాయనా, కూతురూ, అల్లుడూ కూర్చున్న కంపార్ట్‌మెంట్‌లోకి నలుగురు హిజడాలు ఎక్కారు. ఆడవారికన్నా ఎక్కువ సింగారం, వగలూ, హొయలూ ఒలకబోసారు. జబరదస్తీగా పెద్దాయన్ని, అల్లుడినీ, చిన్న శాస్త్రినీ లెమ్మని హిందీలో చెప్పారు.

భయం, నవ్వో తెలియని స్థితి. ఆజానుబాహులు. ఆడవేషాలు ..........

" లేడీస్‌కో సీట్‌నైదేతారే?" అంటూ అదోలాగదమాయించారు. కూర్చుంటూ పమిటలు సర్దుకుని, వేకవ్పుటు దిద్దుకోనారంభించారు. పేర్రాజుగారనబడే పెద్దాయన.

" మీరు తెలుగువాళ్ళా?" అందులో ఒక కుర్రగా కనిపిస్తున్న గులాబీరంగు పూలచీరలోని అబ్బాయో, అహహ... అమ్మాయో, అడిగాడు. చూడనట్టు నటిస్తూనే, చిన్న శాస్త్రి వారి వంక నిశితంగా చూస్తుండిపోయాడు.

" అవును" పేర్రాజుగారు సౌమ్యంగానే చెప్పినా ముక్తసరిగా అన్నారు.

" ములుండుకా?"

పేర్రాజుగారికి కాస్త జంకు కలిగినా ఇంక చేసేదేం లేదన్నట్టు " మా మనుమడికి నామకరణం"

" అయితే మాకు పండుగే ఎడ్రస్ చెప్పు పెద్దాయనా?" అంటూ ఒక నడివయసు హిజడా ఆటపట్టిస్తూ, అరచేతులు కొట్టి అసభ్యకర శబ్దం చేస్తూ అడిగాడు. ఇంక చేసేదేమీ లేదనుకున్నారేమో, పేర్రాజుగారు ఆ హిజడాలకు చిరునామా చెప్పటం, ఆ తరువాత స్టేషన్, ఫుట్పోవర్‌లో వాళ్ళు దిగిపోవడం జరిగింది.

" మనం ములుండుకి వెడుతున్నామని వాళ్ళకెటా తెలిసింది?' చిన్న శాస్త్రి ఆశ్చర్యంగా అడిగాడు.

" దాదర్‌లో టికెట్లు తీస్తున్నపుడు వీళ్ళు నా వెనుక ఉన్నారు". వీళ్ళు ఎలాగో ఆసుపత్రులోంచి పిల్లలు పుట్టిన సమాచారం సేకరించేస్తారు''. అని వివరించారు''. వీళ్ళనించి తప్పించుకోవడం కష్టం".

★ ★ ★ ★

ఆరు నెలల తరువాత అదే పద్దెనిమిదేళ్ళ అమ్మాయి, తల్లితండ్రులతో బామ్మతో విషణ్ణ వదనాలతో గుడికి వచ్చారు. ఏదో మొక్కుబడిగా దర్శనం కానిచ్చుకున్నారు. అందరికీ యధావిధిగా పసుసు, కుంకుమ, పూలు, పండ్లు, కొబ్బరిచిప్పలూ ఇస్తూన్న చిన్నశాస్త్రి ఆ అమ్మాయి ముందు హటాత్తుగా ఆగిపోయాడు. రంగు చీర, మెడలో ఏదో గొలుసు. కానీ ముఖాన బొట్టు లేకుండా వెలవెలబోతూ, తలొంచుకుని నిలుచుని ఉంది. చిన్నశాస్త్రి సంశంగా వారికి బాగా వెనగ్గా నిలబడి పర్యవేక్షిస్తున్న తండ్రివైపు చూసాడు. ఈ అమ్మాయికి ఇవ్వాలా వద్దా అన్నట్లు. ఇటు అమ్మవారు, అటు తండ్రీ, ఇమ్మంటున్నట్లే అనిపించి పసుపు, కుంకుమల ప్యాకెట్లు, పూటూ, పండ్లూ, కొబ్బరిచిప్పా ఆమె చేతిలో పెట్టి "సౌభాగ్యవతీ భవ" అనేసి గిరుకున్న వెనుతిరిగి వెళ్ళిపోయాడు. చేసింది తప్పో ఒప్పో తెలీలా.

రాత్రి భోజనాల దగ్గిర మళ్ళీ ఈ ప్రస్తావన వచ్చింది. అమ్మ అంది.

"అదేమిట్రా చిన్నా, అమ్మవారి పసుపు కుంకుమలు శర్మగారి అమ్మాయికి ఇచ్చావుట! ఆ అమ్మాయి భర్త నెల్లాళ్ళ క్రితం యాక్సిడెంటులో పోయాట్ట. గుడి భ్రష్టం అయిపోతుందో ఏమిటో!" అంటూ గొంతులో నిరసనతోపాటు ఆందోళనా ఉంది.

తప్పు లేదే కావుడా! ఆ పిల్లకి నిండా ఇరవై ఏళ్ళు లేవు. ఈరోజుల్లో మళ్ళీ

పెళ్ళిళ్ళూ చేసుకుంటున్నారాయె" పెద్ద శాస్త్రిగారు పెద్ద మనసుగా అన్నారు.

''ఏమోనండీ! అమ్మగారి గుళ్ళో అనర్థం కాకూడదు. నాకేమో భయంగానే ఉంది" భర్తతో కొద్దిపాటి కోపం, బెదిరింపూ కలిపి అంది.

తలొంచుకుని, వాళ్ళిద్దరి సంభాషణా అనక్తిగా వింటూ మౌనంగా భోజనం కానిచ్చాడు. తనేమయినా అంటే దేవత మాటేమోగానీ, అమ్మ భద్రకాళి అవతారం ఎత్తటం ఖాయం. చిన్నప్పటినుంచీ, బైటి ప్రపంచంతో సంబంధం లేకుండా ఐదో తరగతితో చదువాపేసి, వ్రతాలూ, నోములు నట్టింట ఛాందంనం, చాదన్తం ఉన్న పౌరోహిత్యపు కుటుంబంలో పెరిగింది. ఆవిడ ఆలోచనా సరళిని తప్పు పట్టటం కష్టం. ఎందుకంటే ఆమెకి తెలిసిన ఆమోదిత సామాజిక న్యాయం, ధర్మం, నీతి అదే.

మరొక ఆర్నెల్లు ఇట్టే గడిచిపోయాయి. మధ్యాహ్నం పన్నెండు గంటలకి గుడిమూసి, వెనుక ఉన్న తమ ఇంటికి బయలుదేరుతున్న పెద్దశాస్త్రిగారూ, చిన్నశాస్త్రీ ఆగారు. అక్కడే తటపటాయిస్తూ, తచ్చట్లాడుతున్న శర్మగారిని చూసి,

" నమస్కారం శర్మగారు, అంతా కులాశాయేనా? అమ్మాయి కాస్తంత కోలుకుందా?" పెద్దశాస్త్రిగారు అడిగారు.

" ఏదో మీ ఆశీర్వాదం, అమ్మవారి దయవల్లా బాగున్నామండీ, మీతో కాస్త పనుండి వచ్చాను" నసిగారు శర్మగారు.

'చెప్పండి, ఏమిటి?"

" ఏం లేదు, మా అమ్మాయి ఒక్కతే కూతురు. దాని ఖర్మిలా కాలి, పెళ్ళయిన ఆరు నెల్లకే భర్త పోయాడు" ఆగారు.

''దైవాజ్ఞ ముందు ఎవరికైనా తలొంచక తప్పదు శర్మగారూ బాధపడకండి. ఏదో ఓదారి ఆ తల్లే చూపుతుంది". మూసిన గర్భగుడి తలుపుల వంక చూస్తూ ఆర్థోక్తిగా అన్నారు.

ఆ దేవి చలవే అనుకుంటున్నాం, మా అమ్మాయిని, మా అల్లుడి బంధువులలో ఎవరో ఒక అబ్బాయి చేసుకుంటానని కబురు చేసాడు. మిమ్మల్ని ఓసారి సంప్రదిద్దామని". భయంగా ఆగారు.

పెద్దశాస్త్రి గారు వెంటనే ఏమీ జవాబు చెప్పలేకపోయారు. ఒక్క క్షణం ఆలోచించి మెల్లిగా అన్నారు.

" అబ్బాయిదీ, అమ్మాయిదీ జాతకాలు ఇవ్వండి చూస్తాను".

"మా అమ్మాయిది ఉంది, అబ్బాయికి జాతకం మీద నమ్మకం లేదుట" నశిగారు.

''సరే అమ్మాయిదే ఇవ్వండి. ఆ అబ్బాయి పుట్టిన తేదీ ఇవ్వండి చాలు ఏదో ఏర్పాటు చేస్తాను' అని హడావిడిగా వివరాలు తీసేసుకుని శర్మగారిని సాగనంపారు.

ఆరాత్రి ఇంట్లో మళ్ళీ యుద్ధం, కాముడు అనబడే శాస్త్రిగారి భార్యకి ఈ తతంగం ఏమీ నచ్చలా.

'ఓసారి భర్తను పోగొట్టుకున్న అమ్మాయికి మళ్ళీ పెళ్ళా, దానికి మీరు ముహూర్తం పెట్టటమా? ఏమన్నా మతిపోయిందా మీకు? ఆచారాలూ, సాంప్రదాయాలూ అన్నీ బైటెలాగూ మంటగలుస్తున్నాయి. మీరూ మొదలెట్టారా" అంటూ సణుగుడు మొదలు పెట్టింది కామేశ్వరి.

''ఇదిగో చూడు? ఈ పిల్ల జాతకంలో ఇంకో పెళ్ళి ఉందే! పిల్లా పాపల్తో హాయిగా ఉంటుందని గ్రహస్థానాలన్నీ తెలియచెప్తున్నాయి. ముహూర్తం పెట్టినంతమాత్రాన మనమేం భ్రష్టులైపోం" కాస్త మందలింపుగా అన్నారు. ఏదో ముహూర్తం ఓటి పెట్టిచ్చేస్తే పోతుందిలే. ఆయన దక్షిణ గురించి ఎక్కువ ఆశపడే వ్యక్తికాదు.

''ఇవాళ ముహూర్తం పెట్టమంటారు. రేపు పెళ్ళి పౌరహిత్యం కూడా చేయమంటారు. మరీ పోయేకాలం దాపురించింది. అమ్మా, తల్లీ, నీవే మమ్మల్ని కాపాడాలి. ఎటుపోతున్నామో తెలీటం లేదు'. అంటూ పెద్దగా నిట్టూర్చి వంటింట్లోకి నడిచింది కామేశ్వరి.

ముహూర్తం పెట్టి ఇచ్చిన వారం రోజులకే శర్మగారు మళ్ళీ వచ్చారు.

"పెద్ద శాస్త్రిగారూ, మీరే ఏదో పెద్ద మనసు చేసుకుని, మా పిల్ల పెళ్ళికి మా అమ్మని ఒప్పించాలి. ఇంట్లో మా అమ్మకు ఈ రెండో పెళ్ళి గురించి సర్ది చెప్పలేక సతమతం అవుతున్నాం. మీరొస్తే మీ ఆశీర్వాదం ఉందని తెలిస్తే ఆవిడ మనసు ఒప్పుకుంటుందేమో. చూస్తూ చూస్తూ ఆ చిన్నపిల్లకి, జీవితం తిరిగి గాడిలో పడే అవకాశం ఎదురొస్తే మా అమ్మ ఛాందసంగా మొండిపట్టు పట్టుక్కూర్చుంది" డగ్గుత్తికతో తన గోడు వెళ్ళబోసుకున్నారు శర్మగారు.

పెద్దశాస్త్రిగారు సందిగ్ధంలో పడ్డారు. తన భార్య దాదాపు అదే బాటలో

ఆలోచిస్తోంది. శర్మగారి తల్లికి తాను నచ్చచెప్పటమా? ఇదేం ధర్మ సంకటం? చాలాసేపు మౌనంగా కూర్చుని, మెల్లిగా తలెత్తి "రేపు గుడి మూశాక పన్నెండింటికొస్తాను" అన్నారు. అన్నారే కానీ, ఆయనకీ భయంతో గుండె దడదడలాడుతోంది. రాత్రి ఆయనకి కంటిమీద కునుకులేదు.

తెల్లవారి పూజ కార్యక్రమాలలో కూడా మనసు లగ్నం చేయలేకపోయారు. వెంటనే ఒక నిర్ణయానికి వచ్చారు. పన్నెండింటికి గుడి మూస్తూనే కొడుకుని కేకేశారు.

'చిన్నా, ఓసారిలారా! అలా వెళ్ళొద్దాం".

మిట్ట మధ్యాహ్నం పనేమిటా అని ఆశ్చర్యపోతూనే చిన్నశాస్త్రి తండ్రిని అనుసరించాడు. మౌనంగా నది ఒడ్డుకి చేరుకున్నారు. స్నానాల గట్టుమీద కూర్చుని, కొడుకునీ దగ్గరగా కూర్చోమని సౌంజ్ఞ చేశారు. చిన్నశాస్త్రికి సమస్యేదో గంభీరమైనదే అని అర్థం అవసాగింది. అడుగుదామా వద్దా అనుకునేలోగానే శాస్త్రిగారే ఇలా అన్నారు.

"చిన్నా, శర్మగారు అడిగిన విషయం గురించి నీ అభిప్రాయం ఏమిటి;"

చిన్నశాస్త్రి ఆలోచించాడు

" నాన్నగారూ ఇలా జరగటం మనకూ మొదటిసారే. కానీ, ఇలా శాస్త్రోక్తంగా కాకుండా శర్మగారు వాళ్ళమ్మాయికి రిజిస్టర్ పెళ్ళిచేసి ఆ తర్వాత గుడికి మళ్ళీ సుమంగళిగా దర్శనానికి తెస్తే మనం ఏం చేసి ఉండేవారం? అసలా అమ్మాయి భర్తను కోల్పోయిందనిగానీ, ఇది రెండవ పెళ్ళనీ కూడా తెలిసేదా? ఇలాగే ఒక మగవాడుచేస్తే, అసలు మనం ప్రశ్నించేవాళ్ళమే కాదు. అదే ఆడపిల్ల అయ్యేసరికి, ఎదిరిస్తున్నది కూడా ఇద్దరు స్త్రీలే! అందుకే అంటారేమో ఆడవాళ్ళకి ఆడవాళ్ళే శత్రువులని".

"నేను బొంబాయి వెళ్ళినపుడు చూసిన హిజడాలను గురించి చెప్పాను కదా! వారిలో కూడా పెళ్ళిళ్ళుంటాయిట. మరి వాళ్ళు ఆడవారా? మగవారా? వారినెందుకు ప్రశ్నించటంలేదు? నాన్నగారూ, ఈ శుష్క వాదాన్ని విడిచి, మనం మానవతా వాదం అవలంబించాలి. ఆ అమ్మాయికి అట్టే వయసేలేదు. మళ్ళీ మోడువారిన జీవితం చిగురింప చేయటానికి ఒక మంచి మనసున్న వ్యక్తి, దయతో కాకుండా, ఆమెను మెచ్చి వివాహం చేసుకుంటానంటే, శాస్త్రాలకు నిర్వచకులం అయిన మనం, దానికి ఒక క్రొత్త నిర్వచనం ఇచ్చి, మంగళకరం చేయాలి. మీరెళ్ళటానికి అమ్మ అభ్యంతర పెడితే, నన్ను పంపండి. పురోహితుడిగా నేనొక క్రొత్త బాటలో బయలుదేరుతాను".

శాస్త్రిగారి కళ్ళల్లో గర్వరేఖ మెరిసింది. ధృడమైన అంగలేనుకుంటూ ఇద్దరూ శర్మగారింటివేపుకి బయల్దేరారు!

# పాట

పల్లవి: తాగద్దురన్నో-సారాచుక్కను
తాగద్దురో తమ్ముడో-కల్తిసారాను
కట్టుకున్న భార్యని సూడు-కన్న బిడ్డల్ని సూడు
ఆకలి మంటలతో- పిల్లల ఏడ్పుసూడు
తాగద్దురన్నో-సారాసుక్కని
సావు తెచ్చుకోకురో-సారాసుక్కతో

॥తాగద్దు'॥

చరణం:కట్టుకున్నదాన్ని హింసపెట్టి-కన్నబిడ్డలనెండబెట్టి
బాటిల్ల కొద్ది సారాతాగి-సావబాదుడాయే
పూట పూటకు -అలమటించుడాయే
బుక్కెడు బువ్వకు-అలమటించినా
సారా గుడిసెయే-నీయిల్లైపాయేనా
కన్నబిడ్డలే నీకు-గుర్తురాకపాయేనా
సొంత ఇల్లే నీకు- తెలియరాకపాయేనా

॥తాగద్దు"

చరణం: కాయ కష్టం చేసినగాని- కడుపు నిండా బువ్వతినక
ఆకలిదప్పు మర్చిన-సొమ్మసిల్లిపోయినా
కడుపు నిండ ఆసారానే - నింపుకొంటు
క్షణక్షణము నీకు- నరకమాయేనా
ప్రతిక్షణము నీవు-సచ్చుడాయేనా
సావు కేకే నీకు- దిక్కాయేనా
బ్రతుకంతా చీకటిలో- కలిసిపాయేనా

॥తాగద్దు॥

తాగుతు తాగుతు-పానాన్నె సంపుకుంటు
పేగులన్ని పాడైనా- గుడాంబేనే మరువక
గుండె, లివరు దెబ్బతిన్నా- గుడాంబానే వీడక
సావు బ్రతులలో-కొట్టుకొంటివా
కన్నబిడ్డల గుండె- తల్లడిల్లెనా
సేసుకున్నదాని పుస్తె-తెగిపోయేనా
ఆ సారా సుక్కనే- నీ ఇల్లు కూల్చెనా

॥తాగద్దు॥

కన్నతల్లికి కడుపుకోత- నీవు పెట్టి
రక్తం పంచిన కొడుకే-కానరాడని
ఆ తల్లి గుండెలే-పగిలిపాయేనా
ఆ తల్లి మనసుకే-గాయమాయేనా
కన్నతల్లి ప్రేమనే- వీడిపోతివా
కన్నకొడుకే లేదని-దిగులూచెందెనా

॥తాగద్దు॥

-జాన్ విన్సెంట్ నలిగంటి

# పురుషులకు రిజర్వేషన్లా?



మహిళలు తరతరాలుగా అణచివేయబడి అనేక అంశాలలో వెనుకబడి వున్నందుకు సమాజంలో వివిధ అంశాలలో మహిళలకు రిజర్వేషన్లు ఉండాలని కోరుకోవడం సహజం కానీ............

హర్యానా ప్రభుత్వం తన లింగ వివక్షతకు నిదర్శనంగా 67 శాతం టీచింగ్ పోస్టులను మగవారికి రిజర్వు చేస్తూ ఆదేశాలు జారీ చేసింది.

2005లో వెలువడిన ఈ నోటిఫికేషన్‌పై పంజాబ్ మరియు హర్యానా హైకోర్టు తీవ్రంగా స్పందించి దానిని సవరించాలని కోరింది. కానీ అది ఇంకా పూర్తిగా సవరించబడలేదు.

హర్యానా ప్రభుత్వం అనేక పథకాలు, విధానాల ద్వారా మహిళలకు సాధికారత కల్పిస్తున్నాననీ చెప్పుకుంటుంది. కానీ టీచర్ పోస్టుల భర్తీలో ఈ ప్రభుత్వం తీసుకున్న విధాన నిర్ణయం రాష్ట్రంలోని మహిళలందరికీ ఆగ్రహాన్ని కలిగించింది. 2005లో ఆ ప్రభుత్వం టీచర్ పోస్టుల్లో 33 శాతాన్ని మహిళలకు, 67 శాతాన్ని పురుషులకు రిజర్వు చేస్తూ నోటిఫికేషన్ జారీ చేసింది. ఇది రాజ్యాంగ విరుద్ధమని అనేక మంది విమర్శించినా దానిని ప్రభుత్వం ఉపసంహరించుకోలేదు. తరువాత స్కూల్ టీచర్స్ ఫెడరేషన్ మరియు ఐద్వా అనేక నిరసన కార్యక్రమాలు చేసిన తరువాత ప్రభుత్వం ఆ ఉత్తర్వును సవరించి మహిళలకు కనీసం 33 శాతం పోస్టులను రిజర్వు చేయాలని నిర్ణయించింది.

2009 జూన్‌లో హర్యానా పబ్లిక్ సర్వీస్ కమిషన్ 1317 టీచర్ పోస్టులకు గాను దరఖాస్తులను ఆహ్వానించింది. కెమిస్ట్రీ, ఎకనమిక్స్, ఇంగ్లీషు, ఫైన్‌ఆర్ట్స్, జాగ్రఫీ, హిందీ, చరిత్ర, గణితశాస్త్రం, సంగీతం, ఫిజికల్ ఎడ్యుకేషన్, పొలిటికల్ సైన్స్, సైకాలజీ, పంజాబీ, సంస్కృతం మరియు సోషియాలజీ సబ్జెక్టులకు సంబంధించి పోస్టులు ఉన్నాయి.

2010 సంవత్సరం డిసెంబరు 19 మరియు 26 తేదీలలో ఈ పోస్టులకు గాను హెచ్‌పిఎస్‌సి పరీక్షలు నిర్వహించింది. ఈ పరీక్షలు పాసై ఇంటర్వ్యూలకు అర్హత సాధించినవారి సంఖ్య, ఉన్న పోస్టుల కంటే మూడురెట్లు ఎక్కువగా ఉంది. ఖాళీ పోస్టులకు సంబంధించిన ప్రకటన ఇచ్చేటపుడే ప్రతి సబ్జెక్టులోనూ 33: 67 అనే విభజన పెట్టారు. దీనిలో మహిళలకు మొత్తం కోటాను 33 శాతానికే పరిమితం చేసారు. ఉదాహరణకు కెమిస్ట్రీ సబ్జెక్టులో మొత్తం ఖాళీల సంఖ్య 33 అనుకుంటే అందులో 21 జనరల్ కేటగిరీ అనుకుంటే అందులో 14 పురుషులకు రిజర్వు చేసి 7 మాత్రమే మహిళలకు కేటాయిస్తారు. అలాగే రిజర్వేషన్ కేటగిరీల్లోకూడా ఎక్కువ శాతాన్ని పురుషులకు కేటాయించారు. దీనిని కోర్టులో సవాలు చేయగా దానిపై విచారణ పెట్టారు. కానీ పరీక్షలపుడు ఇదే పద్ధతిని పాటించారు.

ఎక్కువ మంది పురుషులు అర్హత సాధించేందుకు వీలుగా టీచర్ పోస్టులకు సంబంధించిన జనరల్ కేటగిరీలోనూ, రిజర్వేషన్ కేటగిరీలోనూ మహిళలకు అర్హత మార్కులను పురుషులకంటే ఎక్కువగా నిర్ణయించారు. ఇంగ్లీషు టీచరు పోస్టులకు సంబంధించిన జనరల్ కేటగిరీలో పురుషులకు అర్హత మార్కులు 50 అయితే మహిళలకు అర్హత మార్కులు 62గా నిర్ణయించారు. హిందీ టీచర్ పోస్టులకు పురుషులకు 71 మరియు మహిళలకు 76 మార్కులు అర్హత మార్కులుగా నిర్ణయించారు.

షెడ్యూల్డ్ కులాలకు మాత్రం పురుషులకు, మహిళలకూ ఇద్దరికీ 71 మార్కులుగా నిర్ణయించారు. కానీ వెనుకబడిన తరగతుల వారికి మాత్రం మహిళలకు 78 మార్కులు, పురుషులకు 75 మార్కులుగా నిర్ణయించారు. వికలాంగుల కేటగిరీలో కూడా పురుషుల కంటే మహిళలకు కొంచెం ఎక్కువగానే అర్హత మార్కులు నిర్ణయించారు.

అర్హత మార్కులకు సంబంధించి రిజర్వేషన్ కేటగిరీ, మాజీ సైనికుల కేటగిరీ, వికలాంగ కేటగిరీలకు తేడాలు వుంటాయనేది తెలిసిన విషయమే. ఇపుడు కొత్తగా మహిళలు ఎక్కువ అర్హత మార్కులు సాధించినా వారిని ఇంటర్వ్యూలకు పిలవకపోవడమనేది చాలా విడ్డూరమైన విషయం.

సమాచార హక్కు చట్టం కింద వేసిన

ఒక పిటీషన్‌కు సంబంధించి హర్యానా స్టాఫ్ సెలక్షన్ కమిషన్ 2010 సెప్టెంబరులో ఒక సమాధానం ఇచ్చింది. దానిలో వెలుగులోకి వచ్చిన అంశాన్ని పరిశీలిస్తే ఆశ్చర్యం కలుగకమానదు. జనరల్ కేటగిరీలో మొత్తం 627 మంది మహిళలు అర్హత సాధించినా కానీ ఆ కేటగిరీకి సంబంధించిన ఫిజికల్ ఎడ్యుకేషన్ పోస్టుకు ఒక్క మహిళను కూడా నియమించలేదు.

**కోర్టుతీర్పు:** రుబి మాంగ్లిక్ అనే మహిళ మరియు కొంత మంది కలిసి ఈ విషయాన్ని పంజాబ్ మరియు హర్యానా హైకోర్టు దృష్టికి తీసుకెళ్ళారు. స్కూల్ టీచర్ పోస్టుల భర్తీతో హెచ్‌పిఎస్‌సి అనుసరించిన ఈ విధానంపై కోర్టు తీవ్రంగా స్పందించింది. జస్టిస్ ఎం.ఎం కుమార్ మరియు రీతూ బహరీ అనే ఇద్దరు జడ్జిలతో కూడిన ధర్మాసనం దీనిపై ఆజ్ఞలు జారీ చేస్తూ జూన్ 18వ తేదీన మహిళలకు, పురుషులకు ఇద్దరికీ రిజర్వేషన్ కల్పిస్తూ జారీ చేసిన ప్రకటనను సరిచేయాలని కోరింది.

ప్రకటనలో వివిధ సబ్జెక్టులకు సంబంధించిన మొత్తం ఖాళీలను పేర్కొన్నారు. ఆ ప్రకటన ప్రకారం ఉదాహరణకు కెమిస్ట్రీ సబ్జెక్టులో 21 జనరల్ కేటగిరీ పోస్టులకు గాను 14 పోస్టులను పురుషులకు రిజర్వు చేసి 7 పోస్టులను మహిళలకు రిజర్వు చేసారు. బెంచ్ పేర్కొన్న విధంగా ఈ ప్రకటనలో మహిళలకే కాక పురుషులకు కూడా రిజర్వేషన్లు ఉన్నాయని స్పష్టంగా తెలుస్తుంది.

ప్రభుత్వం ఇచ్చిన సమాధానంపై బెంచ్ ఇంకా ఈ విధంగా స్పందించింది, ఏ మహిళ అయినా అత్యధిక మార్కులు సాధించినట్లయితే ఆమెను జనరల్ కేటగిరీ క్రింద పరిగణించి సంబంధిత సబ్జెక్టులో ఆమెకు నియామకం కల్పించాలి. దీనినే ఇంకోవిధంగా చెప్పాలంటే మహిళలు ఎక్కువ మార్కులు సాధిస్తే జనరల్ కేటగిరీలోని 67 శాతం పోస్టులలో మహిళలు 33 శాతం కంటే కూడా ఎక్కువ పోస్టులకు నియామకం పొందవచ్చు. ఆవిధంగా పురుషులకు రిజర్వేషన్ కల్పించకుండా మహిళలకు 33 శాతం వరకూ కనీస రిజర్వేషన్లు కేటాయించవచ్చు.

ఎప్పుడైనా ప్రభుత్వ కార్యాలయాలకు నియామకాలు జరిపేటపుడు ప్రకటనలలో వివిధ కేటగిరీలకు సంబంధించిన పోస్టుల వివరాలతోపాటుగా మొదటిగా రిజర్వేషన్‌లకు సంబంధం లేకుండా పరీక్ష వ్రాసినవారి మెరిట్ జాబితాను ప్రకటించాలని బెంచ్ సూచించింది. ఇది పిటిషన్‌ను మరియు సుప్రీంకోర్టు తీర్పును దృష్టిలో పెట్టుకుని చెప్పింది.

కోర్టు తీర్పు దృష్ట్యా డిసెంబరు 12,2010 సంవత్సరంలో హర్యానా పబ్లిక్ సర్వీసు కమీషన్ 1317 స్కూల్ టీచర్ పోస్టులకు గాను ఇండియన్ ఎక్స్‌ప్రెస్, టైమ్స్ ఆఫ్ ఇండియా, దైనిక్ భాస్కర్, దైనిక్ ట్రిబ్యున్ మొదలైన ప్రతికలలో మార్చి 2009 మరియు ఏప్రిల్ 2009లలో వెలువడిన ప్రకటనలకు సవరణ ప్రకటనలు వెలువరించింది.

పాఠశాల ఉపాధ్యాయుల సంఘం (ఎన్‌టిఎఫ్) కార్యవర్గ సభ్యులయిన వత్వాల్‌సినాబ్ మాటల్లో చెప్పాలంటే పురుషులకు, మహిళలకు వేరు వేరు అర్హత మార్కులను నిర్ణయించడమంటేనే వివక్షతాపూరితమని చెప్పవచ్చు. రిజర్వేషన్లు లేకుండానే పాఠశాలల్లో ఉపాధ్యాయుల పోస్టులలో మహిళలు ఎక్కువమంది ఉన్నారు. అది 40 శాతానికి మించి వుంటుంది. దానిని 33 శాతానికి కుదించడమంటే ప్రభుత్వం మహిళల పట్ల వివక్షత చూపడమే కాక రాజ్యాంగానికి విరుద్ధంగా వ్యవహరించడమే.

67 శాతం సీట్లను పురుషులకు కేటాయించటాన్ని రాష్ట్రంలోని వామపక్షాలు ముఖ్యంగా సిపియం పార్టీ తీవ్రంగా వ్యతిరేకించింది. మహిళలకే కాక ఎస్‌సి, బిసి మరియు వికలాంగులకు కూడా జనరల్ కేటగిరీలో రిజర్వేషన్లు కల్పించలేదని సిపిఎం రాష్ట్ర సెక్రటరీ ఇంద్రజిత్‌సింగ్ తెలిపారు. ఆయన రాష్ట్ర ముఖ్యమంత్రి భూపేందర్‌సింగ్‌హుడాకు ఈ విషయమై ఒక లేఖ వ్రాశారు. రాజ్యాంగ విరుద్ధమైన ఈ ప్రకటన గురించి సిపిఎం పార్టీ ఆ రాష్ట్ర గవర్నరు దృష్టికి కూడా తెచ్చింది.

ఆశ్చర్యకరమైన విషయమేమంటే రాష్ట్రంలో ప్రధాన పార్టీలు కానీ ఇండియన్ నేషనల్ లోక్‌దళ్‌లాంటి ప్రతిపక్ష పార్టీలు కానీ ఈ విషయమై ఏమీ మాట్లాడలేదు. రాష్ట్రంలో అనేకమంది కాంగ్రెస్ ఎంపీలు వున్నా, వారుకానీ కేంద్ర ప్రభుత్వంలో వున్న కుమారి షెల్జా కానీ ఈ విషయంపై ఏమీ స్పందించలేదు. సిపియం రాజ్యసభ సభ్యులైన బృందాకరత్ మాత్రమే మార్చి 1వ తేదీన ఈ విషయాన్ని పార్లమెంటులో లేవనెత్తారు. భారతీయ జనతాపార్టీకి సంబంధించిన మరికొంతమంది సభ్యులు ఆమెకు మద్దతు తెలిపారు. బృందాకరత్ మాట్లాడుతూ ఈ అంశం రాజకీయమైనది కాకపోయినా హర్యానా ప్రభుత్వం మహిళల పట్ల వివక్షతతోనే ఈ రిజర్వేషన్ అంశాన్ని దుర్వినియోగం చేయదలచుకుందని చెప్పారు.

జీరో అవర్‌లో అంశాన్ని లేవనెత్తుతూ ఆమె రిజర్వేషన్లకు సంబంధించి ఇదొక క్రొత్త రూపమనీ, ఉద్యోగాలలో మహిళలకు 33 శాతం రిజర్వేషన్లు ఉండాలనే విధానాన్ని హర్యానా ప్రభుత్వం మార్చివేసి పురుషులకు 67 శాతం రిజర్వేషన్ విధానాన్ని ప్రవేశపెట్టిందనీ బృందాకరత్ చెప్పారు.

హర్యానా ప్రభుత్వం నుండి సభ్యులు వివరణ కోరారు. తరువాత పార్లమెంటు వ్యవహారాల రాష్ట్ర మంత్రి అశ్వనీ కుమార్ ఈ విషయాన్ని పరిశీలిస్తాననీ ఎంపీలకు హామీ ఇచ్చారు.

ఈ వివక్షతా పూరితమైన నియామక ఉత్తర్వులను కొన్ని పత్రికలు కూడా ఖండిస్తూ వ్రాశాయి. మహిళలకు 33 శాతం రిజర్వేషన్ పేరుతో ఎక్కువ శాతం ఉద్యోగాలను పురుషులకు కట్టబెట్టాలని చూసారు. మహిళలకు 33 శాతం రిజర్వేషన్ ఉండాలనే విధానాన్ని మార్చి అధిక శాతం రిజర్వేషన్లు పురుషులకు ఉండే విధంగా చేయడానికి పూనుకున్నారు.

ఒకవేళ పూర్తిగా మెరిట్ ఆధారంగా తీసుకున్నా మహిళలు 33 శాతం కంటే అధిక సంఖ్యలో మెరిట్‌లో వున్నాకానీ ఈ నిబంధన ప్రకారం వారు 33 శాతానికే పరిమితమవ్వాల్సివస్తుంది.

లింగ వివక్షత ఒక పెద్ద సవాలుగా ఉండి, గౌరవ హత్యలు మామూలు విషయంగా కొనసాగుతూ వుంది. బాలికల నిష్పత్తి పడిపోతూ ఉన్నా హర్యానా లాంటి రాష్ట్రంలో మహిళలు ఉద్యోగాలలో రాజ్యాంగ పరమైన సమాన హక్కులు పొందడాన్ని అణచిపెట్టాలని చూడడం ఆశ్చర్యకరమైన విషయమేమీ కాకపోవచ్చు.

(ఫ్రంట్‌లైన్ సౌజన్యంతో)

అనువాదం: కె.నాగలక్ష్మి

# ఆత్మ విశ్వాసం పేరు.... హేమంతం..

**ఆత్మవిశ్వాసం ఉంటే అంగవైకల్యం అడ్డుకాదు. సంకల్ప బలం ఉంటే సాంధించలేనిదేదీ లేదని నిరూపించిందో గృహిణి. తొమ్మిది నెలల వయస్సులో "పోలియో" రూపంలో వెంటాడిని వైలకల్యాన్ని ఎదుర్కొని ధైర్యంగా నిలబడ్డారు. తల్లి తండ్రుల ప్రోత్సాహంతో చదువులో రాణించి.. భర్త సహకారంతో వ్యాపార రంగంలోనూ విజయం సాధించారు. ప్రత్యక్షంగా, పరోక్షంగా ఆరు వందల మందికి ఉపాధి కల్పిస్తూ ఆత్మవిశ్వాసానికి ఆలంబనగా నిలున్తున్నారు వి.హెచ్ ఆగ్రోఫుడ్స్ అధినేత్రి హేమ.**

హేమ ముంబయిలో పుట్టి పెరిగారు. చిన్నప్పుడే వైకల్యం వెంటాడినా కుంగిపోలేదు. తల్లితండ్రులు స్వరూప్‌రావు, కృష్ణవేణిల ప్రోత్సాహంతో బీఎస్సీ మైక్రోబయాలజీ, బి.ఎం.ఎల్.టీ పూర్తిచేసి కొన్ని రోజులు ల్యాబ్ టెక్నీషియన్‌గా పనిచేసారు. 1995లో కృష్ణా జిల్లా గుడివాడకు చెందిన అగ్రికల్చర్ సైంటిస్ట్ ప్రసాద్‌ను వివాహం చేసుకుని నగరానికి వచ్చారు. వ్యవసాయ శాస్త్రంలో పీహెచ్‌డీ చేసిన భర్త ప్రైవేట్ కంపెనీలో, ఆమె ఓ ఆసుపత్రిలో పాథలాజీ విభాగంలో పనిచేసేవారు. ఒకరి వద్ద ఉద్యోగం చేయడం కాదు మనమే నలుగురికి ఉపాధి చూపుదాం అన్న భావనతో, భర్త సహకారంతో హేమ "బేబీకార్న్' వ్యాపారంలోకి అడుగుపెట్టారు.

**7 కోట్ల టర్నోవర్...**

పెద్దగా పెట్టుబడులు లేకుండా ఇంట్లో మొదలైన వ్యాపారం ప్రస్తుతం 7 కోట్ల రూపాయల టర్నోవర్‌కు చేరుకుంది. మొదట్లో ఉన్న ఇంటిలోనే నలుగురితో పరిశ్రమను స్థాపించారు. వ్యాపారం అభివృద్ధి చెందడంతో ఏడాదిన్నర క్రితం ఉప్పల్ ఐడీఏ సమీపంలోని సొంత భవనంలోకి యూనిట్‌ను షిఫ్ట్ చేసారు. వ్యాపార వ్యవహారాలను దంపతులిద్దరూ పర్యవేక్షిస్తారు. ప్రస్తుతం 18 రకాల కార్న్ ఫేవర్లను తయారు చేసి, సరఫరా చేస్తున్నారు.

**పౌష్టికాహారంపైనే దృష్టి...**

నగరవాసులు ఇష్టంగా తినే జంక్,ఫాస్ట్‌ఫుడ్స్‌కు దీటుగా అదే రుచితో పోషక విలువలు కలిగిన ఆహార పదార్థాలను అందించాలనుకున్నారు. 'బేబీకార్న్' వ్యాపారంలోకి అడుగుపెట్టారు. కార్న్, ఆకుకూరలు, కూరగాయలు తదితరాలతో పోషకాహారాలను తయారు చేస్తూ హోటళ్ళకు, రెస్టారెంట్లు, ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లకు పంపిణీ చేస్తున్నారు. నగరతంతో పాటు విజయవాడు, విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, ఏలూరు, భీమవరం, పట్టణాలకు సప్లై చేస్తున్నారు. నాణ్యత విషయంలో ఎక్కడా రాజీ పడకుండా ఐఎస్ఓ సర్టిఫైడ్ పొందారు.

స్వశక్తితో ఎదగాలి

**వైకల్యం ఉన్నంత మాత్రాన కుంగిపోవాల్సిన అవసరం లేదు. ఆత్మవిశ్వాసంతో ముందుగు సాగాలి. స్వశక్తితో ఎదగాలి. అసక్తి వున్నవారిని నిరుత్సాహపరచకుండా ప్రోత్సహించాలి.**

**- హేమ**

# తెలుగు నాటక సాహిత్యం -స్త్రీలు

తెలుగు నాటక సాహిత్యం-స్త్రీలు అనే అంశంపై ప్రజాస్వామిక రచయిత్రులు వేదిక ఆధ్వర్యంలో ప్రథమ వార్షిక సదస్సు ప॥గో॥జిల్లా నర్సాపురంలో జరిగింది. సదస్సుకు రాష్ట్ర నలుమూలల నుండి 30 మంది రచయిత్రులు పాల్గొన్నారు. సదస్సులో ప్రసంగించిన పలువురు రచయిత్రులు ఆంధ్రప్రదేశ్ నాటక రంగానికి ఓ ప్రత్యేకత ఉందని, మహిళల అంశాలను ముందుకు తీసుకువచ్చి రచనలు చేయుటంలో ముందున్నారని తెలిపారు. కన్యాశుల్కం సతీసహగమనం, దేవదాసీ, వ్యవస్థలకు చరమగీతం పాడేందుకు విశేష కృషి జరిగింది. వరకట్నం వంటి సమస్యలు సమాజాన్ని ఈనాటికీ పట్టి పీడిస్తున్నాయని పేర్కొన్నారు. స్వాతంత్ర్య ఉద్యమ స్ఫూర్తిని రగిలించటంలో తెలుగు నాటకరంగం చేసిన కృషి పేర్కొనదగినది. స్త్రీ పాత్రలను స్త్రీలే అభినయించాలని చేపట్టిన ఉద్యమం విజయం సాధించింది. వామపక్ష ఉద్యమ మహిళా కార్యకర్తలు సామాజిక, ఆర్థిక రంగాలను ప్రతిబింబించే విధంగా బుర్రకథలు, మా భూమి నాటకం పాత్రలలో చురుకుగా పాల్గొన్నారు. ఆనాడు ప్రజాసమస్యలను కొలబద్ధలుగా తెరమీదకెక్కిస్తే, ఈనాడు విషసంస్కృతి ప్రవేశించిందని, టీవిలు, మొదలుకొని సినిమాల వరకూ మహిళలను అశ్లీలంగా, విలన్లుగా చూపిస్తున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. మన సంస్కృతిని, కళలను నిలబెట్టుకోవాల్సిన అవసరం ఉందని పేర్కొన్నారు. ఈ సదుస్సులో రచయిత్రులు రత్నమాల, డా॥ నళిని, ప్రొఫెసర్ కె. కాత్యాయని, చల్లపల్లి స్వరూపరాణి, ఝాన్సీ, కె. లలిత, డా॥ సమతారోష్ని మొదలైనవారు పాల్గొన్నారు. ఆద్యంతం మహిళల అంశాలపై సదస్సులో ప్రసంగాలు ఉత్సాహపూరితంగా జరిగాయి.

– పి. పూర్ణ నారాయణ, మానవి డెస్క్

# చదువుకు దూరమవుతున్న గ్రామీణ బాలలు

- నండూరి పద్మాంజలి



ఇండియా వెలిగిపోతోందని ఆనాడెవరో డంబాలు కొట్టారు. ఆడవాళ్ళను లక్షాధికారులను చేస్తానన్నారు మరో దివంగతుడు. భారతదేశం అభివృద్ధి పథంలో పయనిస్తుందంటున్నారు ఇపుడు మరికొందరు. అబద్ధాలను ఇంత అందంగా చెప్పడంలో సిద్ధహస్తులు వీరందరూ. సమాజంలో సగభాగం అయిన స్త్రీ పరిస్థితి నేటికీ అధోగతిలోనే పయనిస్తుంటే అభివృద్ధి ఎక్కడ జరుగుతున్నట్లు. భారతదేశాభివృద్ధికి పట్టుగొమ్మలు గ్రామాలు. గ్రామాలలోని ప్రజలు, ఆ ప్రజలలో మహిళలు, మహిళల మనోగతాలు. ఇవి ఎవరికైనా కనపడుతున్నాయా? ప్రత్యేకంగా ఎదుగుతున్న ఆడపిల్లలకు తాము సమాజ అభివృద్ధిలో పాలు పంచుకొనగలమన్న ఆశ ఇసుమంతైనా కనిపిస్తుందా?

సెంటు కొట్టుకుంటే ఈతకొట్టే ఆడది లేచి అర్ధనగ్నంగా అతని వెంట పడుతున్నట్లు, సెల్‌ఫోన్ కోసం ప్రక్కన కూర్చున్న కుర్రాడి గుండెల మీద వాలిపోవడం, డబ్బుకోసం సినిమాలలో హీరో ఎక్కడ చెయ్యి వేసి తడుముతున్నా ఊరుకోవడం వంటి వ్యాపార ధోరణులు సమాజంలో స్త్రీ ఔన్నత్యాన్ని తగ్గించివేసేందుకు చూస్తున్నాయి. ఆడపిల్లలు ఇలా బరితెగించిన వారనే అపవాదు సభ్యసమాజంలో కలిగించే విధంగా వ్యాపార సంస్థలు స్త్రీలను వినిమయ వస్తువులాగా చిత్రీకరిస్తూండగా ఎంతో మంది ఆడపిల్లలు కనీసం తమ బ్రతుకు సజావుగా సాగుతుందా అన్న సందేహంలో కొట్టుమిట్టాడుతున్నారు.

ఐద్వా బృందం నూజివీడు పట్టణ పరిసర గ్రామాలైన అనంతసాగరం, తుక్కులూరు, మర్రిపూడి, దేవరగుంట, జంగంగూడెం, రావిచర్ల, పట్టిగుడిపాడు, రామన్నగూడెం, గొడుగువారి గూడెం, పోతురెడ్డిపల్లి, సిద్దార్ధనగర్, అన్నవరం, కాట్రేనిపాడు, సింహాద్రిపురం, గోపవరం, కొత్తూరు తండాలకు చెందిన ఎంతోమంది యువతులను "నిజంగా ఆడవాళ్ళు అభివృద్ధి చెందారా"? అంటే 'ఎక్కడా;" అని ముక్త కంఠంతో ప్రశ్నించారు.

నేటి కాలంలో ఇంకా గ్రామాలలో ఆడపిల్లల పరిస్థితి ఎలా ఉన్నదని అడుగగా వారు పలు ఆసక్తికర విషయాలు తెలియజేసి కంటతడి పెట్టించారు. గోపవరం గ్రామానికి చెందిన ఆయేషా 'మగపిల్లాడు పుట్టలేదని మా అమ్మరోజూ బాధపడుతోందని అన్నది'. మర్రిపూడికి చెందిన రుక్సానా తన గ్రామం గురించి చెబుతూ "టీవీలు, సినిమాల వల్ల మాకేం మెరుగు కనిపించట్లేదు. మా గ్రామంలో మగవారు త్రాగివచ్చి పెళ్ళాం, పిల్లలను కొడతారు. ఆడపిల్ల ఇంటెడు చాకిరి చేయాలి. చదువుకోవాలి అంటే 'నీ బొంద చదువని' ఇంటి పనికి అప్పచెప్తారు. మగపిల్లాడు ఆడుకుంటున్నా వాడిని తన్ని తీసుకువచ్చి చదివిస్తారు. 10వ తరగతి అవగానే పెళ్లి చేస్తాం అంటున్నారు. నాకిపుడు 15 సంవత్సరాలు. నాకు మా బావతో అపుడే పెళ్లి నిశ్చయం చేశారు. చదువుకుంటానని నేనెంత ఏడుస్తున్నా వినిపించుకోవడంలేదు" అంటూ చదువుపట్ల తన బాధను వెళ్ళగక్కింది. పట్టిగుడిపాడుకి చెందిన

గుణస్వప్న అనే బాలిక మాట్లాడుతూ "ఆడపిల్ల పుడితే దరిద్రం అంటున్నారు. మగపిల్లాడి కోసం నలుగురు ఆడిపిల్లలనైనా కంటున్నారు. ఆ ఆడపిల్లల పెళ్ళిళ్ళకు పొలాలు అమ్ముతున్నారు. అప్పులు చేస్తున్నారు. 'ఆడపిల్ల దోచుకుపోయేదే గాని కూడు పెట్టదు'' అని రోజూ ఇంట్లో తిట్టుకుంటుంటారు. చదువు మాటెత్తే ధైర్యం మాకు లేదని" ఆవేదన వ్యక్తం చేసింది. జంగం గూడెంకు చెందిన భార్గవి మాట్లాడుతూ "గ్రామాలలో చేతబడులు, దెయ్యాలు లాంటివి బాగా నమ్ముతారు. ఆడపిల్ల వంటరిగా వెళితే దెయ్యం పడుతుంది అంటారు. వాళ్ళ మూర్ఖత్వాన్ని పెంచేందుకు టివీలలో సీరియళ్ళు మరీ నేర్పిస్తున్నాయి" అని మూఢనమ్మకాలు ఆడపిల్లలనెంత బాధిస్తున్నాయో వివరించింది. ''తల చిక్కుతీసుకున్నా వెంట్రుకలు కూడా బైటవేస్తే చేతబడి చేస్తారని మాపై కోప్పడుతారు"అని అన్నది.

పోతురెడ్డి పాడుకు చెందిన లలితాబాయి మాట్లాడుతూ "గ్రామాలలో వైద్య సౌకర్యం అసలు వుండదు. ఉన్న ఆస్పత్రిలో డాక్టరు అవసరానికి ఎపుడూ ఉండడు. ప్రతీ చిన్నదానికి పట్నం వచ్చే తీరిక, ఓపిక గ్రామాల వారికి ఉండదు. వెంటనే తాయెత్తు కట్టించాలని, మంత్రం వేయించాలని మమ్మల్ని తీసుకువెళతారు. మా వయసు పిల్లలకు సాధారణంగా జ్వరం, కడుపునొప్పి, తలనొప్పి వస్తూంటాయి. వాటికి వైద్యం చేయించుకునే వీలులేక మంత్రగాళ్ళ దగ్గర యంత్రాలు వేయిస్తుంటారు" అని వారి అజ్ఞానానికి ఆవేదన చెందింది.

సింహాద్రి పురానికి చెందిన అక్షయ మాట్లాడుతూ "గ్రామాలలో ఇప్పటికీ 20 ఏళ్ళలోపే పెళ్ళిళ్ళు చేసేస్తున్నారు. చిన్న వయసుకే ఇద్దరు పిల్లల తల్లులవుతున్నారు. వరకట్నం సమస్య బాగా వుంది. వాచీ, ఉంగరాల కోసం కూడా పెళ్ళాలని వేధిస్తారు. ఆడపిల్లలు భర్తల చేతుల్లో చచ్చిపోతున్నపుడు కూడా కట్నాలు ఇచ్చి పెళ్ళిళ్ళు చేయాలని తల్లి తండ్రులు భావించి ఇళ్ళు, పొలాలు అమ్మేసుకుంటున్నారు ఆడపిల్ల పుట్టడమే వారికి భయం కలిగిస్తున్నదని" బాధ పడింది. కొత్తూరు తండాకి చెందిన దుర్గ మాట్లాడుతూ "మా తండాలో 15 సం॥లు నిండగానే పెళ్ళిళ్ళు చేస్తున్నారు. మా గ్రామంలో యాభైపైగా అమ్మాయిలలో కనీసం 20 మందిమి కూడా చదువుకోవడంలేదు. మగపిల్లాడు పుడితేనే సంతోషం. ఆడపిల్లకు చదువు అనవసరం అని గట్టిగా అంటారు. చదువుకుంటామంటే తిట్టి, కొట్టి మాన్పించి పనులలో పెట్టేస్తున్నారు. మగవాళ్ళు బాగా త్రాగి వచ్చి భార్యలను చితక్కొడుతున్నారు. ఆడపిల్లే తల్లికి అండగా వుండి పనులకు పోయి కుటుంబానికి సాయపడతుంది. మగపిల్లలు తాగుడు జూదాలకు అలవాటుపడి ఇంటి సాయానికి పనికిరాకుండా పోతున్నారు" అని కన్నీళ్ళు పెట్టుకున్నది. కాట్రేనిపాడుకి చెందిన సావిత్రి చెబుతూ ''ఆడపిల్లల మీద అనుమానం ఎక్కువ. ఎవరైనా ఏదైనా చెబితే చెప్పిన వాళ్ళమాటే నమ్ముతారు కానీ ఆడపిల్లల్ని నమ్మరు. బాగాకొడతారు, బైటికి వంటరిగా పంపరు. 'ఎవరిమీదయినా దాడి చేసి చంపేసారని తెలియగానే వెంటనే చదువు మానేయమని గొడవపెడతారు".

రామన్నగూడెం లలితవ్వు పేదపిల్లల దుస్థితికి కలత చెందుతూ "వర్షాకాలంలో పనులు వుండవు. మగాళ్లు ఇంటికాడనే వుంటారు. ఆడాళ్ళు మిషను కుట్టీ, ఇండ్లల్లో పనులు చేసి డబ్బు తెచ్చి భర్తకు, కొడుక్కి కూర వండిపెట్టి, తనకు, మాకు మాత్రం పచ్చడి వేసి సర్దుకోమంటారు. కడుపునొప్పి వస్తే పచ్చడి వలన వచ్చిందనకుండా దెయ్యం పట్టిందేమోనని పిల్ల చిక్కిపోతున్నది అనుకుంటారు" అన్నది.

గ్రామాలలోని పేద వర్గాల ఆడపిల్లల దుస్థితి ఏ విధంగా వున్నదో వాళ్ళు కళ్ళకు కట్టినట్లుగా వివరించారు. గతంలో దేశం వ్యవసాయం చేతనే ఎదుగుతుంది అన్న సత్యం నేడు వారంతా కూలీలై, పేదలై దేశ పురోభివృద్ధికి పనికిరాకుండా పోతున్నారు. గ్రామాలలో పేదరికం, మూఢనమ్మకాలు, వైద్య సదుపాయం కొరత, విద్యావకాశాల కొరత బలంగా వున్నది. పేదవర్గాల ఆడపిల్ల ఉన్నత చదువుల మాట దేవుడెరుగు కనీసం 10వ తరగతి పూర్తిచేస్తే చాలనుకుంటున్నారు. ఆడపిల్లలు పుట్టడం దారిద్ర్యంగా ఇంకా భావించడం శోచనీయం.

ఈ విషయమై నూజివీడు పట్టణ బాలికల ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయిని శైలజగారు మాట్లాడుతూ" గ్రామాలలోని తల్లి తండ్రులు మగపిల్లవాడిని ఇంగ్లీషు మీడియంలోనూ, ఆడపిల్లలను గవర్నమెంటు స్కూళ్ళలోనూ వేస్తున్నారు. అక్కకు ప్రసవమైనా,తల్లి దండ్రులకు ఏమైనా జబ్బుచేసినా, వాళ్ళు పనులకు వలస వెళ్లినా ఆడపిల్లల చదువు మాన్పించివేస్తున్నారు. ఫస్టుక్లాసులో పాసయిన ఆడపిల్లల్ని కూడా గ్రామీణ ప్రాంత పేద వర్గాలు చదవనీయకుండా పెళ్లిళ్ళు చేసేస్తున్నారు. ఆ పిల్లలు తరువాత నాకు ఎపుడైనా కనిపించినపుడు "చదువుకోలేకపోయామని " 18 సంవత్సరాలకే ఇద్దరు పిల్లల్నేసుకుని కనబడుతూ వుంటే నా హృదయం బరువెక్కి పోతుంది. అందుకే నేను నా 26 సంవత్సరాల సర్వీసులో చూసిన దాదాపు 20 వేల పైన విద్యార్థినులకు ఎపుడూ చెబుతూండేది ఒక్కటే. ఎన్ని అవరోధాలెదురైనా చదువుకోవాలి. చదువు ఉద్యోగం కోసమే కాదు మీలో విచక్షణ పెంచుతుంది. మీ సమస్యలకు మీరే దారి చూసుకొనగలరని' ఆవిడ చెబుతూ ప్రభుత్వం ఆడపిల్లల అభివృద్ధికి ప్రత్యేక చర్యలు తీసుకోవాలని కోరుతున్నారు.

మొత్తం మీద ఈ సమస్యలన్నీ విన్న తరువాత ప్రభుత్వం అభివృద్ధి చర్యలు కాగితాలకే పరిమితం చేయకుండా ఆడపిల్లల అభివృద్ధికి పాటుపడాలి.టీవీ ఛానళ్ళలో మూఢనమ్మకాలు పెంచే సీరియళ్ళు రద్దుచేయాలి. ఆడపిల్లల్ని వేధించిన వారికి కఠిన శిక్షలు తక్షణమే విధించాలి. తల్లి తండ్రులలో పుట్టేబిడ్డ ఎవరైనా పరవాలేదనే ధోరణి కల్పించాలి. వరకట్న నిర్మూలనకై తగిన ప్రచారం చేయాలి. దుస్సాంప్రదాయాల వల్లనే స్త్రీ అణగారిపోతున్నది. వాటిలో పెనుమార్పులు తీసుకువచ్చి స్త్రీ పురోభివృద్ధికి తోడ్పడాలి.

కేస్ స్టడీ

# వావి వరుసలు మంటకలిసిన వేళ....




రమేష్ ఒక ఆటో డ్రైవరు. మెట్రిక్యులేషన్ పాసయ్యి ఇంటి బాధ్యతలు మీద పడడంతో మధ్యలోనే చదువు ఆపేసి కుటుంబ భారాన్ని మోస్తున్నాడు. తల్లి తమ్ముడు చెల్లితో చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకున్న రమేష్ కష్టాన్ని నమ్ముకుని జీవిస్తున్నాడు.

తన ఇంట్లోనే చిన్న కుటీర పరిశ్రమను పెట్టుకున్నాడు. మసాలా దినుసులను ప్యాక్ చేసేపని. చుట్టుపక్కల ఆడవాళ్ళు ఆ పరిశ్రమలో పనిచేస్తున్నారు. దినదిన అభివృద్ధి చెందుతున్న తన చిన్నపాటి పరిశ్రమ వల్ల కొంతమందికి ఉపాధి దొరికింది. తలలో నాలుకలాగా వున్న రమేష్ అంటే అందరికి ప్రాణం. అభిమానం.

ఒకనాడు రమేష్‌కు ఒక పెళ్ళి సంబంధం వచ్చింది. అమ్మాయి బిఎ, బిఇడి ట్రైనింగ్ అయ్యింది. అమ్మాయి, అమ్మాయి తండ్రి అందరూ ఇష్టపడి ఈ సంబంధానికి వచ్చారు.

రమేష్ కూడా అనుకున్నాడు తను తక్కువ చదివిన ఎక్కువ చదివిన అమ్మాయిని చేసుకుంటే కుటుంబం బాగా గడిచిపోతుందని. కట్నాలు కానుకలు తీసుకోకుండా ఈ పెళ్ళికి రమేష్ ఒప్పుకున్నాడు. ఎందుకంటే అమ్మాయి ఎక్కువ చదివింది. తనకు చేదోడువాదోడుగా వుంటుంది.

మానసిక వ్యాధి గ్రస్థురాలైన అమ్మాయిని అనారోగ్యాన్ని దాచిపెట్టి పెళ్ళి చేసాడు అమ్మాయి నాన్న.

పెళ్ళయిన 2,3 రోజులకే అమ్మాయి ప్రవర్తన కనిపెట్టాడు రమేష్. పొంతనలేని మాటలు, చేష్టలతో ఆమె సైకిక్ అని అర్థమైంది. తర్వాత అమ్మాయి ద్వారానే కొన్ని విషయాలు తెలుసుకుని అమ్మాయి అనారోగ్యంతో ఏ హాస్పిటల్‌లో అడ్మిట్ అయ్యిందో ఆ హాస్పిటల్ నుంచి అమ్మాయి అనారోగ్యానికి సంబంధించి ఫైలుతో ప్రత్యక్షమయ్యాడు మా లీగల్‌సెల్‌కు. మోసంతో పెళ్ళి చేసారని తన జీవితం నాశనం అయ్యిందని.

మేము అమ్మాయిని పిలిపించాము. అమ్మాయి నోరెత్తి ఒక్కమాట మాట్లాడలేదు. తండ్రి మాత్రం తను జాబు రీత్యా బెంగుళూరులో ఉంటానని ఇక్కడ పిల్లలు తన భార్య తమ్ముడు వుంటారని తను అప్పుడుపుడు వస్తూంటానని చెప్పాడు.

అమ్మాయికి చిన్న యాక్సిడెంట్ అయ్యింది. తలకు చిన్న దెబ్బ తగిలితే హాస్పిటల్‌లో జాయిన్ చేసానని చెప్పాడు. ఆ అబ్బాయి హాస్పిటల్ నుంచి సేకరించిన వివరాలు తెలియదు ఆయనకి పాపం. ఇంకా మోసంతోనే మాట్లాడుతున్నాడు.

అమ్మాయి హాస్పిటల్‌లో ఉన్నపుడు సైనటిక్ ప్రాబ్లమ్‌లో వున్నప్పుడు ఒక పేపర్ మీద వ్రాసుకున్నది. తన తల్లి బాబాయితో కలిసి వుండటం చూసిందట. ఆ సన్నివేశంతో ఆ అమ్మాయి తల తిరిగి పోయిందట. తట్టుకోలేక విషం తాగిందట. పాపం దేవుడికి మొరపెట్టుకుంటూ వ్రాసుకుంది. ఆ కాగితాన్ని కూడా రమేష్ సంపాదించాడు. "అమ్మాయికి మందులు ఇప్పించాం తక్కువైంది" అంటాడు తండ్రి. "ఏం తక్కువ కాలేదు ఒక్క దోశ చెయ్యాలంటే 40 నిమిషాలు చేస్తుంది అసలు వంటనేరాదు. అంతా వుల్టా చేస్తుంది పనులు. అయినా నేను కష్టాలు పడుతూ జీవితంలో పైకి వచ్చాను. జీవితాంతం ఈ కష్టాలు ఎందుకు నాకు విడాకులిప్పించండి" అని ప్రాధేయపడుతున్నాడు.

ఇక అమ్మాయి పరిస్థితి చూస్తే "నాకు నా భర్తనే కావాలి" అని అడుగుతుంది. మనం ఏమి చెయ్యాలి? అమ్మాయికి టైం ఇవ్వాలయ్యా కొద్దిగా కొన్ని రోజులు నీ ఇంటికి పిలిచి పనులు అవి నేర్పించి అమ్మాయి పరిస్థితి బాగుంటుందేమో ఇలా చేయండి అని రమేష్‌కు సలహా చెప్పాం. అలానే చేసాడు రమేష్. కానీ ఏమీ మార్పురాలేదు. అందుకు రమేష్ ఆ అమ్మాయి వాళ్ళ ఇంటికి పంపించి మన దగ్గరికి పనిచేసే వాళ్ళను తీసుకువచ్చి కలిసాడు. వాళ్ళందరూ ( అంటే రమేష్ చిన్న పరిశ్రమలో పనిచేసేవాళ్ళు) రమేష్ చాలా మంచివాడని అలాంటి రమేష్‌కు మోసంతో పెళ్ళిచేసి కష్టాలపాలు చేసారని. ఈ సంబంధం వద్దని అందరూ చెప్పారు. గతంలో బాగున్నారు అనేటట్టు లేదు. అమ్మాయి మానసిక జబ్బులో వుంది. ఏం మాట్లాడదు.

ఒక పేషెంటును జీవితంలో అష్టకష్టాలు పడి పైకి వస్తున్న అబ్బాయితో కలిసి వుండమని చెప్పలేం.

చేసినంత చేసి నిమ్మకు నీరెత్తినట్టు వున్న ఆ అమ్మాయి తండ్రిని చూస్తే చీవాట్లు వేయబుద్ది అయ్యింది. జీవితాలతో చెలగాటాలంటే ఇదే. ఆ అమ్మాయి వ్రాసుకున్న ఉత్తరాన్ని మాకు చూపించాడు కానీ ఈ తండ్రికి తెలియదు తన భార్య అక్రమ సంబంధం గూర్చి. చూడండి రమేష్‌ది ఎంతగొప్ప మనస్సో!!.

అందుకు మేము ఒక నిర్ణయానికి వచ్చాం. రమేష్‌కు లీగల్‌గా ప్రొసీడ్ కమ్మని చెప్పాము. పాపం ఆ అమ్మాయి పరిస్థితి బాధాకరమే! కానీ పిల్లల సమస్యలను కన్నతల్లి తండ్రులే భరించాలి . అది ఇతరుల మీద రుద్ది బలిపశువుల్ని చేయరాదు. అయినా అమ్మాయి బిఇడీ ట్రైనింగ్ చేసింది. తన మానసిక పరిస్థితి బాగా అయితే టీచర్‌గా కొనసాగగలదు అంతేకాని బలవంతంగా ఇద్దరిని కలిసి వుండమని చెప్పలేం కదా! లీగల్‌సెల్‌గా అదేచేసింది.

# శుభమ్ కలుగుగాక

ప్రకృతి సోయగాలతో, కోయిల రాగాలతో
షడ్రుచుల సమ్మేళనంతో, కోటి ఆశల కొత్త ఊహలతో
ఆరంభమైన శ్రీఖర నామ సంవత్సరం
అందరిలో వెల్లి విరియాలి సుఖ సంతోషాల సంబరం



## ఉగాది శుభాకాంక్షలు

సంస్కారవంతమైన
సోప్






# కథ చెప్తే ఊ.....కొడతారా!

- కె. అంజన



ఆకాశంలో పిండారబోసినట్టు పండు వెన్నెల. అప్పుడప్పుడు వచ్చి చల్లగా పలుకరించి వెళ్ళే చిరుగాలి. ఆరుబయట వరుసగా వేసిన మంచాలు. అమ్మమ్మ రాకకోసం వెయ్యికళ్ళతో ఎదురుచూసే చిన్నారులు. ఉదయం నుంచి ప్రియాతిప్రియమైన మనవళ్ళు, మనవరాళ్ళకు ఇష్టమైన వంటకాలు చేసిపెట్టడంలో తీరిక లేకుండా వున్న ఆమె..... పని ముగించుకొని చేతులు తుడుచుకుని వస్తుండగానే...... పరుగు పరుగున వెళ్ళి చుట్టూ చేరి చేతులు పట్టుకుని తీసుకొచ్చే పిల్లలు. తర్వాత అమ్మమ్మ పక్కన వెచ్చగా పడుకొని ఆమె చెప్పే కథలు వింటూ....ఊ కొడుతూ.... నిద్రలోకి జారుకునే దృశ్యం మెల్లగా అస్పష్టమవుతోందా అనిపిస్తోంది.

కథలు చెప్పటం ఎందుకు తగ్గిపోతోంది? అసలు పిల్లలకు కథలు ఎందుకు చెప్పాలి? ప్రయోజనాలేంటి? కథ ఎప్పుడు పుట్టింది? ఎన్ని రకాల కథలున్నాయి? కథ ఎలా, ఎప్పుడు చెప్పాలి? వంటి వివరాలు వేసవి సెలవుల సందర్భంగా....

కథ మనిషిని ఏడు సంద్రాల ఆవలకు తీసుకెళుతుంది. మాట్లాడే చిలుక గురించి చెప్తుంది. పిల్లలను పట్టుకెళ్ళే ఒంటికన్ను బ్రహ్మరాక్షసిని చూపిస్తుంది. మంత్రాల మర్రి మానును పరిచయం చేస్తుంది. మహామహా ఎత్తులను కూడా తన జిత్తులతో చిత్తు చేసే నక్కమామతో స్నేహం కలుపుతుంది. అనుకున్నది సాధించడానికి ఎన్ని కష్టాలు పడడానికైనా సిద్ధం అవమంటుంది. అలాంటి కథలు చెప్పడం ఇప్పుడు ఎందుకు తగ్గుతోందబ్బా....

**మారిన కాలం**

" అమ్మా! కథ చెప్పవూ....! అని పిల్లలు గారాబంగా నోరు తెరిచి అడిగారనుకోండి....

'నాన్నా ! ఇంకా పని కాలేదురా....'

' ఇవాళ ఆఫీసులో పని ఎక్కువగా ఉండి నీరసంగా వుందమ్మా. రేపు చెప్తాలే'

వంటి ఎన్నో రకాల సమాధానాలు చిన్నారులను నిరాశపరుస్తాయి. ఇలా వరుసగా జరిగితే ఆ చిన్నారులు మరి అడుగుతారా! ఊహూ. వాళ్ళు కూడా పెద్దల సరసన టీవీలకు అతుక్కుపోతారు. ఎందుకిలా అవుతోంది? అమాయకంగా కథ చెప్పమని అడిగే పిల్లలకు కథ ఎందుకు చెప్పలేకపోతున్నామంటే......బిజీ బిజీ. బిజీ లైఫ్ కారణమంటారు. పెద్ద కుటుంబాలు విచ్ఛిన్నం కావడం.... బతుకు పోరులో భాగంగా పల్లెల నుంచి పట్టణాలకు వలస రావటం..... ఉదయం లేచింది మొదలు నాలుగు మెతుకులు వండి పడేసి ఉద్యోగాలకు పరుగు తీయాల్సి రావడం.... పొద్దంతా పనిచేసి బస్సుల్లో పడి తిరిగి వచ్చేసరికి అలసిపోవడం...... మళ్ళీ సాయంత్రం వంట ఏర్పాట్లు.... ఇలా ఎన్నో కారణాలు వుంటాయి. పిల్లలు మాత్రం తీరిగ్గా వుంటున్నారా? వాళ్ళూ యమా బిజీ. పొద్దున్నే ట్యూషన్. తర్వాత స్కూల్. వచ్చేక మళ్ళీ ట్యూషన్. హోంవర్క్. అదనపు కోచింగ్‌లు... ఇంకా ఏమైనా సమయం మిగిలితే టీవీలు, వీడియో గేమ్స్ వుండనే వున్నాయి. ఇంక కథ చెప్పేవారెవరు? విని ఊ కొట్టే వారెవరు? కానీ పిల్లలకు కథ చెప్తామంటే మాత్రం టీవీలు, వీడియో గేమ్స్ మూలకు విసిరేసి రారా ఊ కొట్టడానికి.

ఎన్ని లాభాలో...

**నడతను మార్చే కథలు:** ఇదివరలో పిల్లలను నిద్రపుచ్చడానికో అన్నం తినిపించడానికో అమ్మమ్మ, తాతయ్యలు కథలు చెప్పేవారు. వాటి వల్ల లాభాలు అన్నీ ఇన్నీ కావని తెలిస్తే ఎవరు మాత్రం కథలు చెప్పకుండా వుంటారు చెప్పండి! కథల ద్వారా పిల్లలకు మంచి చెడులు తెలుస్తాయి. బంగారం లాంటి భాష, సంభాషణా చాతుర్యం, ఎత్తులు, పై ఎత్తులు, లోకజ్ఞానం, నడతను నేర్పేవి కథలు.

**తర్కం- జ్ఞాపకశక్తి:** కథలు పిల్లల్లో తర్కాన్ని పెంచుతాయి. జ్ఞాపకశక్తిని వృద్ధి చేస్తాయి. ఏడు చేపల కథే చూడండి. ' అనగనగా ఒక రాజు అంటూ మొదలై...... రాజుకు ఏడుగురు కొడుకులు. ఏడుగురూ వేటకెళ్ళి ఏడు చేపలు తెచ్చి ఎండబెట్టారు. అందులో ఒక చేప ఎండలేదు. చేపా చేపా ఎందుకెండలేదు'?... అంటూ సాగే కథ వినని పిల్లలుండరంటే అతిశయోక్తి కాదు. అది హిమాలయాలంత పాతది. ముని మనవణ్ణో, ముని మనవరాలినో ఒళ్ళో కూర్చోబెట్టుకుని కొన్ని వేల సంవత్సరాలుగా ముత్తాతలు, అమ్మమ్మలు, తాతయ్యలు, నాన్నమ్మలు ఈ కథ చెప్తున్నారు. కథల్లో కొన్ని పదాలు, పేర్లు పునరావృతం కావడం, ప్రశ్నించడం, వాటిని తిరిగి అదే క్రమంలో గుర్తుతెచ్చుకోవాల్సి రావడం వంటివన్నీ పిల్లల్లో తర్కాన్ని, జ్ఞాపకశక్తిని పెంచుతాయి. ఇది భవిష్యత్తులో పిల్లల చదువుకు, కెరీర్‌కు ఎంతగానో ఉపయోగపడతాయి.

**మధురానుభూతి:** కథలు చెప్పకపోవడం పూర్తిగా పెద్దల తప్పిదమే. పావుగంటో, అర్ధగంటో పిల్లల పక్కన కూర్చుని వారి కళ్ళల్లోకి చూస్తూ.... ఆప్యాయంగా వారి భుజంమీద తడుతూ తల వెంట్రుకలు సరిచేస్తూ కథలు చెప్పడం అనేది పిల్లలకే కాక పెద్దలకు కూడా ఒక విధమైన ఆత్మీయనుబంధాన్ని పెంచుతుంది. కథలు చెప్పడం, వినడం తల్లీ బిడ్డలకు ఒక మధురమైన అనుభూతి. తల్లితండ్రుల్లో ఎవరో ఒకరు ఈ బాధ్యతను తీసుకోవాలి. పిల్లల వయసుతోపాటు వారి కథల ప్రపంచాన్ని విస్తృతం చేసుకుంటూ పోవాలి. వారంతట వారు చదవగలిగే వయసు వచ్చినా పక్కన పెద్దలు ఎవరో ఒకరుండాలి. ఒంటరిగా వదిలేస్తే ఆసక్తి పోతుంది. అదే పెద్దలు పక్కనుంటే వారికి వచ్చే సందేహాలను అక్కడికక్కడే నివృత్తి చేయవచ్చు. పైగా కథలోని నీతి గురించి చర్చించే అవకాశం కూడా పెద్దలకు వస్తుంది. పరోక్షంగా వారికి విలువల గురించి నేర్పడానికి ఇదో మంచి మాధ్యమం. పైగా కథ గురించి జరిగే చర్చవల్ల పిల్లలకు పెద్దలకు మధ్య చక్కని అనుబంధం ఏర్పడుతుంది. ఇదో తీపి జ్ఞాపకంగా అలా మనోఫలకాలపై ముద్రపడిపోతుంది.

**భాష నేర్పుతుంది:** భాష నేర్పడానికి, నేర్చుకోవడానికి గొప్ప సాధనం కథ.... పెద్దలు చెప్పే కథల్లో... లోకజ్ఞానం నుంచి, జీవితానుభవం నుంచి పుట్టుకొచ్చే సరళమైన భాష పిల్లలను ఆకట్టుకుంటుంది. ఫలితంగా వారికి చక్కటి భాష అలవడుతుంది.



పదజాలం పెరుగుతుంది. ఇతరులతో ఎలా మాట్లాడాలో? తమ మనసులోని మాటను ఎలా చెప్పాలో? తెలియజేస్తుంది. ఇవన్నీ వారి భవిష్యత్తుకు ఎంతో ఉపయోగకరం.

**మంచి వ్యక్తిత్వం:** చిన్నారులు వినే కథల్లో మంచి చెడులు వుంటాయి. ఎక్కువశాతం మంచిదే పైచేయి అవుతుంది. పిల్లలు కూడా తమకు తెలీకుండానే మంచి వట్ల, మంచి కోరే, మంచి చేసే కథానాయకుడి పట్ల ఆకర్షితులవుతారు. తాము కూడా అలాగే వుండాలనుకుంటారు. అలా వారికి మంచి చెడులు తెలుస్తాయి. ఏది చేయొచ్చో... ఏది చేయకూడదో తెలుస్తుంది. మొత్తం మీద వారికి మంచి వ్యక్తిత్వం అలవడుతుంది.

**ప్రశ్నించడం:** కథ చెప్తూనే మధ్యలో ఆపి... అలా ఎందుకు జరిగింది? ఇప్పుడు రాజుకేమౌతుంది? యువరాజు మంత్రాల మామిడిపండును సంపాదించి యువరాణిని కాపాడతాడా? అసలు ఇప్పుడు దొంగల బారి నుంచి బయటపడటమెలా? వంటి ప్రశ్నలు వేస్తూ.... సమాధానాలు చెప్పిస్తుంటే వారికి ఊహ, ఆలోచన, సృజన పెరుగుతుంది. తర్వాత్తర్వాత వారు కూడా కథలో అలా ఎందుకు జరగకూడదు? ఇలా జరిగితే బావుండేది కదా! అని అడగటం మొదలు పెడతారు. ఇది వారిలో ప్రశ్నించే స్వభావాన్ని ఊహాశక్తిని పెంచుతుంది.

**నీతి- విలువలు:** ప్రతి కథలోనూ నీతి వుంటుంది. అది లేకుండా అస్సలు కథే వుండదు. పిల్లలకు వాటి గురించి కూడా స్పష్టంగా అర్ధమయ్యేలా చెప్పాలి. ఉదాహరణకు పొద్దస్తమానం పోట్లాడుకునే పిల్లలు ' షిరో కురో' కథ చెప్పామనుకోండి. ఎప్పుడూ పోట్లాడుకుంటే నష్టపోతాం. అదే చక్కగా కలిసి వుంటే ఇన్ని లాభాలున్నాయని వారికి తెలుస్తుంది. అసలు వీటి ద్వారానే మనుషులు ఎలా ప్రవర్తిస్తారు? ప్రవర్తించాలి? వంటివి తెలుస్తాయి. వాస్తవానికి నీతి, విలువలను పసివయసుల్లో పిల్లలకు అర్ధమయ్యేలా చెప్పడం కష్టమైన పని. అదే కథల రూపంలో అయితే చక్కగా చెప్పొచ్చు.

**ధైర్యసాహసాలు:** కథల్లో రాక్షసుల్ని సైతం అమాంతం చంపేసే సామాన్యులు, భయపెట్టే పులుల్ని కూడా మట్టి కరిపించే కథానాయకులు వారి సాహసకృత్యాలు పిల్లలను ఆకట్టుకుంటాయి. ఏదైనా ఆపద వచ్చినా తెలివితేటలతో, ధైర్యసాహసాలతో ఎలా ఎదుర్కోవాలో తెలియచెప్తాయి.

**వ్యక్తిగత పరిశుభ్రత:** పిల్లలకు పరిశుభ్రత, ఆరోగ్యం గురించి అవగాహన కలిగించే విషయాలను యథాతథంగా చెప్తే వారు అంతగా ఎక్కించుకోరు. అదే కథల ద్వారా అయితే చక్కగా వింటారు. అవలంభిస్తారు కూడా. ఒకవేళ పాటించకపోతే... అదిగో ఈ కథలో టింకూ ఏం చేశాడు? ఎంత శుభ్రంగా వుండేవాడు? అంటూ గర్తు చేస్తే చాలు. ఫాలో అయిపోతారు.

**వినోదం, విజ్ఞానం:** అసలు కథల నుంచి అందే విజ్ఞానం, వినోదం అంతా ఇంతా కాదు కదా. ఎంత హాస్యం వుంటుంది వాటిలో. అవన్నీ కథలు వినే పిల్లల్నే కాక

చెప్పే పెద్దలను కూడా చక్కగా మనసారా నవ్వుకునేలా, ఆస్వాదించేలా చేస్తాయి. టెన్షన్‌ను ఇట్టే మాయం చేస్తాయి.

**మానవత్వం:** కష్టాల్లో వున్నవారిని ఆదుకోవటం, చేతనైన సాయం చేయడం వంటి మానవీయ లక్షణాలను అలవర్చే గొప్ప మాధ్యమం కథే.

**ఎలా చెప్పాలి?**

కథ ఏదైనా సరే.... ఆనంతంగా, అనుభూతిని కలిగించేలా చెప్పాలి. ఊరిస్తూ చెప్పాలి. మాటల్లో అందం. వర్ణనలో అందం. వివరణలో అందం. మౌనంలో అందం. పాత్ర చిత్రణలో అందం. సన్నివేశ కల్పనలో అందం. ఎత్తుగడలో అందం. నడకలో అందం. ముగింపులో అందం తొణికిసలాడాలి. తర్వాత ఏమౌతుందబ్బా.....అనిపించాలి. కథ వినే చిన్నారులు కదలకుండా, మెదలకుండా కథ ఆసాంతం వినాలి. కథ సరళంగా, మనోహరంగా వుండాలి. సందర్భాన్నిబట్టి కథ చెప్పేవారి స్వరంలో హెచ్చుతగ్గులు రావాలి. అప్పుడప్పుడు నటనను కూడా కలపాలి. మొత్తంమీద సులభంగా అర్థమయ్యేలా, ఆకర్షణీయంగా వుండాలి. అలా చెప్పాలి కథ.

**ఏం చెప్పాలి**

కథలు పిల్లల మెదడులో కొన్ని మౌలికమైన భావాలను బలంగా నాటుతాయి. ధైర్యసాహసాలూ, నిజాయితీ, స్నేహపాత్ర, త్యాగబుద్ధీ, కార్యదీక్షా, న్యాయమూ మొదలైనవి జయించడం ద్వారా సంతృప్తిని కలిగించే కథలు ఎంత అవాస్తవంగా వున్నా పిల్లల మనస్సులకు మేలు చేస్తాయి. దురాశా, ఓర్వలేనితనం, అధికార గర్వమూ, క్రూరత్వమూ, కృతఘ్నతా, అధర్మమూ, స్వార్థమూ వంటివి శిక్షించడం కూడా పిల్లలకు తృప్తినివ్వాలి. కొన్ని కొన్ని సద్గుణాలు ఒక్కొక్క సమయంలో దౌర్బల్యంగా పరిణమించడమూ ప్రమాదం తెచ్చిపెట్టడమూ జరుగుతుంది. భూతదయ చాలా మంచిది. నిస్సహాయుల పట్ల జాలి చూపడం వరకు ఇబ్బంది లేదు. కానీ దుర్మార్గుల పట్ల చూపే దయ ప్రమాదాలకు దారితీస్తుంది. అందుచేతనే బోను నుంచి పులిని విడిపించిన బ్రాహ్మడి కథలో ముఖ్యాంశం బ్రాహ్మడి జాలి తెచ్చిపెట్టిన ప్రమాదమే. ఆ ప్రమాదాన్ని నక్క యుక్తిగా తప్పిస్తుంది. రాక్షసులను మనుషులు జయించడమూ ధనికులను వాళ్ళ సేవకులు భంగపరచడమూ అతి సామాన్యమైన వ్యక్తులతో అసాధారణ శక్తులుండటమూ లేదా వారికి అవి లభ్యం కావడమూ వంటి జానపద కథలు ప్రపంచమంతటా వున్నాయి. వాస్తవ సాంప్రదాయాలకు ఎదురువెళ్ళే ఈ కథలు పిల్లలకు దొంగల భయమూ, దయ్యాల భయమూ తగ్గిస్తాయి. దేవుడి మీద భక్తి, మతవిశ్వాసాలూ నిండిన కథలు పిల్లలకు చెప్పడం మంచిదికాదు. కథల్లో దేవతలూ, భక్తులూ వుండకూడదని కాదు. దేవుణ్ణి నమ్ముకుంటేఅన్ని సుఖాలు అందుతాయని పెద్దలు అనుకోవడం ఎంత తప్పో, దాన్ని పిల్లలకు చెప్పడం అంతకు పదింతల తప్పు. కథల్లో నెగ్గవలసింది మానవ ప్రయత్నమూ, మనిషి సద్బుద్ధీ. ఇది చాలా ముఖ్యం., కథలోని పాత్రలు చాలా మంచివాళ్ళైనా కావాలి. చాలా చెడ్డవాళ్ళైనా కావాలి. చాలా తెలివిగలవాళ్ళైనా కావాలి. వట్టి మూర్ఖులైనా కావాలి. ఇవి చిన్నారులకు విజ్ఞానం, వినోదం అందించి వారి వికాసానికి చక్కగా తోడ్పడతాయిమరి.

**మళ్ళీ మొదలెడదాం!**

బిజీలైఫ్ అనీ అదనీ ఇదనీ ఎన్ని కారణాలున్నా..... మళ్ళీ చిన్నారులకు కథలు చెప్పటం మొదలెడదాం. కథలు వింటూ ఊ కొట్టే వారి కళ్ళల్లో ఎన్ని మెరుపులు కనిపిస్తాయో చూడండి. అది చూడ్డానికే కదా మనం ఎంత కష్టపడ్డా. అలాంటి అవకాశాన్ని వదులుకుంటామా ఏంటి?! 'అందుకే కథ చెప్తాం ఊ కొడతారా?' అని అడిగి చూడండి. వారి అమాయకపు కళ్ళల్లో ఎంత సంతోషమో గమనించండి.

**కథ పుట్టుక (బాక్స్1)**

కథ చెబుతాను 'ఊ' కొడతావా? అన్న మాట వినకుండా ఐదవ సంవత్సరం దాటని పిల్లలు వుండరంటే అతిశయోక్తి కాదు. ప్రపంచంలో వున్న అన్ని భాషల వాళ్ళు కథలు చెప్తారు. కథలు రాస్తారు. అసలు కథలంటే చెవి కోసుకోని పిల్లలుంటారా చెప్పండి? అంతటి ఇష్టాన్ని పసిబిడ్డనుంచి పళ్ళూడిన ముదుసలి వరకు కలిగించే ఈ ప్రక్రియ ఎప్పుడు ఎలా పుట్టింది? మనిషి ఆయుష్షు నూరేళ్ళే! కానీ కథ ఆయుష్షు కొన్ని లక్షల సంవత్సరాలు! ఏనాడు పుట్టిందో తెలియని కథ నేటికీ సమాజాన్ని ఆనందపరుస్తోంది. ఆశ్చర్యపరుస్తోంది. విజ్ఞానాన్ని అందిస్తోంది. అక్షరం పుట్టకముందు ఇంకా చెప్పాలంటే భాష పుట్టకముందే కథ పుట్టింది. ఆదిమ కాలంలో స్త్రీలు, పురుషులు కూడా వేటకు వెళ్ళేవారు. పులినో, ఎలుగునో, ఎనుబోతునో వేటాడేవారు. అది ఒక సాహసకృత్యం. అది చేసిన వారు, దాన్ని చూడనివారికి, గుహలోనే వుండిపోయినవాళ్ళకు వివరించి చెప్పే ప్రయత్నమే కథగా అవతరించింది. వున్నది వున్నట్టుగా చెబితే అది కథ కాదు. కొంత వాస్తవం, కొంత కల్పన, కొంత అతిశయోక్తి కలిపి చేప్పే తాపత్రయం మారుపేరే కథ. ఒక్క వాక్యంలో చెప్పుకోవాలంటే....మానవుని ఊహ ఏనాడు రెక్క విప్పుకున్నదో ఆనాడే పుట్టింది కథ. కాదేదీ కథకనర్హం. జగత్తు మొత్తం కథగా మారింది. బెట్టుకథ, పుట్టకథ, గుట్ట కథ, రట్టు కథ, చెట్టుకథ, పిట్టకథ, తిట్టుకథ ఇలా పుంఖానుపుంఖాలుగా కథలు పుట్టుకొచ్చాయి. ప్రకృతిలో తనకు అర్థం కాని ప్రతి విషయాన్ని మానవుడి మస్తిష్కం రకరకాల ఊహలు చేసి,ా ఊహలకు ఊపిరిపోసి, ఆ ఊపిరికి అక్షరరూపం ఇస్తే మన హృదయాలలో రూపుదిద్దుకున్నదే అచ్చమైన కథ.

**ఎన్ని కథలో....(బాక్స్2 )**

అబ్బ ఎన్ని కథలున్నాయో! వాటిలో మనం విన్నవి సముద్రంలో బిందువంతే. అసలు ఎన్ని రకాల కథలున్నాయో కదా. పౌరాణిక కథలు, జానపద కథలు, చారిత్రక కథలు. సాంఘిక కథలు. పురాణాల నుంచి చెప్పుకునే కథలు. చరిత్రలో వీరులు, శూరులుగా ప్రసిద్ధి చెందిన వారి గురించి చెప్పుకునే కథలు చారిత్రక కథలు. ఇక జానపద కథల్లో మనుషులు, దేవతలు, దెయ్యాలు, జంతువులు అన్నీ పాత్రలే. మనకు పధ్నాలుగు లోకాలుంటే జానపద కథలో స్వర్గం, పాతాళం, భూలోకం ఎక్కువగా చోటు చేసుకుంటాయి. ఉత్కంఠ, విస్మయం ప్రధాన లక్షణాలుగా కనిపిస్తాయి. గాల్లో ఎగిరే గుర్రాలు, చాపలు, చెప్పులు వేసుకుంటే మనుషులు కనిపించకుండా పోవటం, ఈనాటి దూరదర్శనయంత్రాల్లాంటి అద్దాలు, ఆ అద్దాల్లో మాంత్రికుడికి కావలసిన రాజకుమార్తె కనిపించడం, ఆకు పసరు పూసుకుని మాయమైపోవడం వంటి విచిత్ర సన్నివేశాలు అడుగడుగున కనిపిస్తాయి. సాధారణంగా ఇవి అనగనగా ఒక ఊళ్ళో అనో అనగనగా ఒక పేదరాశి పెద్దమ్మ వుందనో, అనగనగా ఒక భూతం వుందనో, అనగనగా ఒక రోజు అనో ప్రారంభించి కథ కంచికి మనం ఇంటికి ఇక పడుకో అని ముగిస్తుంటాం. సాంఘిక కథల విషయానికొద్దాం. మన చుట్టూ వున్న సమస్యలు, ఈతి బాధలు.....వాటి పరిష్కారాలకు సంబంధించినవి

# తిరోగమనమే కాదు-చట్టవ్యతిరేకం కూడా

- ఆండాళ్

అతి వైభవోపేతంగా దాదాపుగా 22 కోట్ల రూపాయల ఖర్చుతో జూనియర్ ఎన్టీఆర్ పెళ్ళి జరిగింది. తెలుగు న్యూస్ ఛానల్స్ వారంతా శ్రీ సీతారాముల కళ్యాణాన్ని కెమెరాల నిండుగా చూసి అది చాలదనుకొని తెలుగునాట ప్రతివారూ చూసి తరించేలా ప్రసారం చేసారు. ఈ కుటుంబ అభిమానులు బుల్లితెరల ముందు కదలకుండా కూర్చుని ఆనంద భాష్పాలతో పులకించిపోయారు. ఒక ఛానల్ ప్రారంభకుడయిన అతి ధనవంతుని కుమార్తెతో ఒక గ్లామర్‌కు పెళ్ళి జరిపించి రాజకీయ బంధాన్ని ముడివేసిన నేత అమ్మయ్య! వచ్చే ఎన్నికల్లో పార్టీ నిధికీ, ప్రచారానికి ఆనరా గ్యారంటీ అనీ ముసిముసిగా నవ్వుకున్నారు.

వరుడి పాదాలు సాక్షాత్తు లక్ష్మీనర్సింహ స్వామి పాదాలనిన్ని, వాటిని కడగటం కన్యాదాత (?) పూర్వజన్మ సుకృతం అనిన్ని, ఆ కడిగిన నీళ్ళు నెత్తిన జల్లుకుంటే జన్మధన్యం అవుతుందనీ- పట్టుచీరలు,చమ్కీ సల్వార్ కమీజులపై కండువాలు ధరించిన (ఇది ఏ తెలుగు సాంప్రదాయమో మనకు తెలియదు. దాన్ని మార్వాడీ డ్రస్సంటాం అచ్చ తెలుగులో) స్త్రీ పురుష యాంకర్లు భక్తి ప్రపత్తులతో వంకర్లు తిరిగిపోతూ పదేపదే వక్కాణించారు. "కాళ్ళు కడిగితే ఏమొస్తుందమ్మా? అనడిగాడు ఓపిల్లవాడు తల్లిని. ఇది చూసి అడిగాడని తెలియక ఆ తల్లి "ఏమొస్తుంది మట్టితప్ప" అని జవాబిచ్చింది. " మరి మట్టినీళ్ళు నెత్తిన పోసుకుంటున్నారెందుకమ్మా? తర్వాత తలంటు పోసుకుంటారా? అని మరో సందేహం వెలిబుచ్చాడు. ఎంత న్యాయమయిన ప్రశ్నలు. ఎంత వాస్తవమయిన జవాబు. ఈపాటి మహామేధావులయిన ఛానల్స్ వారికి తెలియకకాదు. అమ్ముకోవటమే ధ్యేయం కదా! అందుకని ఉచితానుచితాలు మర్చిపోతారు.

అమ్మాయిని దానం చేయటం ఏమిటి? ఆడపిల్ల వస్తువా? పశువా? ఈ మాత్రపు జ్ఞానం ఎందుకురావటం లేదు? పైగా దాన్నొక మహత్తర విషయంగా అభివర్ణించి చెప్పడం. వరుడి కాళ్ళు కడిగి "మహాప్రభో! నాఖర్మకాలి నాకొక ఆడపిల్ల ఉంది నీవు దాన్ని తీసుకుపో....దానికి పిల్లల్ని కని ఉద్ధరించు....అపుడు నేను పుణ్యలోకాలకు పోతాను" అన్నాడన్నమాట. అందుకోసంగాను రెడీ క్యాష్ ఎవరికీ తెలియకుండా ఓ 250 కోట్లు......(పెళ్ళి కానుకగా నంట) అసలు కట్నంగా వేలకోట్ల ఆస్తి ఇచ్చారని గుసగుసలు.....పెళ్ళిలోనే ఏనుగు మోసేంత బరువుగల బ్రాస్‌లెట్ (చేతికంకణం) వజ్రాలూ పాడుబీడూ పొదిగింది- వరుడి చేతికి తొడగటం, ఓడలకేసే మోకులాంటి గొలుసుని అతని మెడలో వేయటం-పదేపదే చూపి రాష్ట్రంలో మగపిల్లలంతా అయ్యో! మాకెరిస్తారు అని కుంగిపోయేంత ప్రచారం ఇచ్చారు. అమ్మాయి నగలు, చీరలు ఓహో చెప్పనక్కరలేదు. (కాకపోతే మొహంలో ఏమాత్రం చిరునవ్వులేదు కాని) ఆర్భాటాలు మెరిసిపోయాయి.

ఇటీవలే ఇంకో పెళ్ళి జరిగింది. దానికీ ఇంతే ప్రచారం ధూంధాం ఛానల్స్ అన్నీ..........

నిజం చెప్పాలంటే దీన్ని " వల్గర్ డిస్‌ప్లే ఆఫ్ వెల్త్"...సంపదని అశ్లీలకర స్థాయిలో ప్రదర్శించటం అనాలి. పెళ్ళిళ్ళ పేరిట జరుగుతున్న ఈ వృధాని ఒక్కరూ ప్రశ్నించకపోవటం విచారకరం. వీళ్ళు సమాజంలో యువత అనుసరించే హీరోలుగా వుండి ఇటువంటి పనులు చేయటం సిగ్గుచేటు. ఇటువంటి కట్నాలు, కానుకలు స్వీకరించటం వరుడి అభిమానానికి దెబ్బకాదా! వ్యక్తిత్వం లేనితనం కాదా! అసలు ఇంత అలవిమాలిన తనంగా ఖర్చుచేసేంత డబ్బు ఎక్కడినుండి పోగువడింది వీరికి? నిజాయితీగా కష్టపడిన సొమ్ముని అడ్డగోలుగా ఎవరూ ఖర్చుచేయరు. ఇదే ఉదాహరణగా తీసుకుని తమతమ స్థాయిల్లో వరులు అమ్మాయి తల్లితండ్రుల్ని అదనపు కానుకల కోసం వేధించరా? వరకట్న కానుకల నిషేధ చట్టాలు, పెళ్ళిఖర్చు పరిమితి సూత్రాలు ఉన్నాయని, వాటిని అమలుచేయాలని ఏ అధికారికీ, ప్రజాప్రతినిధికీ తట్టలేదా? అసలవి ఉన్నాయని తెలుసా? ప్రజాప్రతినిధులుగా చట్టాలను అమలుచేయాల్సిన బాధ్యత వారికి లేదా? ఈ రెండు పెళ్ళిళ్ళ కుటుంబాలు రాజకీయకుటుంబాలు కూడాను. రాజకీయ నాయకులు హాజరయిన పెళ్ళిళ్ళివి. ఏ ఒక్కరూ ఈ రకం అయిన పెళ్ళిళ్ళు చట్టాన్ని అతిక్రమించి నేరం చేసాయని ఏ మాత్రం భావించటంలేదంటే... స్త్రీల రక్షణా చట్టాలు ఎందుకు మురికి కాల్వల్లో పడుకున్నాయో అర్ధం అవుతోంది.

"సాంప్రదాయ బద్ధంగా వివాహం చేసుకున్నందుకు సంతోషంగా ఉందని" స్టేట్‌మెంటు. అసలు ఆయన తల్లితండ్రులు సాంప్రదాయాన్ని పాటిస్తే ఇతని ఉనికి ఉండేదా? ఏ సంతానం అక్రమ సంతానం కాదు. తల్లితండ్రులు చేసిన వాటికి బిడ్డలు ఏ మాత్రం బాధ్యులు కాదు, కానీ సాంప్రదాయేతరంగా ఉన్న కుటుంబం నుండి వచ్చినందువల్లనే ఈ ప్రశ్న లేవనెత్తడం కనీసం వారు చట్టాన్ని గౌరవించినా ఇతను జన్మించి ఉండేవాడుకాదు. ఆక ఆ రెండో వివాహం కులాంతరం..(గ్రుడ్డిలో మెల్ల) కాని అది సాంప్రదాయమా? కాదు కదా! మరి దానికి అయిదురోజుల వ్యవహారం సాగతీతని ఏమనాలి...

ఇవి కాకుండా ఓ వ్యాపారస్తుడు ఈ మధ్య కాలంలో ఢిల్లీలో తన ఇద్దరు కొడుకులకీ వెయ్యికోట్లు ఖర్చుపెట్టి ( ఇది అధికారిక అంచనా) పెళ్ళిచేస్తే దానికి ఢిల్లీ రాజకీయ పెద్దలంతా పోయి విందులు కుడిసి వచ్చారు. ఆహ్వానం రానివారు రికమండేషన్ పెట్టుకుని మరీ ఆహ్వానాలు తెప్పించుకుని మరీ వెళ్ళారట. ఆహా! చట్టాలు రాసిన కాగితాల్ని చలిమంటలు వేసుకుంటే మంచిదేమో!

ఎందుకంటే బాలికల సంఖ్య పడిపోతున్నది? వారసులు కావాలి. 'కొడుక్కి' ప్రాధాన్యతనిచ్చే ఆధిపత్య సంస్కృతి పెరుగుతున్నది. ఇది ఎట్లా పెరుగుతుంది? పై ప్రశ్నలు సంధించే మీడియా ఇటువంటి తప్పుడు సంకేతాల్నిచ్చే వివాహాల్ని భీభత్సంగా వర్ణించి చూపడం ద్వారా కాదా? కాళ్ళు కడగటం, కన్యాదానం చేయటం అనేది మగవాడి గొప్పనీ, ప్రాధాన్యతనీ నిలబెట్టుకోవడానికి ఉద్దేశించిన క్రతువుకాదా? సాంప్రదాయ వివాహాలు, పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్ళు ఉమ్మడి కుటుంబాల వంటి కాలం చెల్లిన ఆచారాల్ని తవ్వి బయటకు తీసి ప్రాణం పోయటం అంటే స్త్రీలపై చిన్న చూపును తిరిగి రుద్దడం కాదా?

వీటికి వైభవోపేతంగా సానుకూలత చూపించటం మీడియా చేస్తున్న అతిపెద్దనేరం. రాజకీయ నాయకులు వీటికి హాజరు కావటం, అధికారులు పట్టించుకోకపోవడం వారు బహిరంగంగా చేస్తున్న దుర్మార్గ మయిన చట్ట వ్యతిరేక చర్య.

చట్టానికి కట్టుబడిన వారెవరయినా చట్టం నిర్దేశించిన ఖర్చులో నిరాడంబరంగా వివాహం చేసుకోవాలి. నేతలు, అధికారులు వాటికే హాజరుకావాలి. ఆడంబరమయిన పెళ్ళిళ్ళు, బాల్య వివాహాలు, వరకట్న వివాహాలకు హాజరు కావటం ద్వారా వారు చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు.

మరోవైపున మహబూబ్‌నగర్‌లో దళితుడిని పెళ్ళి చేసుకున్నందుకు...కట్నంలేదు. ఆడంబరాలు లేవు. మనసులు కలిసిన పెళ్ళి చేసుకున్నందుకు దారుణహత్యకు గురయిన మాధవి ఉదంతం...ఎవరినీ కదిలించలా...మీడియా భూమ్యాకాశాలు ఏకం చేయలేదు. పాపం వాళ్ళకి గ్లామర్ లేదు, డబ్బులేదు. కాబట్టి అది ఎంత గాఢమయిన నిజాయితీ గల ప్రేమయినా సాదాగా పేదగానే మిగిలిపోయింది. ఆ వరుడి బాధ అతనికీ అతని మిత్రులకే పరిమితం అయింది.

కుల సమీకరణలతో రాజకీయ లబ్దిపొందుతున్న రాజకీయులు, అధికార ప్రతినిధులు పెద్దగా ఎవరూ నోరెత్తలేదు. అగ్రవర్ణాల కోపాన్ని భరించడం దేనికి? పోనీ మీడియా దీన్ని దళితులందరికీ చేరేలా ఈ అన్యాయంపై ఆక్రోశించిందా? ఏదో కంటితుడుపు వ్యవహారం జరిగింది.

స్త్రీలపై చిన్నచూపు కొనసాగడానికి పురుషాధిక్యత పెరగటానికి ఉద్దేశించిన కాలం చెల్లిన సాంప్రదాయాలు, క్రతువులు అదే రకం అయిన భావజాలాన్ని బలోపేతం చేస్తాయి. ఈ ధోరణి కొనసాగించడంలో స్వార్థ ప్రయోజనాలున్నాయి. కనుకనే వాటిద్వారా లాభపడే రాజకీయ నాయకులు, కులనాయకులు, సిన్మా తారలు, మీడియా వాటికి బాగా ప్రచారం కల్పిస్తున్నారు. దీని ప్రభావం వలన స్త్రీల హక్కులకు పరోక్షంగా నష్టం జరిగి. వివక్ష పెరుగుతున్నది. అది రకరకాల రూపాల్లో వ్యక్తం అయ్యి స్త్రీలు బలవుతున్నారు. కాబట్టే ఇటువంటి వివాహాలపై వాటి ప్రసారాలపై ఉదాసీనత లేకుండా చట్ట పరమయిన చర్యలు తీసుకోవాలి.

బ్రిటిష్ యువరాజును పెళ్ళి చేసుకున్న 'కేటీ' అతికరుడుగట్టిన సాంప్రదాయ పద్ధతిలో జరిగిన పెళ్ళిలో కూడా భర్తను "ఒబే." చేస్తాను అంటే లొంగి వుంటాను అనే పదాన్ని వాడటానికి నిరాకరించి వాడలేదు. బ్రిటీష్ రాజరికం కొద్దిగా అయినా సడలింపులిస్తున్నది.

మరి మన పుణ్య భారతావని మాత్రం రాన్రాను మరింత కరుడుగట్టిన సాంప్రదాయాల్ని పాటించే మధ్య కాలాలకు పయనం కడుతున్నది. ఈ తిరోగమనానికి అడ్డుకట్ట వేయకపోతే...ప్రమాదం. ☆

# నెలవంక

అమ్మ
చుక్క పొద్దుకు లేసి
చీపురు పడితే వాకిలి అద్దమయి
అతిథులకు స్వాగతం చెప్పేది

పొయ్యిలో పొరకబెట్టి
అగ్గిపుల్ల గీస్తే అన్నమయ్యేది
కుటుంబానికంతటికి ఆకలి తీర్చేది

పొయ్యి పైన వేడివేడిగా
వండిన గిన్నెలు మసిగుడ్డలేకనే
పొయ్యి దిగేవి

వండి వార్చిన గిన్నెలకు
బూడిదేసి తోమితే
కొత్తవై మెరిసి మురిసిపోయేవి

బావిలో బకీటేసి
చాంతాడుతో నీళ్ళు తోడితే
పాత నీరు ఖాళీ అయి
కొత్తనీటితో కళకళలాడేవి

వారానికోసారి ఎర్రమన్నుతో
ఇంటినంతా అలికి ముగ్గుపెడితే
ఇల్లంతా రవివర్మ ఆర్ట్
వేసినట్లుండేది

అల్లమెల్లిపాయ రోట్లో వేసి
రోకలి పడితే క్షణాల్లో అల్లంచట్నీ
ఘుమఘుమ లాడేది

పెసర్లు, కందులు
తిరగలిలో పోసి తిప్పితే
క్షణాల్లో పప్పు బయటికొచ్చేది

నాన్న నాగేటి చాలులో విత్తనాలేస్తే
విత్తనాలన్ని లెక్క తప్పక
చక్కగా మెలిసి మురిసేవి

కొడవలి బట్టి కలుపుతీస్తే
కలుపు మొక్కలన్నీ
చెత్తకుప్పలయ్యేవి

చాటబట్టి ధాన్యం చెరిగితే
తాలు, గింజలు, రాళ్ళు
వేరయి రాశులు పడేవి

పసిగుడ్డుకు తలంటు పోస్తూ
ముక్కు చెవులను శిల్పిలా
చక్కగ చేసేది

పోరగాని ఏడుపిని
పాలిచ్చి పడుకోబెట్టే
పానుపయ్యేది
ప్రతి పనికి
నిటారుగా నిలబడే అమ్మ
నేడు నెలవంకైంది.

-మిట్టపెల్లి శివాజీ

# నెరవేరిన నాసా స్వప్నం

**పరిమితికి మించితే..... పుడమికి సహనం ఎక్కువుంటుంది!! మితిమీరుతున్న జనాభాకి ఆవాసం కావాలి.... అది అంతరిక్షం అయితే ఓకే అంటూ 'డ్రీమ్ ప్యారడైజ్'ని రూపొందించింది పశ్చిమగోదావరి అమ్మాయి 'కుసుమ ప్రియ' ఇటుకుల అమ్మకం దారు కుమార్తెగా ఆర్థిక ఇబ్బందుల బాటలో చదువు సాగించి.... కలల ప్రాజెక్టుతో నాసాను మెప్పించి... అంతర్జాతీయ సదస్సులో పాల్గొనేందుకు వెళుతున్న కుసుమతో వసుంధర మాట్లాడింది.**

మన దేశ జనాభా నూట పాతిక కోట్లు. ప్రపంచ జనాభా లెక్క వింటే ఆ సంఖ్య చాలా పెద్దదే. ఈ పరిస్థితుల్లో కాలుష్యం, ప్రకృతి విపత్తులనుంచి తమను తాము కాపాడుకోవటానికి మానవులు ఏం చేయాలి? అంతరిక్షంలో మానవ జీవనం ఎంతవరకు సురక్షితం అనే అంశాల మీద నాసా ( నేషనల్ ఏరోనాటిక్స్ అండ్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్) ఏటా పోటీలు నిర్వహిస్తోంది. వివిధ దేశాలకు చెందిన ఎందరో విద్యార్థులు దీనిలో పాల్గొంటారు. నాసాకు చెందిన ప్రముఖ శాస్త్రవేత్తలను మెప్పించడమూ అంత సులువు కాదు. కానీ ఈ పరీక్షలన్నింటిని కుసుమ దాటింది. తన 'డ్రీమ్ ప్యారడైజ్'తో అందరినీ మెప్పించి వచ్చే నెలలో జరిగే అంతర్జాతీయ సదస్సులో పాల్గొనే అవకాశం సాధించుకొంది. ఒక సాధారణ కుటుంబం నుంచి వచ్చిన ఆమెను తన కలల పయనం గురించి అడిగితే ఇలా చెప్పుకొచ్చింది.

**అమ్మా నాన్నల ప్రోత్సాహం:** 'మాది పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లు. నాన్న వ్యాన్ డ్రైవరుగా పనిచేస్తూనే ఇటుకలు తయారుచేసి అమ్ముతారు. అమ్మ మనోహరి డిగ్రీ పూర్తిచేసింది. నాకో చెల్లెలు. అమ్మ చదువుకున్న మహిళ కావడంతో చిన్నప్పటి నుంచి మమ్మల్ని చదువులో ప్రోత్సహించింది. ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే అయినా అమ్మానాన్నలు చదువుకి సంబంధించి మాకే లోటు రానివ్వలేదు. నాన్న డ్రైవర్‌గా వున్నప్పుడు ఆయన పనిచేసిన బడిలో ఉచితంగా చదువుకున్నాను. చిన్నతనంలో అన్నింటా ప్రథమశ్రేణిలోనే ఉండేదాన్ని.

**వరుసగా అందిన ప్రేరణ....**

సరికొత్త ఆవిష్కరణలకి ప్రాణం పోసే సైన్స్ అంటే నాకు చాలా ఇష్టం. అంతరిక్షంలో అడుగిడి అద్భుతాలు చేసిన కల్పనాచావ్లా నా ఆరాధ్యదైవం. పదో తరగతిలో 600లకు 559 మార్కులు సాధించాను. నేను కోరుకున్నట్టే నూజివీడు ట్రిపుల్ ఐటిలో సీటు లభించింది. ఇక అక్కడి నుంచి నా కలని సాకారం చేసుకోవడానికి అడుగులు వేశాను. గత ఏడాది మా కళాశాల అమ్మాయి సాయిశ్రీ 'పద్మవ్యూహం'తో నాసా ప్రశంసలు పొందింది. ఆ స్ఫూర్తితో అదే బాటలో నడవాలనుకున్నాను. అదే సమయంలో మా ట్రిపుల్ ఐటీకి వచ్చిన అబ్దుల్ కలాం చేసిన ప్రసంగం ఎంతో ప్రేరణనిచ్చింది. అంతర్జాలంలో ఈ పోటీల పిలుపు ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూడటం ఆరంభించా.

**రెండు నెలలు.... అదే ధ్యాస**

పోటీల ప్రకటన వచ్చింది. ఏ ప్రాజెక్టు చేద్దామా అని ఒకటే ఆలోచన. ఈ పోటీల్లో పాల్గొనే వారి పరిశీలన కోసం నాసా కొన్ని పుస్తకాలు సూచిస్తుంది. అవన్నీ బాగా అధ్యయనం చేసాను. పెరుగుతున్న జనాభా, అందరికీ ఆవాసం కల్పించే ప్రత్యామ్నాయాల గురించి యోచిస్తున్నప్పుడు డ్రీమ్ ప్యారడైజ్ ఆలోచన తట్టింది. నాకు చిత్రలేఖనంలో ముందునుంచీ అభిరుచి వుంది. దాంతో నా ఆలోచనకి దృశ్య రూపం ఇచ్చాను. నా ఆలోచనలని ఎప్పటికప్పుడు లెక్చరర్లతో పంచుకుంటూ మెరుగులు దిద్దాను. తుదిరూపం రావడానికి రెండు నెలలు పట్టింది. నేను హాస్టల్లో ఉండి చదువుకుంటున్నాను. రోజువారీ చదువులకు ఏమాత్రం ఇబ్బంది కలగకుండా దానిని రూపొందించుకోడానికి చాలా శ్రమపడ్డాను. కానీ అది ప్రఖ్యాత నాసా పోటీలకు ఎంపిక కావడంతో ఆ కష్టం అంతా ఉఫ్ మని ఊదేసినట్టయింది.

**కలల సౌధం ఇలా...**

అంతరిక్షంలో మానవ నిర్మాణాలు సాధ్యమేనన్నది ఈ ప్రాజెక్టు సారం. చంద్రునిపై ఎటువంటి పేలుడు పదార్థాలు వినియోగించకుండా, జీవనానికి కావాల్సిన లోహాలను, ఖనిజాలను డ్రిల్లింగ్ చేసి సేకరించుకోవచ్చు. కార్బన్, ఆక్సిజన్‌ను ఉత్పత్తి చేసుకునే మార్గాలనూ దీనిలో వివరించాను. గురుత్వాకర్షణ శక్తి కోసం అంతరిక్ష కేంద్రాన్ని నిర్దేశించిన కక్ష్యలో నిరంతరం పరిభ్రమిస్తుండేలా చూడాలని తెలిపాను. మరి వంటలు, ఆహారం గురించి ఎలాగంటే...టిష్యూ కల్చర్ సాయంతో అధిక ఉత్పత్తి వంగడాలను కృత్రిమ క్షేత్రాల్లో పండించవచ్చు. విద్యుత్తు అవసరాలకు సౌరశక్తిని వాడుకోవాలి. పరిశ్రమల నుంచి వచ్చే శబ్ద తరంగాలను విద్యుత్తు తరంగాలుగా మార్చి కొంత శక్తినీ ఉత్పత్తి చేయ్యొచ్చు. ఇలా నేను ప్రతిఒక్క అంశాన్నీ వివరిస్తూ సమర్పించిన ప్రాజెక్టు శాస్త్రవేత్తలకు నచ్చింది. నాకీ అరుదైన అవకాశం వచ్చింది.

**అభినందనలన్నీ అమ్మానాన్నలకే....**

అమెరికాలోని ప్రఖ్యాత నాసాకు నేను వెళ్ళడానికి సన్నద్ధం అవుతున్నందుకు చాలామంది నన్ను అభినందిస్తున్నారు. అవన్నీ ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి నన్ను చదివిస్తున్న మా అమ్మానాన్నలకే చెందుతాయి. ఆ సదస్సుకి వెళ్ళాలంటే లక్షల్లో ఖర్చు అవుతుంది. అంత పెద్ద మొత్తాన్ని సమకూర్చడానికి కళాశాల యాజమాన్యం ప్రయత్నాలు చేస్తోంది. అందరి నుంచి అందుతున్న సహకారంతో మరింత ప్రతిభ కనబరిచేందుకు... భవిష్యత్తులో ఏరోనాటిక్స్, బయో ఇన్‌ఫర్మేటిక్స్ రంగాల్లో రాణించేందుకు కృషి చేస్తాను.

- ఈనాడు సౌజన్యంతో....

# ప్రమేయాలు - ప్రభావాలు

- శిలాలోలిత

భార్యాభర్తల మీద కుటుంబాల ప్రభావం, ప్రమేయం ఎక్కువైతే వచ్చే పరిస్థితులను గురించి మాట్లాడుకుందాం. మాకు తెలిసిన ఒక మంచి కుటుంబం వుంది. అనిత, శేఖర్ ఇద్దరిదీ అన్యోన్యమైన దాంపత్యం. ఎప్పుడు చూసినా నవ్వుతూ, నలుగురితో కలిసిపోతూ వుండేవాళ్ళు. చాలా పొదుపుగా, పద్ధతిగా, స్నేహంగా మెలిగేవారు. పెళ్ళయి నాలుగైదేళ్ళు అయ్యింటుందంతే. అతనిది చిన్నపాటి ఉద్యోగం ప్రైవేట్‌ది. ఎక్కువగా చదువుకోలేదు. ఆ అమ్మాయి ఎమ్‌సిఏ చేసింది. ఉద్యోగ ప్రయత్నాలు ఎక్కడ చేస్తున్నా, డిపాజిట్ అడగడం, అది లక్షల్లో ఉండటంతో ఎటూ పాలుపోక, మాథ్స్ ట్యూషన్స్ చెబ్తోంది. తెలివైన అమ్మాయి. వాళ్ళ గురించిన విషయాలు అంతవరకే తెలుసు.

ఒకరోజు సాయంత్రం అతను ఉరివేసుకోవడానికి ప్రయత్నించాడు. అదే సమయానికి మేమంతా అనుకోకుండా అక్కడ ఉండటం వల్ల, చుట్టుపక్కల వాళ్ళ సాయంతో తలుపులు పగులగొట్టి కాపాడగలిగాం. శేఖర్ ఎందుకలా చేశాడు? కన్నీళ్ళతో కదిలిపోతున్న వాళ్ళిద్దర్నీ ఓదార్చడం, కౌన్సిలింగ్ చేయడం సరిపోయింది. వాళ్ళిద్దరూ చెప్పిన విషయాలు చాలా ఆలోచించాల్సినవిగా అన్పించింది.



అనితా, శేఖర్‌లది పెద్దలు కుదిర్చిన పెళ్ళే. బంధువులే. పెళ్ళయి నాలుగైదేళ్ళయినా పిల్లలు పుట్టలేదనేది ఆరోపణ. ఇద్దరూ పరీక్షలు చేయించుకున్నాక, అతనిదే కొంతవరకూ లోపం. మందులు వాడితే కొంతకాలానికి పుట్టొచ్చు అని డాక్టర్లన్నారట. అనిత అత్తామామలకు అమ్మాయి మీద కోపం. వదిలెయ్యి వేరే పెళ్ళి చేస్తాం. కట్నం ఎక్కువొస్తుంది. అంత చదివింది అనేగానీ, ఉద్యోగం లేదు. పైసా సంపాదనలేదు. ఇద్దరికీ ఉద్యోగాలైతే నెలనెలా బాగా డబ్బులు పంపుతావనుకుంటే, కొద్దిగానే పంపుతున్నావ్. నువ్వు ఆ అమ్మాయికి విడాకులిస్తావా? లేదా? డబ్బులు ఎక్కువ పంపుతావా? లేదా? అని విపరీతమైన ఫోన్లు చేస్తూ, టెన్షన్ పెడ్తూ, వెళ్ళినపుడల్లా సాధిస్తూ శేఖర్‌ని సంఘర్షణకి గురిచేసేవారు.

ఇక అనిత తల్లితండ్రుల విషయానికొస్తే అబ్బాయి మంచివాడని, నిన్ను బాగా చూసుకుంటాడని, తక్కువ చదివిన వాడయినప్పటికీ, ఉద్యోగం మంచిది లేకపోయినా నువ్వు సుఖంగా వుంటావని ఇచ్చిచేసాం. 30 తులాల బంగారం పెట్టాం. మీ అత్తగారి కేదో బాగోలేదని అనుకోకుండా ఖర్చొచ్చిందని బ్యాంక్‌లో పెట్టారు. ఇంత వరకూ విడిపించలేదు. మాకు అనుమానంగానే వుంది. పిల్లలు కూడా లేరు. అదృష్టమింకా, వాడ్ని వదిలివచ్చేయ్యి. నీకు వేరే సంబంధం చూస్తాం. నువ్వు వచ్చేస్తావా లేదా? అని వీళ్ళు కూడా ఫోన్లు చేస్తూ, చుట్టాల దగ్గర అమర్యాదగా మాట్లాడ్డం వగైరాలు చేస్తున్నారు.

అనిత, శేఖర్‌లు ఈ రెండువైపుల నుంచి వస్తున్న దాడిని తట్టుకోలేకపోయారు. ఎలా ఎదుర్కోవాలో తెలీక సతమతమయ్యారు.

అనితా శేఖర్‌లు ఒకర్నొకరు ఎంతో ఇష్టపడుతూ హాయిగా జీవిస్తున్నారు. నన్ను చేసుకున్నాక అనిత సుఖపడింది లేదు. పనిమనిషిని పెట్టుకున్నా పైసలవుతాయని తానే అన్నిపన్లు చేసుకుంటుంటే చాలా బాధగా వుండేది. మా ఇద్దరి ఖర్చులు తగ్గించుకుని ఇంటికి డబ్బులు పంపడానికే ప్రయత్నించేవాళ్ళం. నన్ను మా అమ్మకంటే ప్రాణంగా చూస్తుంది. నన్నెంతో ఇష్టపడ్తుంది. పిల్లలు లేకపోయినా మేం బాధపడటంలేదు. గోల్డ్‌లోన్ వడ్డీ కట్టడానికే సరిపోవటంలేదు. వాళ్ళ అమ్మా నాన్నల ముందు ఎలా తలెత్తుకోను. ఇప్పుడు చేస్తున్న ఉద్యోగం కూడా పోయేటట్లుంది. ఆ తర్వాత ఎలా బతకడం? నేను చనిపోతే అనితన్నా సుఖపడ్తుంది. ఇంట్లో మా అమ్మ నామీద ఎంత ఒత్తిడి తెచ్చినా నేను అనితకు విడాకులు ఇవ్వలేను- అనేది శేఖర్ ఆవేదన.

వాళ్ళ బ్రతుకులు వాళ్ళని బ్రతకనీయకుండా ఇరువైపులా జరిగిన ఆధిపత్యాల పోరులో నలిగిపోయారు. పెళ్ళిచేసిన తర్వాత, వాళ్ళ జీవితాల్లోకి బలవంతంగా చొచ్చుకుపోయి పెత్తనం చేసే పద్ధతులు మారాలి. తల్లితండ్రుల్ని గౌరవించాలి. ప్రేమించాలి, ఆదరించాలి. బాధ్యత వహించాలి గానీ, ఇలా మూడోవ్యక్తి ప్రమేయం ఎంత తక్కువగా వుంటే అంత బాగుంటారు. ఆర్థిక సమస్యలనేవి లేనిదెవరికి? ఎంత చెట్టుకు అంతగాలి. వాళ్ళిద్దరూ ఒకరిపట్ల ఒకరు ప్రేమగా ఉన్నారు. కలిసి జీవించాలనుకున్నారు. అదిచాలు. విషయాలు పైకి ఒక రకంగా కనపడతాయి. మూలాల్లోకి వెళితే సమస్య స్వరూపం స్పష్టంగా తెలుస్తుంది. వాళ్ళ జీవితాల్లోకి బలవంతంగా జొరబడి అతలాకుతలం చేస్తుంటే, మౌనంగా ఉండటం, బాధపడటం, చచ్చిపోవాలనుకోవటం సరైంది కాదు. ఇతరుల జోక్యం ఎంత తక్కువుంటే అంత మంచిది.

వాళ్ళిద్దరూ ఇప్పుడు సంతోషంగా ఉన్నారు. అనితకు ఉద్యోగం దొరికింది. వాళ్ళవాళ్ళ అమ్మానాన్నలతో స్పష్టంగా మాట్లాడుకున్నారు. పరిస్థితుల్ని అర్థం చేసుకోవాలని చెప్పే ధైర్యాన్ని తెచ్చుకున్నారు.

మన మధ్యనే వుంటూ మన దృష్టికి రాని అనేక సమస్యలిలానే వుంటాయి. అయినా, సకాలంలో వాళ్ళ జీవితాల్ని కాపాడగలిగాం కదా అనే తృప్తి మిగిలింది.

# "జీవించు తల్లీ! జీవించు"

- రమా నరసింహం కాశీవఝుల

"కమలా".

వరండాలో గోడకి జారగిలి వార పత్రిక తిరగేస్తున్న 'ఆమె' ఆ పిలుపుకి తలెత్తి చూసింది.

అతగాడిని అక్కడ అలా చూడగానే ఆశ్చర్యానందాల జోడు కలయికతో ఆమె పెద్దకళ్ళు మరింత విశాలమయ్యాయి.

అంతవరకూ స్ఫుటంగా లేని స్వప్న వినోదాలన్నీ అనుభవంలోకి వస్తాయన్న లీలామాత్రపు ఊహే ఆమె నోచోట నిలవనివ్వడం లేదు. " అయ్యో! అలా నిలబడిపోయారేం? రండి. లోపలికి రండి". అని లోపలికి ఆహ్వానించి, కుర్చీ వేసి కూర్చోబెట్టి, త్రాగండంటూ చల్లటి మజ్జిగ చేతికిచ్చింది.

ఆ కబురు కాస్తా ఆడబడుచు చెవిన వేద్దామని రాకెట్లా దూసుకుపోయింది పెరట్లోకి.

"కమలా',

భుజాల మీద చేతులు వేసి ఎంతో ఆప్యాయంగా పిలిచింది ఆడబడుచుని.

నూతి వళ్ళెంలో కూచుని బట్టలుతుక్కుంటున్న కమలకి అది పరిచయమైన కంఠమే. అది వదినగారి గొంతు.

కానయితే- కమలకి సుతరామూ పరిచయం లేనిది అభిమానంతో కూడిన వదినగారి చల్లని చేతిస్పర్శ ఆ సమయంలో చిందులేస్తున్న ఆప్యాయతే. అలవాటు లేని దగ్గరితనానికి తత్తరపడుతూ వెనక్కి తిరిగి వదినగారికేసి చూసింది.

ఏవిటి- అని ఇంకా అడగనేలేదు. సమాచారం కాస్తా చెవిన వెయ్యనే వేసింది. అది విన్న కమలకి నడినెత్తిమీద రాయొచ్చి పడ్డట్టయ్యింది. " ముమ్మాటికీ నిజం. ఎందుకో అనుకుంటున్నావేమో. ఈ రాణీగారిని తీసుకుపోవడానికి ఆ రాజాగారు వేంచేసారన్నమాట. అదన్నమాట విషయం. లే లేచి మొహం కడుక్కుని ముస్తాబుకా. ఈ అవతారంతో ఎదురుబడేవ్...లే..లే..." అంటే ఊదరగొట్టేసింది కమలని. అణుబాంబు విస్ఫోటనం లాంటి తాకిడి తలలో.

"ఎలా రాగలిగారు...." తనలో తాను అనుకుంటూ నేనెందుకు ఎదురుబడటం. మీరంతా ఉన్నారుగా".

'ఎంతమందున్నా నీకు సాటి కాగలమా. నీతో ఏకాంతంగా మాట్లాడాలని తెగ ఉబలాటపడుతున్నట్టున్నాడు. వెళ్ళవమ్మా. నాజూకులుపోక". అందుకు అయిష్టంగా మొహం పెట్టింది కమల.

తన కబురు విని ఎగిరి గంతేస్తుందనుకున్న ఆబపడుచు, ఇలా ముభావంగా ఉండేసరికి వదినగారకి చెప్పొద్దూ.... మా చెడ్డ కోపం వచ్చింది. సమయంకాదని తమాయించుకుంది.

మరింకేవీ మాట్లాడకుండా బట్టలన్నీ ఉతికి, జాడించి, ఆరేసి, వంటింట్లోకి జొరబడింది కమల.

వంటపని చేసస్తూ ఇంట్లో వారి హడావిడిని ఓ కంట కనిపెడుతూనే వుంది కమల. అందరి మొహాలూ ఉత్సాహంతో కళకళలాడుతున్నాయి. అందునా చిన్నారి సుమతి సంతోషానికి పట్టపగ్గాలు లేవు.

ఔను మరి, చూసినపుడల్లా శనిమొహమా అని తిట్టిపోసే 'అత్త' అందుకు వ్యతిరేకంగా దగ్గరికి పిలిచి కూర్చోబెట్టుకుని తలంతా చిక్కుదీసి చక్కగా రెండు జళ్ళు వేసింది. స్నానం చేయించి చాకింటి సిల్కుగౌను తొడుక్కోనిచ్చింది. ఉన్న ఈ ఒక్క గౌనూ ఇంట్లో ఉండగా ఎందుకు వేసుకోనిచ్చారో ఆ పిల్లకేమీ అర్థం కాలేదు. ఎవరూ చెప్పకపోయినా ఈ సంరంభానికంతా కారణం ఈ మూలగదిలో కూచున్న వ్యక్తే అనిపించింది బుజ్జి సుమతికి.

ఎవరెంతగా హడావిడిపడుతున్నా కిమిన్నాస్తిలా వున్నది ఒక్క కమలే. తనకి సంబంధించిన వ్యవహారంలా తోచలేదామెకి. వేళకింత తింటూ గొడ్డులా పనిచేయ్యడం తప్పించి ఓ మగాడికి భార్యనన్న స్పృహ తనలో ఊహామాత్రంగా కూడా లేదు. ఇన్నేళ్ళుగా ఎవరూ గుర్తు చేసిందీలేదు.

కాని-ఈరోజు అతగాడి రాక అందరి మెదళ్ళకి చక్కగా పదును పెట్టింది.

ఆరేళ్ళ క్రితం- ఆరోజు "ఇప్పటికీ కమలకి కళ్ళకు కట్టినట్లుగా వుంది.

నడిరాత్రి అయ్యింది. "ఇప్పటికి ఇప్పుడు పొమ్మంటే ఎక్కడికి పోతాం. ఈపూటకి వుండనివ్వమంటూ" ఎంత బ్రతిమిలాడింది ఆయనని "ఇదేం ధర్మసత్రంకాదు" ఎంత నిక్కచ్చి ఈ గొంతులో.

అలా పుట్టిల్లు జేరిన తనని అక్కున జేర్చుకుని ఎంతగా ఏడిచింది తల్లి.

అత్తింటి వాళ్ళని తిట్టిపోసింది వదిన.

" నువ్వేమీ తిరిగి ఆఇంట కాలు పెట్టకు.కలో గంజో తిని మాతోపాటు వుండు జీవితం వెళ్ళమారక పోదు". అని భరోసా ఇచ్చాడు అన్నయ్య. ఈ భరోసాలోని సుళువు బెళువులకి తల్లడిల్లిపోయారు తల్లీ తండ్రి. ఇరుగు పొరుగుల ఎక్స్‌రే కళ్ళని, నిందాజనితమైన వారి వాక్ప్రవాహాన్ని తట్టుకుంటూ ఎడారిలో పూలు పూయించాలని ప్రయత్నిస్తోంది తను. " ఇప్పుడెందుకు వచ్చినట్లో. నేను కాదంటే చూసావా నీ పరిస్థితి?" అని హేళన చెయ్యడానికా....

ముఖమ్మీద ముత్యాల్లా పేరుకున్న స్వేదబిందువులని తన మెత్తటి చీర కొంగుతో అద్దుకుంటూ గదిలో అడుగు పెట్టింది కమల.

పెద్ద బింది పక్కన చిన్న బిందిలా తల్లి పక్కగా నిలబడుంది సుమతి. తల్లికి మాత్రమే వినపడేలా మెల్లగా అడిగింది " ఎవరమ్మా ఆయన" అంటూ.

"............"

" అమ్మా చెప్పవూ..........ఎవరీయన?"

".............."

"దా. ఇలా దా. నేనెవరో చెబుతా గానీ నా దగ్గరికొస్తావా".

"................."

" అలా దూరంగా నిలబడ్డావేం. ఇలా

వచ్చి నా దగ్గర కూర్చో, కమలా రేపు చీకటితో లేచి మనింటికి వెళిపోదాం. నాకుగా నేనొచ్చి పిలిస్తే రాననవని నాకు తెలుసులే".

ఇన్నాళ్ళుగా రానివాడివి ఇప్పుడెందుకు వచ్చావ్?" అని నిలెయ్యలేదు కమల. " ఈ నాటికి నేనవసరపడ్డానా??" అని ప్రశ్నలు కూడా వెయ్యలేదు.

పసివాడిని భూమ్మీద పడేసి, రెండో భార్య కన్నుమూసిన వైనం చెబుతున్నాడు కమల మొగుడు. భర్త మాటలు వింటున్నట్టుగా లేదు కమల. కిటికీ లోంచి బైటకు చూపు నిలిపి మౌనంగా నిలబడింది అంతే.

" అమ్మా ఎప్పుడూ చూడనేలేదు. ఎవరమ్మా ఈయన? మనని వాళ్ళింటికి రమ్మంటున్నాడెందుకని?"

" నీ తండ్రి అని చెప్పడానికి మనస్కరించక, మాటలు రాని మూగదానిలా, కళ్ళు విప్పార్చి చూస్తూ నిలబడింది కమల.

అంతలో సుమతిని రెండు చేతులూ పట్టుకుని ఒళ్ళో కూర్చోబెట్టుకున్నాడు కమల మొగుడు. తండ్రి పట్టునుంచి తప్పించుకోజూసింది సుమతి.

ఈ దృశ్యం చూడలేనట్టుగా కళ్ళు గట్టిగా మూసేకుంది కమల. తల్లితో కామోసు చెబుతున్నాడు.

" ఇంట్లో పరిస్థితి నాకు బొత్తిగా తెలీదండి. కమలనెలా ట్రీట్ చేసేదో తను చెప్పందే నాకెలా తెలుస్తుంది? ఇదిగో చూస్తున్నారుగా.....ఆరేళ్ళయినా ఏవీ మారలేదు. అప్పుడూ ఇలాగే మూగిమొద్దులా నిలబడేది".

అంతా విన్న కమలకి, మొగుడి కపటపు మాటలకి చాలా కోపం వచ్చింది. తనని మాటడనిచ్చేవారా తల్లీ కొడుకులు....తల్లి మాటలు విని ఒళ్ళు కుళ్ళబొడిచేసాడు కాదూ.......కాస్తంత సంశయం లేకుండా రాత్రయ్యేసరికి మళ్ళీ అదే ఒంటితో ఇష్టం వచ్చినట్లు ఆడుకునేవాడు. ప్రేక్షకమాత్రంగా భరించేది అన్నిటినీ.

అవును మరి తన లోపాలు తనవి.

సామాన్యమైన రూపు రేఖలు.

వానాకాలపు చదువు

వీటన్నిటినీ మించిన లోపం- మగపిల్లాడ్ని కనకపోవడం.

అన్నీ మించిన ఆ ఆఖరి లోపాన్ని భరాయించలేక పుట్టింటికి తరిమేసారు.

" తరిమేస్తే వచ్చేయ్యడమేనా...ఏమంత వయసు మించిపోయిందని? ఓర్పుగా వాళ్ళకి నచ్చచెప్పుకోవాలి?" గౌణిగారు అన్నావదిన.

భర్త ప్రవర్తన కంటే వీరి మాటలు భరాయించటం ఎంతో కష్టంగా తోచింది కమలకి. ఇలా మాట్టాడకపోతే--'' మగనలునుని కననంత మాత్రాన నువ్వేమీకాకపోయావా నీ మొగుడికి?'' గడ్డిపోచ విలువ కూడా లేదా బంధానికి? అనుంటే ఎంతో ఓదార్పుగా వుండేది కమలకి.

ఆకాశంలోంచి రాలిపడ్డ ఉల్కలా ఇవాళెందుకు ఇతగాడూడిపడ్డట్టో... వచ్చీ రాగానే తన అభిప్రాయంతో నిమిత్తం లేకుండా ఇంటి ఆడపిల్లని మొదటిసారి అత్తారింటికి పంపేవారిలా ఎందుకంత హైరానాపడిపోతున్నారు..........?

ఇలా ఆలోచిస్తున్న కమల " ఏమిటలా రాయిలా ఉలకవూ పలకవూ....'' అని గద్దిస్తున్న భర్తని మొదటిసారి చూసినట్టుగా తేరిపారజూసి" చాలా అలసిపోయినట్టున్నారు. విశ్రాంతి తీసుకోండి రేపు కలుద్దాం'' వడివడిగా ఆ గదిలోంచి బైటపడిది కమల. సుమతి తల్లిననుసరించింది.

తెల్లగా తెల్లారినా మూసిన తలుపుల వలన ఆ గదిలో ఎప్పట్లా చీకటి పరుచుకునే వుంది. చీకటికి అలవాటు పడ్డ కళ్ళు మూసిన గది కిటికీపై చూపు నిలవడానికి ప్రయత్నిస్తున్నాయి. కమల మనసులా ఆ కిటికీ కూడా ఎప్పుడూ మూసుకునే వుంటుంది. కమల చూపులు నిరాశగా ఆకిటికీపై తారట్లాడుతాయి.

ఈ కిటికీకి ఆవలంతా విశాలమైన పచ్చిక మైదానం.

స్వచ్ఛంగా, స్వేచ్ఛగా పరుగులు తీసే పిల్లల అల్లరికి కమల కనుబొమలు కోపంగా ముడుచుకోవటంలేదు.

విచ్చుకున్న పెదవుల మీదనుండి చిరునవ్వు మొహమంతా పాకి, కళ్ళల్లో బైరాయించింది.

వెంటనే లేచి గది తలుపులు బార్లా తెరిచేసి, కిటికీ రెక్కలని ఎడాపెడా తెరిచేసింది. ఆ కాస్త చప్పుడికే మేలుకొంది సుమతి. "భలే భలే. ఎంత బావుందో మన గది. ఈ కిటికీలోంచి ఎంత గాలొస్తుందో. లైటు వేసుకున్నంత వెలుగు గదిలో. మనం ఇకనుంచీ చీకట్లో వుండొద్దు. అయినా ఎందుకుండాలేం....?"

కూతురి మాటతీరుకి మురుస్తూ పకపకా నవ్వింది కమల. ఆమె నవ్వుతో ఇల్లంతా మారుమోగింది.

అది గ్రీన్ సిగ్నల్‌గా భావించి "హమ్మయ్య'' అనుకున్నారు అందరూ. సుమతికి ముస్తాబు చేసి, తను కూడా స్నానం చేసి, శుభ్రమైన చీర కట్టుకుని, కూతురితో సహా భర్త వున్న గదిలోకి అడుగు పెట్టింది కమల.

అప్పటికే ఇంటిల్లిపాదీ ఆ గదిలో పరివేష్టితులయ్యారు.

వస్తూనే కమల మొగుడికి దగ్గరగా వెళ్ళి అతడికి సుమతిచేత దణ్ణం పెట్టించింది. ఆ తరువాత తను కూడా పెట్టింది. ఊహించని ఈ చర్యలని అవాక్కై చూసారందరూ.

"శ్లేష్మంలో పడ్డ ఈగలా గిలగిలా కొట్టుకుంటున్న నా బ్రతుకులో మీరాక చాలా మార్పుని తీసుకొచ్చింది. నా స్థితిని నాకు తెలియజేసింది. అందుకు ఎంతో కృతజ్ఞురాలిని". అని భర్తనుద్దేశిస్తూ మాట్లాడిన కమల, తనవారికేసి తిరిగి కళ్ళనిండా చూస్తూ '' ఇన్నాళ్ళూగా మీ కడుపులో దాచుకున్నందుకు కృతజ్ఞతలెలా చెప్పుకోవాలో తెలియడంలేదు.

అయినా అందరికీ మాట. పుష్కలంగా వున్నవాటి కంటే లేనివాటికోసం పరుగులు పెట్టడం మానవ నైజం. నేనూ ఆ కోవలో దానినే.

ఇంతవరకూ నా జీవితంలో లేని గౌరవాన్ని దొరకబుచ్చుకోవాలనే ఆశతో ఉన్నదాన్ని. మీ అందరూ పెద్ద మనస్సుతో నన్ను ఆశీర్వదించండి". అని ముక్తాయించి, గిరుక్కున వెనుదిరిగి సుమతి చెయ్యి పట్టుకుని గుమ్మం దాటింది కమల.

అడ్డుకోబోయిన కుటుంబాన్ని వారిస్తూ " దయాదాక్షిణ్యాలతో జీవితాలు వెళ్ళవు. జీవితం వేరు జీవించడం వేరు.

దాని మానాన దాన్ని బ్రతకనిద్దాం". అంటూ గుమ్మంలో నిలబడి, వీధి మలుపు దాటేంత వరకూ కూతుర్ని చూసి, ధారాపాతంగా కారుతున్న కన్నీటిని రెండు చేతులా తుడుచుకుంటూ " పిచ్చితల్లి. ఏ వెలుగుల కోనవో ఈ ప్రస్థానం'' అనుకున్నాడు. ☆

# క్యాన్సర్

- డా॥ శ్యామలాంబ

క్యాన్సర్ వచ్చిందంటేనే మానసికంగా సగం చచ్చిపోతారు మనుషులు. భయంకర వ్యాధిగా భావిస్తారు. నిజమే. దాన్ని రాకుండా కాపాడుకునే అవకాశాలూ ఉన్నాయి. వస్తే నయం చేసే ఆపరేషనులు, మందులు కూడా ఉన్నాయి. భయపడే దానికంటే ఇది ఎందుకు వస్తుంది? దీన్ని ఎలా నివారించగలమో తెలుసుకుంటే చాలా వరకు భయాలు, అనుమానాలు దూరమవుతాయి.

1970 నుండి ప్రపంచంలో కాన్సర్ కేసులు పెరిగాయి. దీనికి కారణం మనం జీవించే కాలం 35-45 నుంచి 60-70 ఏళ్ళ వరకు పెరిగి ఎక్కువ కాలం జీవిస్తున్నాము. జీవన విధానము మారింది. ఫాస్ట్ ఫుడ్స్‌కు (కొవ్వు ఎక్కువ) అలవాటు పడుతున్నాము.

పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో కాన్సర్ కేసులు మన దేశం కంటె ఎక్కువ. అయితే వాళ్ళు తీసుకునే జాగ్రత్తల వల్ల మరణాల రేటు తక్కువ. మన దగ్గర అవగాహన లేక, నివారించుకునే పద్ధతులు తెలియక, సరైన సమయంలో వైద్యం అందక కాన్సర్ రోగులు ఎక్కువగా చనిపోతున్నారు.

కారణాలు తెలుసుకున్నపుడు నివారణ గురించి అవగాహన పెరుగుతుంది.

**కాన్సర్ రావడానికి కారణాలు:-**

1. ఆహారంలో పీచు తక్కువ, కొవ్వు ఎక్కువ కావటం వల్ల స్త్రీలకు రొమ్ము కాన్సర్.

2. పొగతాగటం, పొగాకు నమలటం వల్ల ఊపిరి తిత్తుల కాన్సర్, గొంతు కాన్సర్.

3. మద్యం విపరీతంగా తీసుకోవటం వల్ల పిల్లల్లో, పెద్దల్లో లివర్ కాన్సర్ వస్తుంది.

4. జనాభాలో ఎక్కువగా అంటువ్యాధుల వల్ల కూడా కాన్సర్ రావటానికి అవకాశాలు ఎక్కువ. ఇంకా హెపటైటిస్-బి, హెచ్ఐవి, ఎయిడ్స్ వంటివి వచ్చే అవకాశాలు కూడా ఎక్కువ.

5. పర్యావరణంలో ఉండే రేడియేషన్ వల్ల, ఎక్స్‌రే కిరణాలు, అల్ట్రా వయొలెట్ కిరణాలు, ట్రాన్స్‌ఫార్మర్లకు దగ్గరగా ఉండటంవల్ల, క్రిమి సంహారక మందులు, సౌందర్య సాధనాల వాడకం వల్ల కూడా కాన్సర్‌కు కారణమవుతాయి.

**రాకుండా జాగ్రత్తలు:-**

1. పెరిగే వయసులో పొగ, మద్యం తాగటం నిషేధించాలి.

2. రేడియేషన్ తగ్గించుకోవాలంటే అవసరమైతేనే ఎక్స్‌రేలు తీయించుకోవాలి.



ట్రాన్స్‌ఫార్మర్‌కు దూరంగా ఉండాలి.

3. లివర్ కాన్సర్ రాకుండా హెపటైటిస్ బి వాక్సిన్ తీసుకోవాలి.

4. ఆహారం చాలా వరకు ఇంట్లో చేసినది, తాజా కూరగాయలు, 90శాతం కాయగూరలు, 10 శాతం మాంసం ఉండాలి. ఆహారంలో పీచు ఎక్కువగా ఉండాలి.

5. సిమెంట్, జౌళి పరిశ్రమల్లో పనిచేసేవారికి దుమ్ము, ధూళివల్ల కాన్సర్ రావచ్చు. ఈ పరిశ్రమల్లో పనిచేసేవారు ప్రతి 6 నెలలకు ఒకసారి వైద్యుని సంప్రదించి పరీక్షలు చేయించుకోవాలి.

6. పరిశ్రమలనుండి వచ్చే కాలుష్యం గాలి, నీరు, తినే ఆహారంలో చేరకుండా ప్రజలు, ప్రభుత్వం జాగ్రత్తలు తీసుకోవాలి.

కొన్ని జన్యుపరమైన కారణాలవల్ల కూడా కాన్సర్ రావచ్చు. మనిషికి కాన్సర్ వచ్చినపుడు వెంటనే సరైన వైద్యం తీసుకున్నప్పుడు చాలామంది మళ్ళీ మామూలుగా ఆరోగ్యంగా ఉంటున్నారు.

జబ్బు ముదరకముందే కింది లక్షణాలను బట్టి వైద్యుని సంప్రదించాలి.

**లక్షణాలు:**

1. స్తనంలో గడ్డలాగా తగిలినపుడు అనుమానం కలిగినపుడు వెంటనే వైద్యుని సంప్రదించి సలహాలు తీసుకోవాలి.

2. పుట్టుమచ్చ పెద్దదైనపుడు.

3. జీర్ణ కోశం పనితీరులో తేడా అంటే అప్పుడపుడు వాంతులు, విరోచనాలు, లేక మలమూత్రాలలో రక్తం పోవటం.

4. మామూలు దగ్గు ఎక్కువ రోజులుంటే, మందులకు నయం కానపుడు.

5. గొంతు బొంగురుపోవటం. నోటిలో పుండు నయం కానపుడు.

6. కణితి శరీరంలో చేతికి తగిలినపుడు.

7. ఏ కారణం లేకుండా బరువు తగ్గుతున్నపుడు తప్పకుండా జనరల్ చెకప్‌తోపాటు కాన్సర్ స్క్రీనింగ్ టెస్ట్ చేయించుకోవాలి.

8. ఎక్కువగా తెల్లబట్ట, ఎక్కువ ఋతుస్రావం లేక నెల మధ్య మధ్యలో బట్ట కావటం ఉంటే గర్భకోశం కాన్సర్ ఉందేమో అని పరీక్ష చేయించుకోవాలి.

9. ఎక్కువ కాలం హార్మోనులు అంటే గర్భనిరోధక మాత్రలు లేక ఈస్ట్రోజన్ టాబ్లెట్‌లు వాడుతున్నపుడు ఆరోగ్యం గురించి తరచు చెకప్ చేయించుకోవాలి.

10. ఎక్కువగా పొగ తాగటం, మద్యం సేవించే అలవాటు వుంటే గొంతు కాన్సర్, లివర్ కాన్సర్ వచ్చే అవకాశాలు ఎక్కువ కాబట్టి ఎప్పటికపుడు వైద్యునిచే పరీక్షలు చేయించుకోవాలి.

ఆడవాళ్ళలో ఎక్కువగా వచ్చేది రొమ్ము కాన్సర్, గర్భ కోశ కాన్సర్. వీటిని గురించి తెలుసుకున్నపుడు తగు జాగ్రత్తలు, నివారణా చర్యలు చేపట్టవచ్చు.

**రొమ్ము కాన్సర్(బ్రెస్ట్ కాన్సర్):-** ఈ కాన్సర్ ఆరోగ్యంగాఉన్న స్థూలకాయులకు, మధ్య వయస్కులకూ, శారీరక శ్రమ చేయని వారికి ఎక్కువగా కనిపిస్తుంది. **ఉదా:** అమెరికాలో ఎక్కువ. ప్రపంచంలో ప్రతి ఏటా 9లక్షల రొమ్ము కాన్సర్ కేసులు నమోదవుతున్నాయి.

35నుండి 50 ఏళ్ళ వయసులో గాని తరువాత 65ఏళ్ళ తరువాత కూడా రావచ్చు.

మనదేశంలో సరాసరి 42 ఏళ్ళ వయసు వారికి ఈ కాన్సర్ వచ్చే అవకాశాలు ఉన్నాయి. అయితే బయటి దేశాల వాళ్ళు 53 ఏళ్ళు సరాసరి వయస్సు వారిలో వస్తుంది.

జన్యుపరంగా కుటుంబంలో ఇద్దరికి వచ్చే అవకాశం ఉంది. పెళ్ళి కానివాళ్ళలో, ఆలస్యంగా (30 ఏళ్ళ తర్వాత) పిల్లలను కన్నవాళ్ళలో రొమ్ము క్యాన్సర్ ఎక్కువ. ఆహారంలో ఎక్కువ కొవ్వు పదార్థాలు వాడటం వల్ల స్థూలకాయం ఉన్న వాళ్ళలో ఎక్కువ.

**నివారణ పద్ధతులు:**

1. వంటి బరువు మీద, తినే ఆహారంలో, తరువాత సరైన వ్యాయామంతో (యోగ లేక నడక) నియంత్రణ ఉంచాలి. శరీర బరువును పెంచే కొవ్వు, పచ్చళ్ళు , డీప్ ఫ్రై చేసిన ఆహార పదార్థాల నుంచి లేక ఎక్కువగా బీఫ్, గొర్రె మాంసం తినే వాళ్ళు బరువు పెరిగే అవకాశం ఉంది. 90 శాతం పీచుగల కూరగాయలు మన ఆహారంలో ఉండాలి. మాంసం 10 శాతం మన ఆహారంలో ఉంటే అప్పుడు మన ఆరోగ్యం బాగుంటుంది.

2. ఆరునెలలకొకసారి వైద్యుని సంప్రదించి వైద్య పరీక్షలు చేయించుకోవాలి.

3. కణితి అరచేతికి తగిలినపుడు వెంటనే వైద్యుని సంప్రదించాలి. సరైన సమయంలో శస్త్ర చికిత్స జరిగినపుడు మందులతో నయం అవుతుంది.

**గర్భసంచి ముఖద్వార కాన్సర్:**

గర్భసంచి ముఖద్వార కాన్సర్ (సర్వికల్ కాన్సర్)ప్రస్తుతం సమాజంలో ఎక్కువగా ఉంది.

**కారణాలు:-**

1. బాల్య వివాహాలు, పూర్తిగా పెరగముందే పిల్లలను కనడం.

2. ఎక్కువ సార్లు గర్భం దాల్చిన వాళ్ళలో కనిపిస్తుంది.

3. పేదవాళ్ళలో ఎక్కువ కనిపిస్తుంది. 18ఏళ్ళ లోపు వయస్సులోనే వివాహం, పిల్లలు పుట్టడం, వ్యక్తిగత శుభ్రత లోపించినపుడు.

4. ఎక్కువగా గర్భ నిరోధక మాత్రలు వాడినపుడు లేక ఈస్ట్రోజెన్ వాడినపుడు.

**నివారణ:-**

వ్యక్తిగత శుభ్రత, ప్రత్యేకంగా యోని శుభ్రత అవసరం.

పిల్లలు ఇద్దరు లేక ముగ్గురు చాలు. పిల్లకు పిల్లకు మధ్య 3 ఏండ్లు వ్యత్యాసం ఉండాలి.

పరిమిత కుటుంబం- ఆరోగ్యకరమైన కుటుంబం.

గర్భ సంచి కాన్సర్‌ను (కనుక్కోగలము) కింది పద్ధతులు ద్వారా:

**1 పాప్ స్మియర్ టెస్ట్:** ప్రతి మూడు సంవత్సరాలకు ఒకసారి ఈ పరీక్ష మంచి వైద్యునిచే చేయించుకోవాలి.

పాప్ స్మియర్‌లో కాన్సర్ కణాలు ఉన్నట్లయితే సరైన ఆపరేషన్, లేక మందుల వల్ల నయమై చాలా కాలం జీవిస్తున్నారు.

2. ఎక్కువ తెల్లబట్ట లేక అప్పుడపుడు ఎర్రబట్ట అయినపుడు తక్షణమే వైద్య పరీక్షలు చేయించుకుని వైద్యం చేయించుకోవాలి.

కాన్సర్ అనేది ఏ అవయవానికైనా రావచ్చు. చర్మానికి రావచ్చు, పిల్లల్లో కంటికి లేక బ్లడ్ కాన్సర్, బ్రెయిన్ కాన్సర్ రావచ్చు. పెద్ద వాళ్ళలో గొంతు, అన్నవాహిక, లివర్, కిడ్నీ, పెద్ద పేగు, మర్మాంగంలోనూ రావచ్చు. కండరాలకు రావచ్చు. తక్షణమే వైద్య సహాయం తీసుకోగలిగినపుడు జీవితాంతం ఆరోగ్యంగా గడపవచ్చు. ముందు భయం వద్దు, సమస్య ఉన్నపుడు దానిని నివారించడం కూడా చేసుకోవచ్చు.

నైట్రోజమైన్స్‌ను మన ఆహారంలో లేకుండా చూసుకోవాలి. అవి నిల్వ ఉంచిన పచ్చళ్ళు, మళ్ళీ మళ్ళీ మరగపెట్టి వాడిన ఆయిల్, శీతల పానీయాలలో ఉంటాయి.

ఆడవాళ్ళలో వచ్చే రొమ్ము కాన్సర్, గర్భసంచి కాన్సర్‌లను చాలా వరకు జాగ్రత్తల వల్ల రాకుండా కాపాడుకోవచ్చు. వచ్చినా సరైన వైద్యుని సంప్రదించి వైద్యం చేయించుకుంటే నయం కావటానికి మందులున్నాయి.

**రాకుండా ఎలా నియంత్రించాలి?**

**స్క్రీనింగ్ టెస్ట్:**

1. పెళ్ళికి ముందు, తరువాత ప్రతి మూడు ఏండ్లకు ఒకసారి పాప్ స్మియర్ టెస్ట్ చేయించుకోవాలి. దీనితో కాన్సర్ తొందరగా నిర్ధారించి వైద్యంతో నయం చేయవచ్చు. ఇది వ్యక్తిగత పరిశుభ్రత లేని వారికి ఎక్కువగా అవకాశం ఉంది.

2. అనుమానం కలిగిన వెంటనే వైద్యుని సంప్రదించి పరీక్ష చేయించుకోవాలి.

**గొంతు కాన్సర్:**

ఆడవాళ్ళలో(8%) మగవాళ్ళలో (16.6%) గొంతు కాన్సర్ సంభవిస్తుంది. మన దేశంలో అన్ని దేశాలతో పోలిస్తే ఈ క్యాన్సర్ శాతం ఎక్కువ.

**కారణాలు:** పొగాకు నమలటం, చప్పరించటం, పొగ త్రాగటం, తమలపాకు నమలటం, ఖైనీ నమలటం, చుట్టను వెలిగించిన వైపు నోటిలో పెట్టుకుని పొగ పీల్చటం వల్ల ఈ అంగిలి క్యాన్సర్ వస్తుంది. కోస్తా ఆంధ్రలో ఈ అలవాటు ఎక్కువ.

**గర్భసంచి కాన్సర్:**

ప్రపంచంలో రొమ్ము కాన్సర్ తరువాత ఎక్కువగా వచ్చేది గర్భసంచి కాన్సర్.

**కారణాలు:-** (హెచ్‌పివి) వైరస్ కారణం అంటారు. విశృంఖల లైంగికత్వం.

25-45 మధ్య వయస్సు ఉన్న వాళ్ళకు కూడా రావచ్చు.

**చిన్న వయసుల్లోనే పెళ్ళి, పిల్లలు కన్న వారికి ఈ కాన్సర్ వచ్చే అవకాశాలుఎక్కువ.**

వంశ పారంపర్యంగా కూడా వచ్చే అవకాశం ఉంది.

పులిపిరులు కూడా కారణం కావచ్చు.

వేశ్యల్లోకూడా ఈ కాన్సర్ ఎక్కువ.

# ఉద్యమాల బాటలో

## మార్చి-8 అంతర్జాతీయ మహిళా దినోత్సవాలు

మార్చి-8 అంతర్జాతీయ మహిళా దినోత్సవ శతాబ్ది ఉత్సవాల ముగింపు సందర్భంగా ఐద్వా, వర్కింగ్ ఉమెన్, ఉపాధ్యాయ




అనంతపురం జిల్లా

ఫెడరేషన్ మహిళా విభాగంతో కలిసి రాష్ట్రంలో 168 సెంటర్సులో సదస్సులు, ప్రదర్శనలు జరిగాయి. దాదాపు 15,000 మంది ఈ సదస్సులో పాల్గొన్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో పోరాడి సాధించుకున్న చట్టాలు, హక్కులు కూడా కాలరాయబడుతున్నాయని, ఈ కాలంలో ప్రభుత్వ ఉద్యోగాలలో కాంట్రాక్టు కార్మిక మహిళల సంఖ్య పెరిగిందని, అసంఘటిత రంగంలో పనిచేస్తున్న లక్షలాది మంది మహిళలు కనీస వేతనాలు, పనిగంటలు, ప్రసూతి సెలవులు వంటి కనీస సౌకర్యాలు కూడా లేక శ్రమ దోపిడీకి గురవుతున్నారని అసంఘటిత రంగంలో పనిచేస్తున్న మహిళల సమస్యలపై పనిచేయాలని సదస్సులలో పిలుపునిచ్చారు. నూతన టెక్నాలజీ మహిళలపై వేధింపులు, హింస పెరగటానికి దోహదపడుతున్నాయని మహిళలపై నేరాలు అరికట్టాలని డిమాండ్ చేసారు.

నూరేళ్ళ అంతర్జాతీయ మహిళా దినోత్సవాల సందర్భంగా ఐద్వా రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో రాష్ట్ర మహిళా కమీషన్ పునరుద్ధరించాలని డిమాండ్ చేస్తూ రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది. 1992లో అసెంబ్లీ ఆమోదంతో రాష్ట్ర మహిళా కమిషన్ ఏర్పడింది. 2007లో అవినీతి ఆరోపణలతో ఛైర్‌పర్సన్‌ను, సభ్యులను తొలగించి ఇప్పటి వరకూ కమీషన్‌ను పునరుద్ధరించలేదు. రాజ్యాంగబద్ధంగా ఏర్పాటు చేయబడ్డ మహిళా కమిషన్ బాధ్యతలు చాలా విస్కృతమైనవి. రాష్ట్ర మహిళలకు ప్రభుత్వానికి మధ్య వారధిలాగా ఉంటూ మహిళల హక్కులను, సమస్యలను తీసుకోవాల్సిన చర్యలనూ ప్రభుత్వం ముందు ఉంచగలగాలి. రాష్ట్రంలో మహిళలకు సంబంధించిన అంశాలను నిరంతరం అధ్యయనం చేయాలి. జనాభా విధానం, మహిళా సంక్షేమ పథకాలకు బడ్జెట్‌లో నిధుల కేటాయింపు, మహిళా చట్టాల అమలు, మార్పులు, చేర్పులు తదితర మహిళలకు సంబంధించిన అంశాలపై నిర్ణయాలు తీసుకునేటపుడు మహిళా కమీషన్‌ను సంప్రదించాల్సి ఉంటుంది. కానీ నేడు ప్రభుత్వం ఆ స్ఫూర్తిని పూర్తిగా దెబ్బతీస్తూ దీనినొక రాజకీయ పునరావాస కేంద్రంగా మార్చింది. ఐద్వా రౌండ్ టేబుల్ సమావేశంలో మహిళా కమిషన్‌ను వెంటనే పునరుద్ధరించాలని. మహిళా కమిషన్‌ను స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించాలని, ఇది రాజకీయ పునరావాస కేంద్రంగా మార్చకూడదని, తీర్మానించింది. ఈ సమావేశంలో దాదాపు 12 మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు పాల్గొన్నాయి.

## మార్చి-31 ఉదయంగారి వర్ధంతి

18 జిల్లాలలో 20 సెంటర్సులో మోటూరు ఉదయం వర్ధంతి సభలు జరిగాయి. రాష్ట్ర కేంద్రంలో వర్ధంతి సందర్భంగా




ప్రకాశం జిల్లా

కుటుంబ న్యాయ సలహా కేంద్రం వార్షికోత్సవ సభ జరిగింది. సభకు మల్లు స్వరాజ్యంగారు అధ్యక్షత వహించగా స్త్రీ శిశు సంక్షేమ శాఖ




నల్గొండ జిల్లా

ప్రిన్సిపల్ సెక్రటరి శ్రీమతి ఛాయారతన్, గృహహింస రక్షణ చట్టం రక్షణాధికారి రాజ్యలక్ష్మి హాజరయ్యారు. సభలో ట్రస్టు అధ్వర్యంలో



పశ్చిమ గోదావరి జిల్లా

జరుగుతున్న కృషిని ప్రశంసిస్తూ, ట్రస్టు కార్యక్రమాల నిర్వహణా విస్తరణకు మరింత కృషి చేయాలని పేర్కొన్నారు.

నల్గొండ జిల్లాలో మహిళలు- చట్టాలు, ఆరోగ్య సమస్యలపై



హైదరాబాద్

అవగాహన సదస్సులో ముఖ్య అతిథిగా జిల్లా సూపరిండెంట్ ఆఫ్ పోలీసు శ్రీ రాజేష్‌కుమార్ గారు, డా॥ సుచరిత పాల్గొని ప్రసంగించారు. ఒంగోలులో మహిళలపై పెరుగుతున్న హింస- పరిష్కార మార్గాలు అనే అంశంపై సదస్సు జరిగింది. సదస్సులో సీనియర్ జడ్జి జి.రామ్‌గోపాల్, డా॥ టాన్యా, డా॥ ఉదయిని ప్రసంగించారు. ఏలూరులో కుటుంబ సమస్యలు పరిష్కారాలు అనే అంశంపై సదస్సు జరిగింది.



విజయవాడ నగర కమిటి అధ్వర్యంలో స్వయం సహాయక సంఘాల సమస్యలపై 1200 గ్రూపులను సర్వే చేసింది. సర్వేలో వచ్చిన లోన్స్, పావలావడ్డీ, బ్యాంకులు పెట్టే ఇబ్బందులు,


విజయవాడ

అభయహస్తం, దీపం పథకం మొదలైన సమస్యల పరిష్కారానికి నగర కార్పొరేషన్ ఆఫీసు ముందు 1500 మంది డ్వాక్రా మహిళలతో ధర్నా జరిగింది. కమిషనర్ సమస్యలు పరిష్కరిస్తామని వాగ్దానం చేసారు.

### స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం

స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో ఇంటి పనివారల సమస్యలపై ర్యాలీ నిర్వహించి, లేబర్ కమీషనర్ గారికి వినతి పత్రం సమర్పించడం జరిగింది.



హైదరాబాద్


హైదరాబాద్

### భ్రూణ హత్యలు అరికట్టాలి

స్కానింగ్ కేంద్రాలపై చర్యలు తీసుకుని, భ్రూణ హత్యలకు అరికట్టాలని కోరుతూ కర్నూలు కలక్టరేట్ ఎదుట ఐద్వా ఆధ్వర్యంలో ధర్నా నిర్వహించారు. ఐద్వా రాష్ట్ర ఉపాధ్యక్షురాలు పి. నిర్మల మాట్లాడుతూ మహిళలపై హింస పెరిగిపోతోందని, అందులో భాగంగానే భ్రూణహత్యలు జరుగుతున్నాయని, లింగ నిర్ధారణ నిరోధక చట్టం వున్నా అమలుకు నోచుకోవడం లేదని జిల్లాలో 220కి పైగా స్కానింగ్ సెంటర్లు వున్నాయనీ వాటిపై సరైన నిఘా లేదని మరోపక్క బాలికల నిష్పత్తి గణనీయంగా తగ్గిపోతున్న ఈ నేపథ్యంలో ఇలాంటి భ్రూణ హత్యలను నిరోధనపై నివారణ ఎంతైనా అవసరం వుందని వాటికోసం తగ్గిన చర్యలు సత్వరమే తీసుకోవాలని కర్నూలు జిల్లాలో మూడవసారి ఆడపిల్ల పుడతుందని తెలిసి భర్తచేతిలో ఘోరంగా హత్య చేయబడిన 6 నెలల గర్భిణీ సురేఖ పిల్లలకు నష్టపరిహారం చెల్లించి ఆమె భర్తను శిక్షించి, స్కానింగ్ కేంద్రాలపై చర్యలు తీసుకోమని కలెక్టర్ రాంశంకర్‌కు వినతిపత్రం అందజేసారు.

## తగ్గిపోతున్న బాలికల నిష్పత్తిపై

ఏప్రియల్ 1,2తేదీలలో జరిగిన ఐద్వా రాష్ట్ర కమిటీ సమావేశం 2011 జనాభా లెక్కలలో జాతీయ స్థాయిలోనూ రాష్ట్రంలోనూ 0-6 వయస్సులో బాలికల నిష్పత్తి తీవ్రంగా పడిపోవటాన్ని ఆందోళన వ్యక్తం చేసింది.. ఇది గతంలో 945 ఉంటే 914కి తగ్గింది. అంటే ప్రతి వెయ్యి మంది బాలుర సంఖ్యకు ఇపుడు అదనంగా 30పైన బాలికలు తగ్గారు. ఇది భవిష్యత్తులో అనేక తీవ్ర పరిణామాలకు, సామాజిక అసమానత్వానికి దారితీసే ప్రమాదం ఉంది.దీనిపై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వెంటనే స్పందించి ఒక ఎక్స్‌పర్ట్ కమిటీ ఏర్పాటు చేసి బాలికల సంఖ్య పెంచేందుకు తక్షణ చర్యలు చేపట్టాలని ఐద్వా డిమాండ్ చేస్తున్నది.

స్త్రీ పురుష నిష్పత్తిలో తేడా తగ్గింది. అయితే సమాజంలో నెలకొని ఉన్న వివక్ష, అసమానత వంటి వాస్తవికతకు ఇది భిన్నంగా ఉండడం గమనార్హం.ఇది భారీగా పెరిగిన పురుషుల వలసలు, మద్యం ఇతర అనేక కారణాలు దానికి నిదర్శనం కావచ్చు. స్త్రీల స్థితిగతులపై వాటి కారణాలపై ఈ జనాభా లెక్కల ప్రాతిపదికన లోతయిన అధ్యయనం చేసి, స్త్రీ సామాజిక, ఆర్థిక, రాజకీయ స్థాయి మెరుగు పర్చేందుకు ప్రభుత్వం దృష్టి కేంద్రీకరించాలని ఐద్వా కోరుతున్నది.

అక్షరాస్యతలో మహిళల శాతం పెరిగినప్పటికీ ఇంకా దాదాపు 35 శాతం నిరక్షరాస్యులుగా ఉన్నారు. గిరిజనులు, వెనుకబడిన వర్గాల స్త్రీలలో ఈ శాతం మరీ తక్కువ. ప్రభుత్వం ఎంతో ఆర్భాటంగా ప్రారంభించిన క్షేత్రస్థాయిలో కానరాని "సాక్షర భారతి"ని సక్రమంగా నడిపించేందుకు బాలికల డ్రాపవుట్స్ తగ్గించేందుకు సత్వర చర్యలు అవసరం. ☆

# స్పందన

చైతన్య మానవికి జనవరి టు మార్చి సంచికలో మధురవాణి వ్యాసం చదువుతున్నపుడు తనలోని మానవత్వం, ఆత్మగౌరవం హృదయాన్ని కదిలించింది. ఇంతకుముందు (చదవకముందు) మధురవాణి అంటే ఒక వేశ్య అనే చులకన భావం ఉండేది. వృత్తి ధర్మం వేరు మానసిక పరిపక్వత అని తెలుసుకున్నాను అలాగే వెంగమాంబ గురించి ఒక భక్తురాలుగానే తెలుసు. చదివిన తరువాత ఆమె వ్యక్తిత్వం గురించి, ఆమెలో వున్న కవయిత్రి గురించి తెలుసుకున్నాము. 17వ శతాబ్దంలో మూఢ సాంప్రదాయాల మీద ఆమె చేసిన తిరుగుబాటు అబ్బురపరిచింది, ఇక వసుంధర కథ మహిళగా, బంధం నలుగుతూ అడుగడుగునా అవమానింపబడుతూ, ఆత్మాభిమానాన్ని నిలబెట్టుకుని, ఆత్మగౌరవంతో ఎలా బ్రతకాలో చెబుతున్నట్టుగా వుంది. మానవి రేటు పెంచినా శీర్షికలు చాలా బావున్నాయి. మిగతా అన్ని శీర్షికలతోపాటు ఆరోగ్య సలహాలకు ఒక పేజీ కేటాయిస్తే

## రాజ్యసభలో బిల్లు ప్రవేశపెట్టిన ప్రభుత్వం

చిన్నారులపై లైంగిక నేరాలకు పాల్పడే నిందితులను కఠినంగా శిక్షించేందుకు ఉపకరించే సమగ్ర బిల్లును ప్రభుత్వం పార్లమెంటులో ప్రవేశపెట్టింది. దీని ప్రకారం నిందితులకు పదేళ్ళ కారాగార శిక్ష విధిస్తారు. అవసరమైతే యావజ్జీవంగా పొడిగింపుతో పాటు జరిమానా విధించే అవకాశం చట్టం కల్పిస్తుంది. ఈమేరకు లైంగిక నేరాలు చిన్నారుల సంరక్షణ బిల్లు 2011ను కేంద్ర మహిళా శిశుసంక్షేమశాఖ మంత్రి కృష్ణతీర్థ్ రాజ్యసభలో ప్రవేశపెట్టారు. దీన్ని స్టాండింగ్ కమిటీకి నివేదించనున్నారు.

## చైతన్యమానవి పత్రికను సైకిల్‌పై తిరుగుతూ అమ్ముతున్న నెల్లూరు జిల్లా నాయకురాలు రమమ్మ (55)





# జిల్లాల వారీగా జనాభా, జనసాంద్రత, అక్షరాస్యత వివరాలు

| జిల్లాలు | జనాభా-2011 | | | సాంద్రత (చ.కి.మీ.) | | అక్షరాస్యత (శాతం) | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తం | పురుషులు | మహిళలు | 2001 | 2011 | మొత్తం | పురుషులు | మహిళలు |
| ఆదిలాబాద్ | 2737738 | 1366964 | 1370774 | 154 | 170 | 61.55 | 71.22 | 51.99 |
| నిజామాబాద్ | 2552073 | 1252191 | 1299882 | 295 | 3214 | 62.25 | 72.66 | 52.33 |
| కరీంనగర్ | 3811738 | 1897068 | 1914670 | 295 | 322 | 64.87 | 74.72 | 55.18 |
| మెదక్ | 3031877 | 1524187 | 1507690 | 275 | 313 | 62.53 | 72.50 | 52.49 |
| హైదరాబాద్ | 4010238 | 2064359 | 1945879 | 17649 | 18480 | 80.96 | 83.35 | 78.42 |
| రంగారెడ్డి | 5296396 | 2708694 | 2587702 | 477 | 707 | 78.05 | 84.00 | 71.82 |
| మహబూబ్‌నగర్ | 4042191 | 2046247 | 1995944 | 191 | 219 | 56.06 | 66.27 | 45.65 |
| నల్లగొండ | 3483648 | 1758061 | 1725587 | 228 | 245 | 65.05 | 74.93 | 55.05 |
| వరంగల్ | 3522644 | 1766257 | 1756387 | 253 | 274 | 66.16 | 75.91 | 56.45 |
| ఖమ్మం | 2798214 | 1391936 | 1406278 | 161 | 175 | 65.46 | 73.20 | 57.85 |
| శ్రీకాకుళం | 2699471 | 1340430 | 1359041 | 435 | 462 | 62.30 | 72.25 | 52.56 |
| విజయనగరం | 2342868 | 1161913 | 1180955 | 344 | 358 | 59.49 | 69.04 | 50.16 |
| విశాఖపట్టణం | 4288113 | 2140872 | 2147241 | 343 | 384 | 67.70 | 75.47 | 60.00 |
| తూర్పుగోదావరి | 5151549 | 2569419 | 2582130 | 454 | 477 | 71.35 | 74.91 | 67.82 |
| పశ్చిమగోదావరి | 3934782 | 1963184 | 1971598 | 491 | 508 | 74.32 | 77.63 | 71.05 |
| కృష్ణా | 4529009 | 2268312 | 2260697 | 480 | 519 | 74.37 | 79.13 | 69.62 |
| గుంటూరు | 4889230 | 2441128 | 2448102 | 392 | 429 | 67.99 | 75.40 | 60.64 |
| ప్రకాశం | 3392764 | 1712735 | 1680029 | 174 | 192 | 63.53 | 73.53 | 53.40 |
| నెల్లూరు | 296682 | 1493254 | 1472828 | 204 | 227 | 69.15 | 75.93 | 62.30 |
| వైఎస్ఆర్ | 2884524 | 1454136 | 1430388 | 169 | 188 | 67.88 | 78.41 | 57.26 |
| కర్నూలు | 4046601 | 2040101 | 2006500 | 200 | 229 | 61.13 | 71.36 | 50.81 |
| అనంతపురం | 4083315 | 2064928 | 2018387 | 190 | 213 | 64.28 | 74.09 | 54.31 |
| చిత్తూరు | 4170468 | 2083505 | 2086963 | 247 | 275 | 72.36 | 81.15 | 63.65 |
| ఆంధ్రప్రదేశ్ | 84665533 | 42509881 | 42155652 | 277 | 308 | 67.66 | 75.56 | 59.74 |



# సంస్కర్త కందుకూరి

**ఏప్రిల్ 16 కందుకూరి జయంతి సందర్భంగా**

కందుకూరి వీరేశలింగం సంఘ సంస్కర్తగా తెలుగువారి వేగుచుక్క. మూఢత్వాన్ని, దురాచారాలను చీల్చి చెండాడిన సాహసికుడు. అంధ విశ్వాసాలు, కులతత్వాలు, అవినీతి, అవలక్షణాలు, దురాచారాలపై ఆయన ప్రత్యక్ష పోరాటం చేయడమే గాక ప్రహసనాల ద్వారా పిడుగులు కురిపించారు. అందులో అనేకం ప్రసిద్దంగా ప్రజల నాల్కలపై నాట్యమాడటం స్వయంగాగమనించి ఆనందపరవశుడయ్యాడు. వేశ్యాలోలత్వం, బాల్య వివాహాలు, బహు భార్యాత్వం, ప్రజా ధనాపహరణం, టక్కరితనం, పటాటోపం వంటి సాంఘిక జాడ్యాలకు పాల్పడే వారి పోకడలను తూర్పార పట్టే పలు సంభాషణాత్మక ప్రహసనాలు ఆయన అందించారు.

వీరేశలింగం అనగానే వితంతు పునర్వివాహాలు ప్రధానంగా గుర్తుకొస్తాయి గాని సమాజంలో పేరుకుపోయిన ప్రతి చెడునూ ఆయన చీల్చి చెండాడాడు. ఆచారాలు, శాస్త్రాల పేరిట సాగిన బూటకాలను పటాపంచలు చేశారు. పెద్ద మనుషుల అల్పబుద్ధులను బదాబదలు చేశాడు. ఆనాటికి అది గొప్ప సాహసమే. ఈనాటికి కూడా వాస్తు పేరిట, శకునాల పేరిట సాగే తతంగాలను చూస్తూనే వున్న మనం వీరేశలింగం అన్నేళ్ళ కిందటే వాటిని వినోదాత్మకంగా, విశ్లేషణాత్మకంగా చెప్పిన తీరుకు విస్తుపోకుండా ఉండలేము. వ్యాధులకు చికిత్స అవసరం గాని మందులతో తగ్గదని మరో ప్రహసనం. గ్రహణాల చుట్టూ అల్లుకున్న నమ్మకాలపై మరో మతాబు చూస్తే ఇస్రో అధినేత ప్రదక్షిణలు గుర్తుకు వస్తాయి. కులతత్వాలను కూడా అప్పటికే ప్రస్తావించారు.

స్త్రీ విద్యతోపాటు స్త్రీలలో సామాజిక చైతన్యాన్ని పెంపొందించేందుకు, వారిలో దాగి ఉన్న సృజనాత్మకతను వెలికి తెచ్చేందుకు స్త్రీల పత్రికల అవసరాన్ని వీరేశలింగం గుర్తించాడు. 1883లో 'సతీ హితబోధిని'ని ప్రారంభించాడు. ఈ పత్రికలో స్త్రీల ఆరోగ్యం, చిన్న పిల్లల ఆరోగ్యం, స్త్రీ విద్య లాంటి విజ్ఞానదాయకమైన రచనలు వెలువడేవి. కేవలం రచనలతోనే సరిపెట్టుకోక వీరేశలింగం రాజమండ్రిలో బాలికల లోయర్ సెకండరీ పాఠశాలను 1905లో స్థాపించారు. ఈ పాఠశాల ఆయన స్థాపించిన వితంతు శరణాలయానికి అనుబంధంగా ఉండేది. వీరేశలింగం ప్రారంభించిన ఉద్యమం అనేకమందికి స్ఫూర్తిదాయకంగా నిల్చింది. ఎందరో స్త్రీల విద్యా వ్యాప్తికి విరాళాలివ్వడం, పాఠశాలలను స్థాపించడం, అధికసంఖ్యలో ఆడపిల్లలను చదివించడం వీరేశలింగం కృషి ఫలితాలుగా చెప్పుకోవచ్చు. స్త్రీ విద్యతోపాటు వారి అభ్యున్నతికి సమావేశాలు, సభలు ఉపన్యాసాలు, విద్యా సాంస్కృతిక కార్యక్రమాలు ఆంధ్రదేశంలో అనేకచోట్ల ఆరంభమైనాయి. ఇవి స్త్రీల అభ్యున్నతికి తోడ్పడ్డాయి.

స్త్రీలలో పెల్లుబికిన ఈ చైతన్యం ఎంతోమందిని రచయిత్రులుగాను, వ్యాసకర్తలుగాను తీర్చిదిద్దింది. పాత భావాలను వదిలిపెట్టి మారుతున్న పరిస్థితులకనుగుణ్యంగా కొత్త భావాలతో చదువుకున్న స్త్రీలు ప్రజా జీవితంలోకి ప్రవేశించారు. వీరేశలింగం మొదలుపెట్టిన స్త్రీ జనోద్ధరణ సంస్కరణోద్యమాల్లో భాగంగా పెంపొంది ఆ తర్వాత 20వ శతాబ్దంలో రూపుదిద్దుకున్న జాతీయోద్యమానికి బాసటగా నిల్చింది.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMVOLA 131 |
| పుస్తకం పేరు | చైతన్య వాహిని |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | Sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |